శ్రీమద్వేదాంతదేశిక ప్రణీతమైన

# గరుడపంచాశత్ - అర్చనావ్యాఖ్యానము - గరుడదండకము

శ్రీమాన్ ఐ. భాష్యకారాచార్యులు



పరిష్కర్త

న్యాయవేదాంతవిద్వాన్

**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**

**శ్రీమద్వేదాంతదేశిక ప్రణీతమైన**

**గరుడపంచాశత్ - గరుడదండకము - అర్చనావ్యాఖ్యానము**

శ్రీమాన్ ఐ. భాష్యకారాచార్యులు

**Garuda Panchashat - Garudadandakam -**

by ***Srimadvedanta Desika*** with **Archana Commentary** of

***I. Bhashyakaracharyulu***



ప్రథమముద్రణ - స్వభాను-గరుడపంచమి

ప్రతులు : 1000

మూల్యము : రూ. 75/-



ఆధ్యాత్మికగ్రంథప్రచురణ సహాయం అను పథకం క్రింద
తిరుమల తిరుపతి దేవస్థానమువారు అందించిన
ఆర్థికసహాయంతో ముద్రింపబడినది

భారద్వాజ ప్రచురణలు - 6

**For Copies :**

**1. Smt. E. Jayalakshmi**
18-3-58/7, Shanti Nagar, K.T.Road
Tirupati - 517 507 (A.P.) Ph. : 0877-2232091

**2. Smt. K. Vijayalakshmi**
A-Block, Ground Floor 1, Baabji Apartments
Kottavalasa - 531 183, Vijayanagaram Dist.

**అక్షరయోజనము మరియు ముద్రణ**

**అన్నపూర్ణ గ్రాఫిక్స్ ఆఫ్‌సెట్ & స్క్రీన్ ప్రింటర్స్**
53/4, ఆర్.ఎస్. గార్డెన్స్, తిరుపతి
ఫోన్ : 0877-2235006 & 2287844

# గరుడమహిమ

**దాసో మిత్రం తాళవృంతం వితానం పీఠం వాసో వాహనం చ ధ్వజశ్చ ।**
**ఏవం భూత్వానేకధా సర్వదాఽసౌ శ్రీశం శ్రీమాన్ సేవతే వైనతేయః ॥**

ప్రపంచంలోని ప్రాచీన పురాణ సాహిత్యాలు అన్నిటిలో పలువిధాలైన దేవతామూర్తులు చాలా విచిత్రమైన రీతిలో చిత్రీకరింపబడ్డాయి. ఆ వర్ణనల ఆధారంగా తరువాతి కాలంలో ఆయా దేవతల స్వరూప స్వభావాలు, ఆరాధనలు ఏర్పడ్డాయని ఆధునిక పరిశోధకుల భావన. కాలగర్భంలో వీనిలో కొన్ని తెరమఱుగు అయినా, ఈ నాటికీ కొన్ని ఆరాధనలు మాత్రం నిలచియున్నాయి. దీనికి సంప్రదాయసాహిత్యమే కాకుండా, శిల్పకల, చిత్రకళ, విగ్రహకళ మొదలైనవి కూడా దోహదం చేశాయని చెప్పాలి. ఈ అంశాలు అన్నీ భారతీయప్రాచీనసంప్రదాయానికి పూర్తిగా వర్తిస్తాయి. ప్రాచీన భారతీయ సాహిత్యంలో కనుపించే కొన్ని మూర్తులు, వాటి ఆరాధనలు క్రమంగా అంతరించిపోయినా, ఈ నాటికీ కొన్ని మాత్రం స్థిరంగా నిలచిఉన్నాయి. వీటిలో కూర్మ, వరాహ, హంస, గరుడ, వృషభ, మూషక, మయూరాదితిర్యగ్రూపాలు, గజానన, హయగ్రీవ, నరసింహాది సంకీర్ణరూపాలుకూడా ఉండడం విశేషం. వీటి అన్నిటిలో గరుడుని స్థానం ప్రత్యేకమైనది. వేదకాలంనుండి కన్పించే ఈ దేవతామూర్తి ఆరాధన క్రమంగా బహుముఖంగా విస్తరించి, ఈనాటికీ చెక్కు చెదఱకుండా ఉన్నది. ఈ గరుడమూర్తికి చెందినకొన్ని అంశాలు స్థాలీపులాక న్యాయంగా ప్రస్తావింపబడుతున్నాయి.

**వైదిక వాఙ్మయంలో గరుడుడు :-** వైదిక సాహిత్యంలో, ఆ తరువాత ఉద్భవించిన లౌకిక సాహిత్యంలో కన్పించే గరుడుని స్వరూపంలోతేడా ఉన్నప్పటికీ,వేదకాలంలో గరుడుని ప్రస్తావన ఉన్నదనేది నిస్సందేహం.ఋగ్వేదంలోని **"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్" (1-164,46) "అరిష్టనేమిం పృతనాజ మాశు స్వస్త్యయే తార్క్ష్య మిహా హువేమ (10-178-1)**ఇత్యాది సూక్తాల్లో కన్పించే సుపర్ణ, తార్క్ష్య, గరుత్మత్ శబ్దవాచ్యుడు తరువాతి పురాణకాలంలో గరుడుడే అని కొందఱి ఆధునిక విమర్శకుల అభిప్రాయం. J.N.Banerjee అను విమర్శకుడు "Development of Hindu Iconography అను గ్రంథములో "In many passages of the great epic,Garuda is formally identified with his Vedic Garutman" ఇత్యాదిగా పల్కుట ఇందులకొక తార్కాణము. ఋగ్వేదములోని వర్ణనలనుబట్టి గరుత్మంతుడు అందమైన ఱెక్కలనుకల దైవశక్తిసముపేతుడైన పక్షి స్వరూపుడుగా తెలుస్తున్నది.

ఋగ్వేదములో వేరొకచోట (4-26-4) వాసుదేవశబ్దవాచ్యుడైన ఇంద్రుడు శ్యేనరూపమున అమృతమును హరించెనని కలదు. మఱియొకచోట (4-27-3) ఈశ్యేనరూపుడు సుపర్ణుడనియు తెలుపబడినది. దీనిని బట్టి సుపర్ణ శబ్దవాచ్యుడు ఋగ్వేదమున శ్యేనరూపుడుగా భావింపబడినట్లును తెలియుచున్నది. మఱియు పురాణ, ఇతిహాస వాఙ్మయములో స్పష్టముగా కనుపించు గరుడ- సర్ప విరోధవృత్తాంతముకాని, గరుడ సర్పవిషహరణవృత్తాంతము కాని వేదవాఙ్మయములో కనుపించదు. అధర్వణ వేదములో సర్పవిషదూరీకరణ సూక్తములు కొన్ని (5-4-63) కలవు. కాని, ఇవి సర్పవిషమునకు చెందినవనుట స్పష్టముగా కానరాదు. ఋగ్వేదములోని ఖిలసూక్తములు కొన్నిటిలో గరుడునకు సర్పములతో గల సంబంధమును ప్రస్తావింపబడినను ఆసూక్తములు ప్రక్షిప్తములని విమర్శకుల అభిప్రాయము. ఈ కారణములనుబట్టి ఋగ్వేదకాలీనసుపర్ణాదిశబ్దవాచ్యుడు', పురాణేతిహాస కాలములోని గరుడుడు వేర్వేరు అని మరికొందఱి పరిశీలకుల అభిప్రాయము.

ఋగ్వేదములో గరుత్మంతుడు సుపర్ణశబ్దముచే నిర్దేశింపబడుటచే సుపర్ణునకు చెందిన లక్షణములన్నియు తరువాతి కాలమున గరుడునియందు భావింపబడినట్లు తోచును 'అతడు వైదిక ఛందోరూపుడు' గాయత్రీ స్వరూపుడుగా సుపర్ణాధ్యాయమున తెలుపబడినది. ఇట్టి సుపర్ణ గరుడుల అభేదభావనబట్టి క్రమముగా అధర్వణవేదములోని విషనివారణ సూక్తములు గరుడుని విషహరునిగా పేర్కొనియుండవచ్చును. (ఉదాహరణకు **"సుపర్ణ స్త్వా గరుత్మాన్ విషం ప్రథమ మావయత్"** (5-4-6-3) కాని, విశేషమే మనగా ఇచట ప్రసక్తమైన విషము సర్పవిషమే అనుట స్పష్టముగా కనుపింపదు.

**బ్రాహ్మణములలో సుపర్ణుడు** : సంహితలకు పిమ్మట బ్రాహ్మణవాఙ్మయము పరిఢవిల్లినది. మొట్టమొదటిగా సర్పగరుడవిరోధవృత్తాంతప్రసక్తి బ్రాహ్మణములలో కానవచ్చుచున్నది. ఐతరేయ బ్రాహ్మణమునందు గరుడుని ఱెక్కలనుండి నెమళ్లు పుట్టినట్లు, నకుల జాతికిని (ముంగిస జాతి) గరుడుడు మూలమనియు తెలుపబడినది. నెమళ్లు, ముంగిసలును సర్పములకు విరోధులై వధించుట ప్రత్యక్షసిద్ధము. కద్రువ (సుపర్ణి) వినతలమధ్య సంభవించిన పందెము మాత్రము అందు కానరాదు. ఛందోరూపుడైన సుపర్ణుడు దేవతల ఆజ్ఞచే సోమరసమును (అమృతమును) తెచ్చినట్లు కలదు ఆ సూక్తమిది. **"సోమో వై రాజాఽ ముష్మిన్ లోక ఆసీత, తం దేవా శ్చర్ష చాభ్యధ్యాయన్ కథ మయ మస్మాన్ సోమో రాజాఽ గచ్ఛేదితి తేఽ బ్రువన్ ఛందాంసి యూయం న ఇమం సోమం రాజాన మాహరతేతి. తథేతి తే సుపర్ణా భూత్వా ఉదపతన్"** (2-25). ఇందు సుపర్ణుడు ఛందోరూపుడుగా తెలుపబడుట గమనింపదగినది.

జైమినీయ బ్రాహ్మణములో (2-440) వేరొక వింత వృత్తాంతము ప్రస్తుతమైనది. అసురులు దేవతల గోవులను అపహరింపగా, దేవతలు తను ఆ గోవులను తీసికొనివచ్చి ఇవ్వవలసినదిగా సుపర్ణుని ప్రార్థించిరి. కాని,సుపర్ణుడు అసురుల ప్రలోభమునకులోనై దేవతలకు సహాయపడలేదని అందు ఒక కథ కలదు. ఈ బ్రాహ్మణములో కన్పించు ఈ క్రింది వాక్యము మహాభారతములో ప్రస్తావింపబడిన గరుడుడు గజకచ్ఛపములను మోసికొనిపోవు వృత్తాంతమునకు



మూలమని ఆధునిక విమర్శకులు కొందఱు తలచుచున్నారు. ఆ వాక్యమిది. **సనానవే సవనే సమగృహ్ణాత్ ఇమాని చానయో రక్షాణి ముఖేన చైకం సవనమ్, సహ సర్వే గవైయజ్ఞేన ఆగచ్ఛత్ (1-238)**

**ఆరణ్యకవాఙ్మయములో గరుడుడు** : ఆరణ్యకవాఙ్మయము ఉద్భవించినకాలమునకు గరుడుని ప్రాధాన్యము మఱింత పెరిగినది. కృష్ణయజుర్వేదమునకు చెందిన తైత్తిరీయ ఆరణ్యకములోగల -**"తత్పురుషాయ విద్మహే సువర్ణ పక్షాయ ధీమహి, తన్నో గరుడః ప్రచోదయాత్** (10-1-6) అను గరుడగాయత్రి ఇందులకు ఒక తార్కాణము.ఇట్టి వాక్యములే గరుడ-సుపర్ణుల అభేదభావనకు హేతువులైయుండవచ్చునని నవీన విమర్శకుల ఊహ.

**ఉపనిషత్తులలో గరుడుడు** : అధర్వణవేదమునకు చెందిన, గరుడబ్రహ్మవిద్యగా పేరొందిన గరుడోపనిషత్తు గరుడుని వైభవమును విస్తరముగా ప్రతిపాదించుచున్నది. ఈ ఉపనిషత్తు వేదకాలమునాటిది కాదని, నవీనమని భావించువారును కలరు. కృష్ణావతార సమయమున గరుడుడు గోవర్ధన పర్వతములో ఒక గొప్ప వటవృక్షముగా ఆవిర్భవించెనని అందు కలదు.

తైత్తిరీయసంహితలో **"కద్రూ శ్చ వై సుపర్ణీ చాత్మరూపయో స్పర్ధేతామ్"** ఇత్యాదిగా కద్రూ-సుపర్ణ (వినత)ల స్పర్థనుగూర్చిన ప్రస్తావన కలదు. దీనిని మహాభారతములోగల సుపర్ణో పాఖ్యానముతో పోల్చినపుడు కొన్ని వ్యత్యాసములు కన్పించుచున్నవి.గరుడుడు అమృతమును తీసికొనివచ్చిన అంశము రెండిటియందు సమానము.తైత్తిరీయములో విశ్వావసువు అను గంధర్వుడు అమృతమును తీసికొనిరాగా,కృష్ణశబ్దవాచ్యుడు వజ్రమును ప్రయోగించెనని కలదు. కాని, మహాభారతములోని కథనుబట్టి ఈ రెండును నిర్వహించినవాడు ఇంద్రుడే. వజ్రాయుధముపై గల గౌరవముతో గరుడుడు తన ఱెక్కలోని ఒక ఈకను వదలిన అంశము తైత్తిరీయములో లేదు.కద్రువ నాగమాత అనుటకు, వినత సుపర్ణుని తల్లి అనుటకును తైత్తిరీయ సంహితలో స్పష్టమైన ఆధారములు లేవు. తైత్తిరీయములో కద్రువ భూమితో, సుపర్ణి ఆకాశముతో అభేదముగా భావింపబడిరి. విశ్వావసువు అను గంధర్వుడు సోమరసమును గాయత్రినుండి తీసికొనిపోయెను. ఉపనిషత్తులలో ఇంకను పలు విశేషములున్నను దిఙ్మాత్రముగా ప్రస్తుతింపబడినవి.

**ఆగమములలో గరుడుడు** : పాంచరాత్ర, వైఖానసాది ఆగమ సంహితలలో గరుడునకు సంబంధించిన వివరములు అనేకములు కలవు. దేవాలయములలో గరుడుని మూర్తికి సంబంధించిన వివరములు, తత్ప్రతిష్ఠాక్రమము, అట్లే బ్రహ్మోత్సవసమయములలో ధ్వజపటమునందు చిత్రింపబడు గరుడుని ఆకారవిశేషము, తదారాధనా విధానము - ఈ విధముగా పలు అంశములు ఆయా సంహితలలో విస్తృతముగా నిరూపింపబడినవి. ఉదాహరణకు పాద్మసంహితలో (22వ అధ్యాయము) పరివారదేవతలను గూర్చి నిరూపించు సందర్భమున గరుడుని రూపము ఇట్లు నిర్దేశింపబడినది. "గరుడం కనక ప్రఖ్యం నీల నాసాగ్ర సంయుతం, దక్షిణేతర విస్తీర్ణం విచిత్ర పృథువక్షసమ్, దంష్ట్రా **కరాళవదనం భ్రుకుటీ కుటిలేక్షణమ్, కరండికా ముకుటినం సర్వాభరణభూషితం, విచిత్ర కంచుకధరం**

**భుజగేంద్రైరలంకృతమ్, హృది పుష్పాంజలిధరం స్థిత మాసీన మేవ వా, దక్షిణేతరయో రేక పాదయోః కుంచితం భవేత్, పృష్ఠతోఽన్యో యథా యోగం యద్వా పద్మాసనం భవేత్".** ఇట్లే శ్రీమన్నారాయణ సంహితలో ధ్వజ పటమునందు లిఖింపబడు గరుడుని రూపము "అథ వక్ష్యే శ్రుణు బ్రహ్మన్ **ధ్వజోత్థాపన ముత్తమమ్ . . . . క్షౌమం కార్పాసకం వాపి ధ్వజముత్థాపయేత్ క్రమాత్, తన్మధ్యే నవతాలేన** గరుడం కాంచన **ప్రభమ్, వినీలనాసికాయుక్తం సవ్యపాదే చ కుంచితమ్, శ్వేతాంబరధరం రత్నకిరీటాద్యైః విభూషితమ్, హారకేయూరసంయుక్తం పక్షవిక్షేప సంయుతం, గగనే గమనాకారం సర్వభూషణశోభితమ్, ధృతోర్ధ్వపుండ్రతిలకం యుక్త మంజలిముద్రయా, వైనతేయం సమాలేఖ్య"** ఇత్యాదిగా వర్ణింపబడినది. వైఖానససంహితలలో గరుడుని ఆవాహన చేయు సమయమున పఠించు గరుడ గద్యాదులును తెలుపబడినవి. దేవాలయములలో జరుపబడు ఆరాధన క్రమములో పలు ముద్రలు కలవు. వానిలో గరుడముద్ర ఒకటి. దీని వివరము కూడ ఆగమసంహితలలో చెప్పబడినది. ఇట్టి విశేషములు అనేకములు. విస్తరభీతిచే వానిని ప్రస్తుతించుట లేదు మరియు అవి ఉపదేశగమ్యములు కూడా.

**తంత్ర శిల్ప శాస్త్రాదులలో గరుడుడు :** మహానిర్వాణ తంత్రము, తంత్రాలోకము, శిల్పరత్నము మానసారము మొదలగు తంత్ర, శిల్ప శాస్త్రములలో గరుడుని రూపమును గూర్చిన వివరములు కలవు. బృహత్తంత్రసారము మొదలగు గ్రంథములలో గరుడుని మాలామంత్రము అంగన్యాస, కరన్యాసాదులు, గరుడ యంత్రోద్ధారము మొదలగునవి విస్తృతముగా నిరూపింపబడినవి. విష్ణువుకు వాహనముగా యున్న గరుడుని రూపము, ప్రత్యేకముగా నున్న గరుడుని రూపములలో కూడా భేదము కలదు. వాహనరూపుడైన గరుడుడు ద్విభుజుడు కాగా, అట్లు కాక వేరుగానున్న కొన్నిచోట్ల ద్విభుజుడుగా కొన్నిచోట్ల చతుర్భుజుడుగా, మరికొన్నిచోట్ల అష్టభుజుడుగా నిరూపింపబడినాడు. విష్ణు ధర్మోత్తరములోని "ఛత్రం తు పూర్ణకుంభం చ కరయోః తస్య కారయేత్, కరద్వయం తు కర్తవ్యం తథా విరచితాంజలిః, యదాస్య భగవాన్ పృష్ఠే **ఛత్రకుంభధరౌ కరౌ, న కర్తవ్యౌ తు కర్తవ్యౌ దేవ పాదధరౌ శుభౌ"** అను వాక్యములు, **"ఉపేంద్రస్యాగ్రతః పక్షీ గుడాకేశః కృతాంజలిః . . . . ద్విబాహుః పక్షయుక్తశ్చ కర్తవ్యో వినతాసుతః"** అను శ్రీతత్త్వనిధిలోని వాక్యములు, శిల్పరత్నములోని "పాయాద్దేవో గరుత్మానమృతఘుట గదా శంఖచక్రాసి నాగాన్, బిభ్రాణః కృష్ణపాదో నిజకరకమలై రష్టభి స్స్వర్ణవర్ణః" ఇత్యాది వాక్యములును ప్రమాణములుగా గ్రహింపనగును. ఇట్టి వివరములు ఆయా గ్రంథములు అనేకములు కలవు.

**ఇతిహాసములలో గరుడుడు :** ఇతిహాసములు రెండిటిలో మొదటిది అగు శ్రీరామాయణములో ఇంచుమించు అన్ని కాండలలో పలుచోట్ల గరుడుని ప్రస్తావనకలదు. ఉదాహరణకు బాలకాండలో గంగావతరణ వృత్తాంతమున,అయోధ్యాకాండలో **"య న్మంగళం సుపర్ణస్య వినతాఽ కల్పయత్ పురా"** ఇత్యాదిగా కౌసల్యాదేవి శ్రీరామునకు మంగళామాశాసించినపుడు, అరణ్యకాండలో జటాయు వృత్తాంతములో, కిష్కింధాకాండలో సంపాతివృత్తాంతమునందు సుందరకాండలో **"వైనతేయ సమా కేచిత్"** ఇత్యాది పలు సూక్తులలో, యుద్ధకాండలో నాగపాశమోచన ఘట్టమున, ఉత్తరకాండలో



మాలివధసందర్భమున గరుడుని ప్రస్తావనకలదు. సగరుని మనుమడు అగు అంశుమంతునకు ఆకాశ గంగను పాతాళలోకమునకు కొనిపోయి, భస్మమైన పితృదేవతలకు సద్గతిని కల్గింపుమని గరుడుడు ఉపదేశించెను. (సగరుని భార్య సుమతి గరుడుని సోదరి) ఈ విధముగా దేవ గంగను భూమికి తెచ్చుటకు గరుడుడును కారణము.

గరుడుని అవతారము : గరుడుని అవతారము శ్రావణమాస శుక్లపక్షమున స్వాతి నక్షత్రములో పంచమీ తిథియందు సంభవించెనని చెప్పబడుచున్నది. కావుననే దానికి గరుడ పంచమి అని పేరు. గరుడుని జన్మ నక్షత్రమగు స్వాతి నక్షత్రము వేదము 'నిష్ట్యా' అనుచూ పొగడినది. దీనికే జ్యోతిర్నక్షత్రము అనియూ పేరు కలదు. ఈ నక్షత్రమునందే గరుడాంశతో భట్టనాథులు అనబడు దివ్యసూరులు అవతరించిరి.

**శ్రీరామాయణములో గరుడుని వంశక్రమము :**

గరుడుని అవతారము గూర్చి వైదిక వాఙ్మయములో ఎచటనూ ప్రస్తుతింపబడినట్లు కన్పింపదు. శ్రీరామాయణము ఆరణ్యకాండలో **(14వసర్గ)** జటాయువు తన వంశక్రమమును గూర్చి శ్రీరామునకు వివరించుచు ఇట్లనెను. **"ఆచచక్షే ద్విజ స్తస్మై కుల మాత్మాన మేవ చ, పూర్వకాలే మహాబాహో యే ప్రజాపతయోఽ భవన్, తా న్మే నిగదత స్సర్వా నాదితః శ్రుణు రాఘవ, కర్దమః ప్రథమ స్తేషాం విక్రీత స్తదనంతరః, శేష శ్చ సంశ్రయ శ్చైవ బహుపుత్ర శ్చ వీర్యవాన్, స్థాణు ర్మరీచి రత్రి శ్చ క్రతు శ్చైవ మహాబలః, పులస్త్య శ్చాంగిరా శ్చైవ ప్రచేతాః పులహ స్తథా, దక్షో వివస్వా నవరోఽ రిష్టనేమి శ్చ రాఘవ, కాశ్యప శ్చ మహాతేజా స్తేషా మాసీ చ్చ పశ్చిమః, ప్రజాపతే స్తు దక్షస్య బభూవు రితి విశ్రుతమ్, షష్టి ర్దుహితరో రామ యశస్విన్యో మహాయశః, కాశ్యపః ప్రతి జగ్రాహ తాసా మష్టౌసు మధ్యమాః, అదితిం చ దితిం చైవ దను మప్యథ కాళికామ్, తామ్రాం క్రోధవశాం చైవ మనుం చాప్యనలామః, (తాస్తు కన్యాః తతః ప్రీతః కాశ్యపః పున రబ్రవీత్, పుత్రాం స్త్రైలోక్యభర్తౄ న్వై జనయిష్యథ మత్సమాన్, అదితి స్తన్మనా రామ దితి శ్చ మనుజర్షభ, కాళికా చ మహాబాహో శేషాస్త్వమనసోఽ భవన్, ఆదిత్యాం జజ్ఞిరే దేవా స్త్ర యస్త్రింశ దరిన్దమ, అరిత్యా వసవోరు ద్రాహ్యశ్వినౌ చ పరంతప, దితి స్త్వజనయత్పుత్రాన్ దైత్యాం స్తాత యశస్వినః, తేషా మియం వసుమతీ పురాఽసీత్ సవనార్ణవా, దను స్త్వజనయత్ పుత్ర మశ్వగ్రీవ మరిందమ, నరకం కాలకం చైవ కాళికాపి వ్యజాయత) క్రౌంచీం భాసీం తథా శ్యేనీం ధృతరాష్ట్రీం తథా శుకీమ్, తామ్రా పి సుషువే కన్యాః పంచైతా లోకవిశ్రుతాః, ఉలూకాన జనయత్ క్రౌంచీ, భాసీ భాసాన్ వ్యజాయత, శ్యేనీ శ్యేనాం శ్చ గృధ్రాం శ్చ వ్యజాయత సుతేజసః, ధృతరాష్ట్రీ తు హంసా శ్చ సర్వశః, చక్రవాం శ్చ భద్రంతే విజజ్ఞే సాపి భామినీ, శుకీ నతాం విజజ్ఞేతు నతాయా వినతా సుతా, సురసాఽ జనయ న్నాగాన్ రామ కద్రూ స్తు పన్నగాన్, ద్వౌ పుత్రా వినతాయా స్తు గరుడోఽ రుణ ఏవచ, . . . . . వినతా చ శుకీపౌత్రీ కద్రూ శ్చ సురస్వసా"**

పై శ్లోకములను బట్టి వినత శుకికి మనుమరాలు అనియు, ఆమెకు కల్గిన కుమారు

లిద్దఱిలో గరుడుడు ఒకడని తెలియచున్నది. మఱియు సురస, కద్రువలు తోబుట్టువు లనియు, నాగములకు అనగా పలు పడగలుకల పన్నగములకు సురస తల్లికాగా, ఒకే పడగలనుకల జాత్యంతరమునకు కద్రువ తల్లి అనియు ఏర్పడుచున్నది. ఇట్లుండగా, మార్కండేయపురాణములో వేరొక విధమైన గరుడుని వంశక్రమము అని తెలుపబడినది. (అరిష్టనేమి -కశ్యపుడు- గరుడుడు అని) ఇట్టి క్రమమే భారతమునందును కానవచ్చుచున్నది. బహుశః మన్వంతరభేదమునుబట్టి ఈ క్రమవైషమ్యమును సమధానింపవలెనని గోవింద రాజీయవ్యాఖ్యలో, మహేశ్వర తీర్థవ్యాఖ్యలో తెలుపబడినది. **"అయం చ సృష్టి క్రమో వైవస్వతమన్వంతరప్రకారః, అతో న పురాణాంతర విరోధః"** అను గోవిందరాజీయవ్యాఖ్యానసూక్తి, **"ఏష సృష్టిప్రకారో వైవస్వతమన్వంతర ఇతి విజ్ఞేయమ్"** అను మహేశ్వరతీర్థీయవ్యాఖ్యాన సూక్తియు స్మరణీయములు.

యుద్ధకాండములోని ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశములనుండి రామలక్ష్మణులను గరుడుడు విడిపించిన వృత్తాంతమును బట్టి రామాయణకాలమునాటికి గరుడ-సర్పవైరము మిక్కిలి ప్రాచుర్యమును పొందినదని తెలియుచున్నది.

**అంశుమంతునకు గరుడుని ఉపదేశము :**

సగరునకు సుమతివలన అరువదివేల మంది పుత్రులు కల్గిరి. వారు కపిలముని కోపమునకు గురి అయి భస్మమయ్యిరి. సగరుని మనుమడు అగు అంశుమంతుడు తనతండ్రి కొఱకు వెదకుచుండగా, గరుడుడు దారిలో అతనికి కన్పించి, జరిగిన విషయమును తెలిపి, గంగను వారి భస్మముపై ప్రవహింపచేసిన వారికి సద్గతి కల్గునని ఉపదేశించెను. ఈ వృత్తాంతము శ్రీరామాయణము బాలకాండలోని 41వ సర్గలో కలదు.

**మహాభారతములో గరుడుడు :**

మహాభారతప్రారంభములోనేకల సుపర్ణోపాఖ్యానమునందలి గరుడుని జన్మ. అమృతాహరణవృత్తాంతములు స్తోత్రవ్యాఖ్యలో ప్రస్తుతములు. అట్లే, గాలవుని కథ, సుముఖుడను సర్పముయొక్కవృత్తాంతము మొదలగు పలు సందర్భములలో గరుడుని ప్రసక్తి కానవచ్చుచున్నది.ఇచట వానిలో కొన్ని మాత్రము క్లుప్తముగా ప్రస్తావింపబడుచున్నవి.

**గాలవునకు గరుడుడు సహాయపడుట :**

విశ్వామిత్రుని శిష్యుడగు గాలవుడు విద్యాభ్యాసమును పూర్తిచేసికొని, ఇంటికి పోవుసమయమున గురువునకు గురుదక్షిణను సమర్పింపకోరెను. తనకేమియు వలదన్నను వినక గాలవుడు మాటిమాటికి నిర్బంధించుటచే విశ్వామిత్రుడు కోపించి, గురుదక్షిణగా చంద్రునివలె తెల్లనివి, అన్నివిధముల సమానముగా నున్నవగు 800 గుఱ్ఱములను ఇమ్మనెను. గాలవునకు ఏమి చేయవలెనో తోచలేదు. ఆ సమయము గరుడుడు గాలవుని చూచుట తటస్థించెను. అతడు గాలవుని దీనస్థితిని తెలిసికొని, అతనిని యయాతి వద్దకు సహాయము కొఱకు తీసికొని పోయెను. యయాతి గాలవునకు



తన కుమార్తె అగు మాధవిని ఇచ్చి వివాహము చేసెను. ఆమె కారణముగా గాలవుడు 600 గుఱ్ఱములను మాత్రము సంపాదింప గల్గెను. వానిని గరుడుని మాటపై విశ్వామిత్రునకు గురుదక్షిణగా సమర్పించెను. ఈ కథ మహాభారతమున ఉద్యోగపర్వములో (108వ అధ్యాయమున) కలదు.

**ఉపరిచరవసువునకు గరుడుడు సహాయము చేయుట :-**

ఒకానొక సమయమున దేవతలకు, బ్రాహ్మణులకు మధ్య వివాదము జరిగెను. దేవతలు యజ్ఞములో మేక మాంసమును ఉపయోగింపవలెనని పలుకగా, బ్రాహ్మణులు మాత్రము దాని స్థానమున ధాన్యమును ఉపయోగించిన చాలుననిరి. ఆ సమయమునకు అచటికి వచ్చిన ఉపరిచరవసువు దేవతల పక్షమున పల్కెను. బ్రాహ్మణులు అందులకు కోపించి, ఉపరిచరవసువునకు గల ఆకాశమున సంచరించు శక్తినశించునని భూమిపై పడునని శపించిరి. దేవతలు అతనిని అనుగ్రహించుచు భూమిపై అతడున్నంతకాలము అతనికి ఆకలి, దప్పులు ఉండవని, మహావిష్ణువు యొక్క ప్రభావము వలన అతనికి తిరిగి ఆకాశమున సంచరించు శక్తి కల్గునని పల్కిరి. ఉపరిచరవసువు విష్ణువును ప్రార్థింపగా, భగవానుడు గరుడుని పంపెను, అతడు వసువును తనపై నిడికొని ఆకాశమునకు ఎగిరెను. అప్పటినుండి అతడు తిరిగి ఉపరిచర వసువు అయ్యెను.

**గరుడ వ్యూహము :**

యుద్ధమున గరుడాకారములో సైన్యమును నిలుపుటకు గరుడవ్యూహము వేరు. మహాభారత యుద్ధమున ద్రోణుడు కౌరవసైన్యమును గరుడవ్యూహమున రచించెను. పాండవులు కురుక్షేత్రయుద్ధములో చివరిగా గరుడవ్యూహమును పన్ని జయమును పొందిరి.

**పురాణవాఙ్మయములో గరుడుడు :**

శ్రీమద్భాగవత, హరివంశపురాణాదులలో గరుడుని ప్రస్తావన విస్తృతముగా కలదు. విశేషమేమనగా, శ్రీరామాయణములో, నాగపాశవిమోచన సందర్భమున భగవానుడు గరుడునితో తనకు గల సంబంధమును స్మరించినట్టు కన్పింపదు. కాని, పురాణ వాఙ్మయములో, ప్రత్యేకించి కృష్ణావతారములో గరుడుడు తనకు వాహనముగా స్వామి గుర్తించి, స్మరించుట, అట్లు స్మరించినవెంటనే గరుడుడు ప్రత్యక్షమగుటయు కన్పించును. ఇందులకు పారిజాతాపహరణ, బాణాసురవధ, నరకాసురవధాది పలు వృత్తాంతములు తార్కాణములు. గరుడుడు మాతృదాస్యమును పోగొట్టిన ఉదంతము వేరొక విధముగా బ్రహ్మపురాణములో కూడ కలదు. అందలి క్రమము ఇట్లున్నది. సర్పమాతయగు కద్రువ, వినతయు కశ్యపుని భార్యలు. వినతను కద్రువ మాయోపాయముతో దాసిగా చేసికొనెను. ఒకదినమున కద్రువ వినతతో "నీకుమారుడగు గరుడుడు ప్రతిదినము సూర్యుని ఆరాధించుటకై అతని వద్దకుపోవుచున్నాడు. నా కుమారులు అట్లు పోలేక పోవుచున్నారు. వారిని కూడ సూర్యుని వద్దకు తీసికొనిపోవలసినదిగా నీ కుమారునితో చెప్పుము'' అనెను. ఆమె మాటను అనుసరించి గరుడునితో వినత పల్కెను. గరుడుడును అట్లే చేసెను. సూర్యుని

వేడిమికి తాళలేక సర్పముల శరీరములు కాలిపోగా అవి అచేతనములై భూమిపై పడెను. అపుడు కద్రువ తన సంతతికి ఉపశమనము కల్గుటకొఱకై గరుడుని గంగాజలమును తీసి కొనిరమ్మనెను గరుడుడును గంగాజలమును తీసికొనివచ్చుటయేకాక, ఇంద్రుని ప్రార్థించి, అతనిద్వారా చల్లని వర్షమును కురిపింపచేసెను. బృహన్నారదీయపురాణములో **"అంగ న్యాదౌ సమారాధ్య దిక్పత్రేషు యజేత్ పునః, గరుడాదీన్ శ్రీముఖాం శ్చ విదిక్షు లోకపాన్ బహిః"** ఇత్యాదిగా గరుడోపాసనా విధానము తెలుపబడినది. గరుడపురాణము అష్టాదశ పురాణములలో ఒకటి. గరుడుడు కశ్యపునకు చెప్పుటచే దీనికాపేరు వచ్చినదట. దీనికి వైనతేయపురాణమని, సౌపర్ణమని, తార్క్ష్యమనియు పేర్లు కలవు. ఇందు పలుధర్మశాస్త్ర విషయములు, శ్రాద్ధకర్మవిచారములు కలవు. ఇందలి శ్లోకములను హేమాద్రి, గోపాలభట్ట, కమలాకరులవంటి ధర్మశాస్త్రపండితులు ప్రమాణములుగా తమ గ్రంథములలో గైకొనిరి. మత్స్యపురాణములో కాలనేమి యుద్ధసందర్భమున, దేవదానవ సంగ్రామమున, ఇంకను పలు సమయములలో గరుడుడు భగవానునకు వాహనమగుటయే కాక, పోరులో సహాయపడినట్లును కలదు. గరుడుడు తన తండ్రి మాటను బట్టి నిషాదులను భక్షించి, తన ఆకలిని తీర్చుకొనెనని స్కంధపురాణములలో కలదు. మయూరములు గరుడ సంతతిగా వరాహపురాణము తెలుపుచున్నది. **"దదౌ మయూరం స్వసుతం మహాజవమ్"** (31-102) అనుచు గరుడుడు తన పుత్రుడగు మయూరుని కుమారస్వామికి వాహనముగా ఇచ్చెనని అందు తెలుపబడినది. విష్ణుపురాణములో పారిజాతాపహరణోపాఖ్యానమున ఇంద్రుడు ప్రయోగించిన వరుణపాశములను గరుడుడు భగ్నమొనర్చినట్లు కలదు. **"పాశం సలిలరాజస్య సమాకృష్యోరగాశనః, చకార ఖండశః చంచ్వా బాలపన్నగదేహవత్"**. ఇట్టి ఉదంతమే శ్రీభాగవతములో కూడ కలదు. బలి చక్రవర్తిని వరుణపాశములనుండి గరుడుడు విడిపించెనని అందు ఉన్నది. విష్ణుధర్మోత్తరములో గరుడుని విగ్రహకళకు సంబంధించిన పలు వివరములున్నవి. ఇందు గరుడుడు చతుర్భుజుడుగా కూడ తెలుపబడినాడు.

గరుడునకు సహజముగానే నాగులు పట్ల వైరము కలదు. ఇంద్రుని వలన నాగులను భక్షించు అనుమతియు పొందెను. దానితో గరుడుడు నాగులను వరుసగా భక్షింపసాగెను. నాగజాతి ఈ విషయమును గమనించి, భయపడి గరుడునితో ఒక ఒప్పందమును కుదుర్చుకొని, తమకు రక్షణను కల్పించుకొన వలయునని తలచిరి. గరుడుని వద్దకుపోయి, తమలో ఒకరు ప్రతిదినము ఆహారముగా వత్తురని, విచక్షణ లేకుండ తమను భక్షింపవలదని, తమ ప్రార్థనను మన్నించిన, జీవించినంత కాలమైన తాము భయములేకుండ ఉండగలమని నాగులు ప్రార్థించిరి. గరుడుడు అందులకు సమ్మతించెను. ఇట్లు కొంతకాలము గడచెను. కాళియుడు మాత్రము ఈ ఒప్పందమునకు సమ్మతింపలేదు. గరుడుడు అతనికి తగిన పాఠమును చెప్పవలెనని తలచి, తనతో పోరాడవలసినదిగా కాళీయుని పిలచెను. వారిద్దరి మధ్యపోరాటము కాళిందీనది వద్ద జరిగెను. కాళియుడు గరుడునకు భయపడి కాళిందీనదిలో దాగెను. గరుడుడు తన రెక్కలతో ఆ నదిలోని నీటిని అంతటిని పైకి



ఎగురగొట్టెను. ఆనీరు అచటికి దగ్గరలో గల సౌభరి ఆశ్రమమును తడపెను. ఆముని మిక్కిలి కోపించి, ఇకపై గరుడుడు ఆప్రాంతమునకు వచ్చిన తన శరీరమువేయి ముక్కలగునని శపించెను. గరుడుడు మునిశాపమువలన ఆ ప్రాంతమునుండి వెడలిపోయెను. గరుడుని భయము అచటలేకుండుటచే, కాళియుడు ఆ నదిలో నివాసము ఏర్పరచుకొనెను. కాళియుని విష ప్రభావము ఆనది నీటిలో, పరిసరములలో వ్యాపించినను, అచట కదంబవృక్షముపై గరుడుడు అమృతమును భూమికి తీసుకొని వచ్చు సందర్భమున కొంతకాలము నిలచుటచే, ఆ విషప్రభావము ఆ కదంబవృక్షముపై మాత్రము పడలేదు. ఈ వృత్తాంతము భాగవత పురాణములోని దశమస్కంధమున కలదు.

**గరుడుడు వేంకటాచలపర్వత ప్రాంతమున నివసించుట :**

భగవానుడు చిరకాలము వేంకటాచలముపై నివసించుచు, ఆ పర్వతమును వదలి రాకుండుటను చూచిన గరుడభగవానుడు వేంకటాచలమును పరమపదమునకు తీసికొనిపోవుటకు ప్రయత్నించెను. దానిని తెలిపిన భగవానుడైన విష్ణువు చిఱునవ్వునవ్వి గరుడునితో ఇట్లనెను - **తత్జ్ఞాత్వా భగవాన్ విష్ణుః గరుడం త్వాహ సుస్మితః। పక్షిరాజ మహాసత్త్వ శ్రుణు కారణ ముత్తమమ్॥ గరుత్మన్ ఇహ సర్వే వై వసామ గిరిమూర్ధ। త్వం గిరేః దక్షిణం సానుమాసాద్య వస నిత్యశః ॥ ఆకల్పాంతం వసామీహ జగత్పాలనకారణాత్।** (గొప్ప బలమునుకల పక్షిరాజా ! జగత్తును రక్షింప గోరి నేను ఈ పర్వతముపై ఈ కల్పము చివరవరకు నివసింపగోరుచున్నాను. నాతో పాటు నీవును ఇచట నివసింపుము.) భగవానుని ఆదేశమువలన గరుడుడు వేంకటాచలము చఱియలపై నివసించుచున్నాడు. ఈవృత్తాంతము వామనపురాణములోని 24వ అధ్యాయమున కలదు. శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామములోని **"సానుస్థాపిత తార్క్ష్యాయ"** అను నామమీ విషయమును తెలుపుచున్నది.

**వేంకటాచలమునకు గరుడాద్రి అను పేరువచ్చుట :**

శ్రీవైకుంఠమునగల క్రీడాపర్వతమును భగవానుని ఆజ్ఞచే గరుడుడు భూలోకమునకు కొనివచ్చెను. ఆ క్రీడాపర్వతమే వేంకటాచలము. గరుడునిచే భూలోకమునకు తీసికొని రాబడినది కావున వేంకటాచలమునకు గరుడాద్రి అనుపేరు కల్గినది. **ఏవం రూపం గిరిశ్రేష్ఠం స్కంధదేశే నిధాయ తమ్। పరివారై రుపేతే చ భగవత్పరిచారకైః॥ ఆజగామ మహావేగాత్ గరుడః కాంచనప్రభః। ఆగతం గరుడం వీక్ష్య స్థాపయేహ ఖగేశ్వర॥ ఇత్యువాచ హరిః సోఽపి స్థాపయామాస తం తదా।** అను వరాహపురాణములోని వచనములు ఈ వృత్తాంతమును తెలుపుచున్నవి.

వేంకటాచలమునకు గరుడాద్రి అను పేరు వచ్చుటకు వేరొక కారణము భవిష్యోత్తర పురాణమున ఇంకొక విధముగా తెలుపబడినది. **అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః, ఏవం వేదమయః సాక్షాత్ గిరీంద్రః పన్నగాచలః** అను ప్రమాణమునుబట్టి, మహర్షులు వేంకటాచలమును వేదస్వరూపిగా ఆరాధించిరి.వేదాంత దేశికులును **"వేంకటవెత్పెన విళఙ్గుమ్ వేదవెత్పే"** అనుచు ఈ

విషయమును అనుసంధించిరి. వేంకటాచలము వేదాత్మకమనుట ఎట్లనగా -గరుడ భగవానుడు వేదాత్మకుడగుటచే నని చెప్పనగును. వేదము **"సుపర్ణోఽసి గరుత్మాన్"** అనుచు గరుడుని వేదరూపిగా వర్ణించుచున్నది. దీనిననుసరించి పూర్వాచార్యులు **"వేదాత్మా"** అని, **"త్రయీమయః"** అని, **"శ్రుతిమయమ్"** అని గరుడుని కీర్తించిరి. కావున వేదస్వరూపముగా వేంకటాచలమును పల్కుట తగినదే కదా !

ఈ విషయమును అనుసరించుచు వేరొక విషయ మిచట తెలియతగినది కలదు. భగవద్రామానుజులు తమ శ్రీభాష్యప్రారంభమున **"శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే"** అని సాయించిరి. ఈశ్లోకమున శ్రీనివాసుని వేదశిరస్సున ప్రకాశించు పరబ్రహ్మగా కీర్తించిరి. వేదశిరస్సు అనగా వేదాంతము. పరబ్రహ్మరూపమున పరమపురుషుడు వేదాంత ప్రతిపాద్యుడైనను, శ్రీనివాసుడను రూపమున వేదశిరస్సులో ఎచట ప్రకాశించుచున్నాడు ? అను శంక ఇచట కలుగవచ్చును. అందులకు పైన వివరింపబడినవిషయము సమాధాన మొసగుచున్నది. ఎట్లనగా- ఈ పర్వతము వేదమయ మగుటచే, అనగా గరుడాచలమగుటచే, ఈ పర్వతశిఖరముపై ప్రకాశించినచో వేదశిరస్సున అనగా గరుడునిపై ప్రకాశించినట్లే అగును. కావున వేంకటాచలమే వేదపర్వతముగా వెల్గొందుటచే దీని శిరస్సున ప్రకాశించు శ్రీనివాసుడను పరబ్రహ్మవిషయమున నాకు గొప్పభక్తి రూపాపన్నజ్ఞానము కలుగుగాక ! అని భగవద్రామానుజులు ప్రార్థించుట ఈ పర్వతమునకు అధిపతి అర్చారూపియగు శ్రీనివాసుని ఉద్దేశించియే అగును. ఇట్లు శ్రీరామానుజులు తమ శ్రీభాష్యప్రారంభమున గరుడ వాహనారూఢుడగు శ్రీనివాసుని స్మరించిరనుటలో విప్రతిపత్తి లేదుకదా !

**వామనపురాణములోని వేరొక ఐతిహ్యము :**

శంఖరాజు భగవానుని గూర్చి చిరకాలము తపస్సుచేసెను. ఆ సమయమున అగస్త్యుడు, బ్రహ్మ, రుద్రుడు, శుక్రాచార్యులు, బృహస్పతి, శ్వేతద్వీప వాసులగు ముక్తులు, పలువురు మహర్షులును అచటికి చేరిరి. అపుడు భగవానుడు వారికి గరుడవాహనారూఢుడై ప్రత్యక్షమయ్యెను. పెరియాళ్వార్ల పరతత్త్వనిర్ణయమును చేసిన పిమ్మట వారికి భగవానుడెట్టి సన్నివేశమున ఆకాశమునసాక్షాత్కరించెనో, అట్టి సన్నివేశమున భగవానుడు కన్పించెను. ఈ వృత్తాంతము వామన పురాణమున కలదు. **దదృశుస్తే సమారూఢం వైనతేయం మహాబలమ్, హరిం హేమాద్రిశిఖరే నీలమేఘ మివ స్థితమ్, తుష్టావాథ తదా బ్రహ్మ దేవాధిపతి మవ్యయమ్, పతత్త్రిరాజ మారూఢం శిరోభిః ప్రణిపత్య తమ్** (35వ అధ్యాయము)

భగవానుడు ఇట్టి సమయములలో గరుడ వాహనారూడుడై కన్పించుటలో ఒక రహస్యము కలదు. **"శాస్త్రయోనిత్వాత్"** అను బ్రహ్మసూత్రమున వ్యాసభగవానులు పరమపురుషుని తెలిసికొనుటకు ఈ ప్రకృతి మండలమున నున్నవారికి శాస్త్రమే సాధనమని తెలిపిరి. అనగా ప్రమాణములలో ఉత్తమ ప్రమాణమైన వేదము అను శాస్త్రముద్వారా భగవానుని తెలిసికొనదగునని తాత్పర్యము. అట్టి



వేదముయొక్క ప్రతిరూపమే గరుడభగవానుడు. ఈ విషయమును వేదమే నొక్కి వక్కాణించినది. కావున ఉత్తమ ప్రమాణమైన వేదముచే ప్రతిపాద్యుడను నేనే అని, ఎట్లు ప్రమాణములలో వేదము గొప్పదో, అట్లే ప్రమేయములలో నేనే ఉత్తముడని భగవానుడు ఈ విధముగా ప్రత్యక్షమగుట ద్వారా తెలియజేయుచున్నాడు. ఇట్లు గరుడవాహనారూఢత్వము ప్రమాణ-ప్రమేయముల ఉత్కృష్టతను సూచించుచున్నదని చెప్పనగును. మఱియు గరుడభగవానుడు తన రెండు చేతులలో భగవానుని పాదములు రెండిటిని ధరించుచు, సేవసాయించుట సంస్కృత వేదముతో ద్రవిడవేదమును సమానమని, ఈ రెండు వేదములచే ప్రతిపాద్యమగునది శ్రీమన్నారాయణుని పాదములే ప్రాప్య ప్రాపకములని తెలుపుట కొఱకేననియు చెప్పనగును. ఈ కారణమువలననే వైదికు లందఱు బ్రహ్మోత్సవములలో గరుడసేవకు మిక్కిలి ప్రాధాన్యము నిచ్చి ప్రశంసించిరి. పెరియాళ్వార్లు ఏ ప్రమాణమును (వేదమును) సహాయముగాగొని ఏ పరతత్త్వమును నిష్కర్షించిరో, ఆ ప్రమాణము గరుడునిగా, ప్రమేయము శ్రీనివాస భగవానునిగా సాక్షాత్కరించుచుండుట ఇచటి విశేషము.

**గరుడుడు అనిరుద్ధకిరీటమును శ్రీకృష్ణునకు అలంకరించుట :**

పూర్వము ప్రహ్లాదుని కుమారుడగు విరోచనుడును తండ్రివలె విష్ణుభక్తుడై యుండెను.అతడు ఒకానొకసమయమున పాలసముద్రములో యోగనిద్రలోనుండు పరమాత్ముని సేవించుటకై అచటికి వెడలెను. అచటగల మునులందఱును భక్తిపరవశులై యుండగా, భగవానుని కిరీటమును చూచి విరోచనుడు ఆకిరీటముపై ఆశకల్గినవాడై దానిని అపహరించి అచటినుండి వెడలిపాతాళమును చేరెను. కొంతసేపటికి మునులు కన్నులు తెఱచిచూడగా భగవానుని కిరీటము కన్పింపలేదు. భగవానుని సేవకై అచటికి వచ్చినవారికిని కిరీటము కనుపింపలేదు. అందుచే వారందఱును దానిని గూర్చి ఒకరినొకరు ప్రశ్నించుకొనిరి. కాని, అచటివారెవ్వరును తమకు భగవానుని కిరీటమును గూర్చి తెలియదనిరి. అపుడందఱు అచట విరోచనడు లేకుండటను గమనించి, అతడే అపహరించి యుండునని తలచిరి. వారందఱును విరోచనుని జయించి, భగవానుని కిరీటమును తీసికొనిరమ్మని గరుడునితో పల్కిరి. గరుడుడు పాతాళలోకమును చేరి, అచట విరోచనుని జయించి, కిరీటమును తీసికొని తిరిగివచ్చుచుండగా అపుడు ద్వాపర యుగాంతమగుటచే దారిలో బృందావనమున మనోహరరూపముతో ప్రకాశించు శ్రీకృష్ణుని దర్శించెను. తాను తెచ్చు కిరీటమును కృష్ణునకు అలంకరింపవలెనను ఆశతో క్రిందకు దిగి, దానిని భగవానునకు అలంకరింపగా, క్షీరాబ్ధినాథునకు సరిపోవు ఉన్నత ప్రమాణమునుకల ఆ కిరీటము చిత్రముగా కృష్ణునకు సరిపోయెను. గరుడుడు ఆశ్చర్యపడి భక్తితో కృష్ణునకు నమస్కరించి వెడలెను. క్షీరాబ్ధిని చేరి జరిగిన విషయమును భగవానునకు, అచటివారికి తెలిపెను. ఆ కిరీటమే యాదవాద్రిగా ప్రసిద్ధిచెందిన తిరునారాయణ పురములో ఈనాడు స్వామికి సమర్పింపబడు వైరముడి. పై వృత్తాంతము యాదవగిరి మాహాత్మ్యమున (నారద పురాణాంతర్గతము) సప్తమాధ్యాయములో కలదు. ఈ వృత్తాంతము గరుడపంచాశత్‌లోని దుగ్ధోదవ్వత్ **(49)** అను శ్లోకములో ప్రస్తుతమైనది.

**మత్స్యపురాణములోని వేరొక కథ :**

శ్రీకృష్ణభగవానుడు బలరామునితో కలసి గోమంతపర్వతమున విహరించు సందర్భమున జరిగిన సంఘటన ఇది. మహాబలి నారదునివలన క్షీరాబ్ధినాథుని కిరీటవైభవమును విని, దానిని సంపాదింవలెనని కోరికతో పాలసముద్రమును చేరెను. అచట భగవానుని దర్శించి, పలు విధముల స్తోత్రము చేసెను. తనకు కిరీటమును ప్రసాదింపవలసినదిగా ప్రార్థింపగా, భక్తపరాధీనుడగు భగవానుడు ఆవిధముగానే కిరీటమును అతనికి అనుగ్రహించెను. బలి ఆకిరీటమును తీసికొనివెడలెను. కొంతసేపటికి అచటికి వచ్చిన గరుడుడు భగవానుడు కిరీటములేకుండను ఉండుటను గమనించి, మిక్కిలి కోపముతో ఱెక్కలను వేగముగా విదల్చుచు, నలు దిక్కుల గమనించెను. కిరీటమును తీసికొనిపోవు బలిని చూచి, వేగముగా అతనిని వెంబడించి, ఓడించి, కిరీటమును స్వాధీనము చేసికొనెను. ఆకిరీటమును తిరిగి తీసికొనివచ్చుచు దారిలో గోమంత పర్వతముపై గల శ్రీకృష్ణుని రూపమును చూచి ఆకర్షితుడై, అతడు భగవానుడేనని గ్రహించి, క్రిందకు దిగి, కిరీటమును ఆస్వామి తలపై అలంకరించెను. పిమ్మట తనను పలువిధముల స్తుతించిన గరుడుని శ్రీకృష్ణభగవానుడు తాను గోమంతపర్వత ప్రాంతమున కొంతకాలము నివసింపదలచినట్లు, క్షీరసాగరమునుండి అచటి తీర్థమును, శ్వేతద్వీపమృత్తికను తీసికొని ఆ పర్వతప్రాంతమునకు రావలసినదిగాకోరెను. గరుడుడును భగవానుడు చెప్పినట్లేచేసెను. శ్రీకృష్ణుడు చిరకాలము నివసించుటచే గోమంతపర్వతమునకు యాదవాద్రి అను పేరు కల్గెను. ఈవృత్తాంతము మత్స్యపురాణములోని యాదవగిరి మాహాత్మ్యమున కలదు. ఇట్లు గరుడభగవానుడు యాదవాద్రి వైభవమునకు మూలమయ్యెను.

**బ్రహ్మవైవర్తపురాణములోని వృత్తాంతము :**

చంద్రవంశమున జన్మించిన వర్మ అనురాజు గౌతముని ఉపదేశమును అనుసరించి, అశ్వమేధయాగమును భగవానుని ఉద్దేశించి చేయసంకల్పించెను. ఆయాగమును సుమతి అను మునిసత్తముడు నిర్వహింపగా జాబాలి, పుండరీక, కామదేవాది ఋషులును అందు పాల్గొనిరి. తూర్పుముఖముగా గరుడాకారముననున్న యజ్ఞవేదికయందు శాస్త్ర ప్రకారము వపాహోమాదులను చేయుగా ఆవేదికనుండి ఒక దివ్యపురుషుడు ఆవిర్భవించి, యజ్ఞకుండమున ఆహుతి చేయువానినన్నిటిని భుజింపసాగెను. అపుడు దేవతలు అందఱును మహాదేవుడే అట్లు ఆహుతులను అన్నిటిని భుజించుచుండెనని తలచి కోపించిరి. సువర్మ, గౌతముడు మొదలైన దేవతలును దు:ఖించిరి. అంత అశరీరవాణి "దేవతలారా ! ఈ దివ్యపురుషుడు రుద్రుడు కాడు, పరమపురుషుడే. గండభేరుండ రూపియగు నృసింహమూర్తి పూర్వము శరభరూపియగు రుద్రుని ఖండించెను కదా ! ఆ శరభుని మాంసఖండములు గండభేరుండమూర్తిచే ఆకాశమునకు విసరివేయబడెను. వానిలో ఒక ఖండము ఇపుడు ఈ యజ్ఞవేదికయందు పడనున్నది. జాగ్రత్తపడుడు'' అని పల్కెను. ఆమాటవిని అందఱును భయముతో శోకింపసాగిరి. ధైర్యమును వహించిన సువర్మ, గౌతముడు మొదలగు



మునులు భగవానుని రక్షింపశరణువేడిరి. భగవానుడు వారిని అనుగ్రహించి, మిక్కిలి వేగముగా అచటికి వచ్చి, తన పాదాంగుష్ఠనఖాగ్రముతో మాంసఖండమును భూమిపై పడుటకు ముందు పైకి చిమ్మెను. పూవువలె సుకుమారమగు భగవానుని శరీరము అపుడు విషాగ్నితో చుట్టబడియుండుటను చూచిన ఋషులు, నిత్యసూరులందఱును హాహాకారమును చేసిరి. అపుడు వైనతేయుడు అచటికివచ్చి భగవానుని గాఢాలింగనము చేసికొని, తనఱెక్కలతో అగ్నిని ఆర్పి, శైత్యోపచారమును చేసెను. తన నఖములతో శంభుని మాంసఖండమును సముద్రము మధ్యలో పడునట్లు ఎగురగొట్టెను. ఈ వృత్తాంతము బ్రహ్మవైవర్త పురాణములోని దక్షిణమధురామాహాత్మ్యమున కలదు. అచటి శ్లోకములు దిఙ్మాత్రముగా ఉదాహరింపబడు చున్నవి. **శిరీషమృదులాకారం దృష్ట్వా తం పురుషోత్తమమ్ । బభూవు: వ్యథి తా స్సర్వే హాహేత్యాకులచేతనా: ॥ ఏతస్మి న్నంతరే పూర్వం వైనతేయ స్సమాగత: । పక్షాభ్యాం శమయ న్నగ్నీన్ పరిష్వజ్య రమేశ్వరమ్ ॥ గోపయన్ పాదనఖరై: శరభస్య వపుర్దళమ్ । వేగా దుత్క్షిప్య చిక్షేప జుగుప్స్యన్ అర్ణవోదరే ॥** యజ్ఞకుండసమీపములో ప్రత్యక్షమైన భగవానుని సేవించిన పిమ్మట సుశర్మ, గౌతమాది మహర్షుల ఆదేశము ప్రకారము భగవానుని ఆరాధనకొఱకు తీర్థమును వెదుకగా ఎచటను కనుపింపలేదు. అపుడు వేదాత్మకుడగు గరుడభగవానుడు తన ముక్కుతో భూమిని బ్రద్దలు చేసెను. అప్పటికిని అచట నీరు దొరుకకపోవుటచే, విషాగ్నియొక్క ప్రభావముచే అచటి జలము ఇంకి పోయెనని గ్రహించి అతడు ఆకాశగంగాతీర్థమును తీసికొని వచ్చుటకు ప్రయత్నించెను. అపుడు వైకుంఠనగరములోని విరజానది తనకు తానుగా అచటికి ప్రవహించి, గరుడునిచే అంతకు ముందు తవ్వబడిన సరస్సును నిండించెను. ఆపుణ్యతీర్థముతో రాజు భగవానుని ఆరాధనను నిర్వహించెను. కావున దానికి గరుడసరస్సు తీర్థమని పేరు కల్గెను. పిమ్మట సుకర్మయు భగవానునకు చైత్రమాసమున బ్రహ్మోత్సవాదులను నిర్వహించి, సంతోషించెను.

బ్రహ్మోత్సవము ముగిసిన పిమ్మట వైశాఖమాసము గడచిన పిదప, సప్తర్షులు తపస్సునుండి మేల్కొని, ఆశ్రమమునుండి స్నానార్థమై బయటకు వచ్చిచూడగా, పడమరదిశలో అద్భుతమైనతేజస్సు కన్పించెను. అపుడు వారు అచట గల బ్రాహ్మణులను ప్రశ్నింపగా, వారు ఆ జ్యోతి దక్షిణమధురా (మంగళ) క్షేత్రములోని భగవానుని తేజస్సు అని పల్కి, అచట భగవానుని ఆవిర్భావవృత్తాంతమును వారికి తెలియజేసిరి. మహర్షులు మిక్కిలిత్వరగా స్నానాదులను ముగించుకొని, దక్షిణమధుర మంగళక్షేత్రస్వామిని దర్శింపబయలుదేరిరి. వారిత్వరను గమనించిన భగవానుడు తానును నిలువలేనివాడై వారు బయలుదేరుటకుముందే గరుడవాహనారూఢుడై సమస్తపరివారముతో వచ్చి, వారిముందు ప్రత్యక్షమయ్యెను. **యావ న్నప్రస్థితం పూజ్యై: భక్తిసంపన్నమానసై: । తావత్ గరుడ మారుహ్య శంఖచక్రధరో హరి: ॥ తత స్తే త్వరయా యాంతం గరుడస్కంధవాహితమ్ । తత స్తే హర్షవివశా: తుష్టువు స్తం జనార్దనమ్ ॥** (బ్రహ్మవైవర్తపురాణమ్)

**గోవిందభట్టర్ జన్మవృత్తాంతము :**

**'ఎమ్బార్'** అను సంప్రదాయమున వ్యవహరింపబడు గోవిందభట్టర్ జన్మరహస్యము ఈ

పురాణములోనే తెలుపబడినది. ఈ ఆచార్యులు గరుడాంశసంభూతులు అనుటకు ఈ వృత్తాంతము ప్రమాణము. భగవానుడు లోకోజ్జీవనమునకై తన పరివారములోని నిత్యసూరులను లోకమున అవతరింపచేసెను. వారిలో గరుడాంశవలన గోవిందభట్టర్ జన్మించిరి. దానికి సంబంధించిన పూర్వవృత్తాంతము ఇది.

గరుడభగవానుడు గోవిందభట్టర్‌గా జన్మించుటకు దుర్వాసముని శాపము మూలము. ఆ శాపమువలననే ఆ ఆచార్యులు కొంతకాలము శివభక్తులైకాలమును గడపుట సంభవించెను. పూర్వము గరుడుడు శరభుని మాంసఖండమును వేగముగా సముద్రముమధ్యకు విసరెను. అపుడు ఆ ఖండములోని చిఱుభాగము దూర్వాసమహర్షి తలపై పడెను. అందులకు కోపించిన ఆ మహర్షి గరుడుని భూమిపై అవతరించి, కొంతకాము జ్ఞానభ్రంశమును పొందవలసినదిగా శపించెను. మహర్షి శాపము గరుడుని సమీపింపగా గరుడుడు హుంకారమును చేసెను. దానిప్రభావమువలన శాపదేవత భయపడి అతివేగముగా దుర్వాసమునివద్దకు తిరిగి వచ్చెను. దానివలన దుర్వాసుడు మరింత కోపించి, తీవ్రమైన  తన తపోగ్ని ప్రభావమువలన లోకమును భస్మము చేయప్రత్నించెను. దేవతలు, బ్రహ్మయు వచ్చి దూర్వాసుని అనునయింప ప్రయత్నించిరి. అపుడు ఆ మహర్షి తన శాపము సఫలమైన తన ప్రయత్నమును విరమింతుననెను. అంత దేవతలందఱు భగవానుని శరణువేడిరి. భగవానుడు గరుడునివద్దకు వచ్చి “ఖగేశా ! భూలోకమున ఆదిశేషుడు భగవద్రామానుజులుగా అవతరించును. అపుడు నీవు వారికి సహాయకుడవై మానవలోకమున పుట్టుదువు. దుర్వాసమహర్షి శాపము అపుడు నీకు ఉపకరించును. చింతింపకుము’’ అని పల్కెను. ఇట్లు భగవానునిచే ఆజ్ఞాపింపబడిన గరుడుడు కమలనయనభట్టర్‌కు, శ్రీదేవికి కుమారులగా గోవిందభట్టర్ అను పేరున జన్మించి, భగవద్రామానుజులకు అంతరంగ భక్తులై, మిక్కిలి సహాయమును చేసిరి. గరుడుని అవతారమే గోవిందభట్టర్ అనుటకు ఈక్రింది అంశములు ప్రమాణములని ఈఉపాఖ్యానమున పేర్కొనబడినవి. **ఏవం వివర్ధమానేఽస్య మాహాత్మ్యే వివిధే బుధాః। చింతావిషాణా ముగ్రాణాం స్మితదంష్ట్రావశీయుజామ్ ॥ కామినీభోగినా మస్య ప్రత్యనీకతయా సదా। సర్పాస్యస్పర్శగేనాఽపి సంసార విషనాశనాత్ ॥ రామానుజ ప్రియత్వా చ్ఛ శ్రీశస్య వహనాత్ సదా। అమృతాహరణా చ్చాపి సర్వేషా మపి యాచతామ్ ॥ అనుమానైః గ్రహిష్యంతి బహుధాఽస్య ఖగేశతామ్ ।** ఈ విధముగానే శ్రీవైష్ణవ సంప్రదాయము ప్రకారము గోవిందభట్టర్ గరుడుని అంశతో జన్మించిరి అనుటకు ఆఱాయిరప్పడి గురుపరంపరా ప్రభావములోని (పేజీ 275, **“శేషాశనానంత వైనతేయర్‌కళ్, యమునైత్తుఱైవర్, ఇళైయాళ్వార్, గోవిందభట్టరాకవుమ్”** అను వాక్యము కూడ ప్రమాణము.

**త్రివిక్రమదేవుడు గరుడవాహనారూఢుడై దేవతలకు సహాయపడిన వృత్తాంతము :**

కృతయుగమున వృత్రాసురవధ అనంతరము దేవతలకు రాక్షసులకు భీకరమైన యుద్ధము జరిగెను. దానికి తారకామయమని పేరు. **అనఘ కృతయుగంబునందు వృత్రధ్వంస మయిన పిదప దారకామయంబు నాఁగ జెల్లె నొక రణమ్ము దేవతలకు, నధికదారుణముగ** (ఎఱ్ఱనహరివంశము-



పూర్వభాగము, ఆ 4-72) అపుడు దేవతలు శ్రీమన్నారాయణుని సహాయ మడుగగా అతడును గరుడధ్వజవిభ్రాజితమైన రథమును అధిరోహించి దేవతల వెంట వచ్చి, దానవులతో యుద్ధముచేసెను. మయుడు మొదలగు రాక్షసులు దేవతలమీదకు యుద్ధమునకు వచ్చిరి. కొంతకాలము దానవసంహారమును చేసిన పిమ్మట భగవానుడు గరుడుని అధిరోహించి రాక్షస సంహారమును పూర్తిచేసెను. ఈ సందర్భమును ఎఱ్ఱన మనోహరముగా ఇట్లు వర్ణించెను.

**పసిడికెందగడు పైఁబఱసినయట్లు దిక్కులఁ బిక్షకాంతి సైకొలుపువాని,**
**ముందట నెఱసంజ మొలపించు చంచుదంష్ట్రోరగమణిదీప్తినొప్పువాని**
**బళయాగ్ని శిఖలు పైఁబ్రసరించు క్రోధసంరక్తవిలోచన ప్రభలవాని**
**నిఖిలాండములు నొక్కనెగవున దాఁటంగఁగల యద్భుతోగ్రవేగంబువాని**
**వైనతేయు నింద్రవజ్రావమానన చండశౌర్యు నెక్కి చక్రశార్ఙ్గ**
**గదలు దాల్చి కడిమిఁ గడగెఁ సర్వాభయప్రదుఁడుశ్రీవిభుండు బవరమునకు**

(పూర్వభాగము - ఆ 4-94)

మత్స్యపురాణమున ఈఅంశము ఇట్లు వర్ణింపబడినది. **స కాశ్యపస్యాత్మభువం ద్విజం భుజగభోజనమ్, పవనాధికసంతాపం గగనక్షోభణం ఖగమ్, భుజగేంద్రేణ వదనే నివిష్టేన విరాజితమ్, అమృతారంభనిర్ముక్తం మందరాద్రి మివో చ్ఛ్రితమ్, దేవాసురవిమర్దేషు బహుశో దృఢవిక్రమమ్, మహేంద్రేణామృతస్యార్థే వజ్రేణ కృతలక్షణమ్, శిఖినం బలినం చైవ తప్తకుండలభూషణమ్, విచిత్రపత్రవసనం ధాతుమంత మివా చలమ్, స్ఫీతక్రోడావలంబేన శీతాంశుసమతేజసా, భోగిభోగావసిక్తేన మణిరత్నేన భాస్వతా, పక్షాభ్యాం చారుపత్రాభ్యా మావృత్య దివి వీలయా, యుగాంతే సేంద్రచాపాభ్యాం తోయదాభ్యా మివాం చితమ్, నీలలోహితపీతాభిః పతాకాభి రలంకృతమ్, కేతువేషప్రతిచ్ఛన్నం మహాకాయనికేతనమ్, అరుణావరజం శ్రీమాన్ నారుహ్యా సమరే విభుః, సువర్ణస్వర్ణవపుషా సుపర్ణం ఖేచరోత్తమమ్** (అధ్యాయ 124 శ్లో 40-50)

**భగవానుడు గరుడవాహనమునెక్కి కాలనేమిని చంపుట :**

దేవతలతో రాక్షసులకు జరిగిన తారకామయమను యుద్ధమున మయుడును ఓడిపోయెను. అతడు ప్రయోగించిన మాయ నిర్వీర్య మయ్యెను. పిమ్మట కొంతకాలమునకు వేయి భుజములను, వేయి శిరస్సులను కల కాలనేమి అను రాక్షసుడు బ్రహ్మవలన అమోఘములైన వరములను పొంది, వానివలన గర్వితుడై, రాక్షసులను ప్రోత్సహించి, వారిని కూడకట్టుకొని దేవతలపై యుద్ధమునకు వెడలెను. అతని ధాటికి దేవతలు, అష్టదిక్పాలకులు అందఱును నిలువ లేక నిర్వీర్యులయ్యిరి. భగవానుడును గరుడుని అధిరోహించి, అతనిని ఎదిర్చెను. ఈ సందర్భము మత్స్యపురాణమునను ప్రస్తుతింపబడినది. **విమృశ్య సురసంక్షోభం వైనతేయం సమాహ్వాయత్, ఆహూతేఽవస్థితే తస్మిన్ నాగావస్థితవర్ష్మణి.** (అధ్యాయ : 150 శ్లో 214)  ఆ యుద్ధమున కాలనేమి

భగవానుని చేతిలో పరాజితుడై పలాయనము చిత్తగించెను. మరల కొంతకాలమునకు కాలనేమి బలమును కూడగట్టుకొని దేవతలపై యుద్ధమునకు వెడలి, వారిని పరాజితులను కావించెను. విష్ణువును నోటికి వచ్చినట్లు మాటలాడి రణమునకు ఆహ్వానించెను. అపుడు భగవానుడు గరుడుని ఎక్కి అతనితో యుద్ధముచేసి వధించెను. **స దదర్శ సుపర్ణస్థం శంఖచక్రగదాధరమ్, దానవానాం వినాశాయ భ్రామయంతం గదాం శుభామ్.** (అధ్యాయే 178-3 శ్లో)

**నరకాసుర సంహారము :**

ఇంద్రుడు కృష్ణభగవానుని వద్దకువచ్చి నరకుడు చేయు దుష్టచేష్టలను వివరించి, అతని వధకు భగవానుని ప్రోత్సహించెను. మఱియు ప్రాగ్జ్యోతిషపురమును చేరుటకు గరుడుని సహాయముఅవసరము కావున అతనిని అధిరోహించి పోవలసినదిగా పల్కి, తన వెంటవచ్చిన గరుడుని చూపెను. ఈ వృత్తాంతము ఎఱ్ఱన హరివంశమున ఈ క్రింది విధముగా కడు రమ్యముగా వర్ణించెను.

**విక్రాంతిం త్రిజగంబులందును గడున్ విఖ్యాతు డుద్దామనిర్వక్రమ స్వైరజవంబునన్ బవనునిన్ భంజించు పక్షిప్రభుం డక్రూరాత్ముడు వీఁడనన్ నెగడు వాఁడబ్జాక్షయుడుద్యన్మహో చక్రుం దాల్పగలండు శాత్రవవధేచ్ఛం జేయు కయ్యంబులన్** అని పలికి తన తోడన చనుదెంచి వినయావనతుండగు వినతాతనయుంజూపి యింద్రుడు మఱియును మును నీమెచ్చిన వాహనంబు యిపుడునోమ్మదంబుతోఁ జేరె గ్రక్కున నారూఢుఁడవై జగంబులకుఁ జక్షుః ప్రీతిగావించుచుం జని వేకేశలముల్లసిల్ల జయప్రస్థానంబునుం జేయుమా

వ్యాసభగవానులు భాగవత పురాణమున ఈ సందర్భమున సత్యభామతో గరుడవాహనారూఢుడైన భగవానుని వర్ణించిన శ్లోకరత్న మిచట అనుసంధేయము. దృష్ట్వా స భార్యం గరుడోపరిస్థితం సూర్యోపరిష్టాత్ సతటిత్ ఘనం యథా (దశమస్కంధే -59 అ-16 శ్లో)

ఇచట వీరరాఘవీయ వ్యాఖ్యలోని **"తత్ర సూర్యస్థానీయో గరుడః, తటిత్స్థానీయా భార్యా, ఘనస్థానీయ స్తు కృష్ణ ఇతి వివేకః"** అను వివరణమును స్మరింపతగినది. ఆ యుద్ధమున గరుడుడును శత్రుసైన్యమును వధించిన తీరు భాగవతమున ఇట్లు తెలుపబడినది. **"గరుత్మతా హన్యమాన్ తుండపక్ష నఖై ర్గజాః పుర మేవావిశ న్నార్తాః"** -(8 అ. 19 శ్లో)

ఎఱ్ఱన హరివంశములోని **"తార్క్ష్య పక్షపవనంబులం దూలియు, దద్రోషవీక్షణ విస్ఫులింగంబులం బ్రేలియుఁ దదీయ చంచుభేదనంబుల ముఱిసి"** అను వర్ణన ఇచట స్మరింపతగినది. అపుడు నరకుడు గరుడునిపై అమోఘమైన శక్తిని ప్రయోగించెను. కాని గరుడునకు అది ఏనుగును పూలమాలతో కొట్టినట్లుండెనట. **"తం భౌమః ప్రాహరత్ శక్త్యా వజ్రః ప్రతిహతో యతః, నాకం పతతయా విద్ధో మాలాహత ఇవ ద్విపః."**

నరకుడు ప్రయోగించిన బాణమునకు శ్రీకృష్ణభగవానుడు మూర్ఛిల్లిన సందర్భము సంస్కృతమున విష్ణుపురాణమున కాని, భాగవతమున కాని కనుపింపదు. తెనుగున ఎఱ్ఱన, నాచన



సోమనలు ఈ అంశమును ప్రస్తావించిరి. మూర్ఛిల్లిన కృష్ణునకు గరుడుడు తన ఱెక్కలతో వీచి, శ్రమనుపోగొట్టి, సేవచేయుట ఎఱ్ఱన కడుమధురముగా వర్ణించెను. **"సుపర్ణుండు నిజపక్షపవనంబునఁ బ్రభునకు నాశ్వాసం బొనరించె"** ఈసందర్భమున యామునుల **"వ్యజనం త్రయీమయః"** అనుసూక్తి ప్రభావము కలదని చెప్పనగును.

నరకాసురుని వధించిన పిమ్మట శ్రీకృష్ణభగవానుడు నరకుని భవనమునుండి అతడు బలాత్కారముగా కొల్లగొట్టి, తాను కొనివచ్చిన అపారరత్నసంపదను, ఏనుగులను, అశ్వములను గైకొని ద్వారకకు తరలించిన మఱియు మనోహరమైన మణిపర్వత శృంగమును పెకలించి, దానిని గరుడునిపై పెట్టెను. **"వారుణం ఛత్రం తథైవ మణిపర్వతమ్, ఆరోపయామాస హరిః గరుడే పతగేశ్వరే"** (వి.పు. 5-30-34) అంతటి భారమును గరుడుడు అవలీలగా మోసెను. ఈ విషయమును సంస్కృతహరివంశము **"మణిపర్వతశృ:గం చ సభార్యం చ జనార్దనమ్, ఉవాహ లీలయా పక్షీ గరుడః పతతాం వరః, స పక్షబలవిక్షేపైః హిమాద్రిశిఖరోపమః, దిక్షు సర్వాసు సంహ్రాదం జనయామాస పక్షిరాట్"** - (123-45, 46) అనుచు వర్ణింప బడినది.

**పారిజాతాపహరణవృత్తాంతము :**

శ్రీకృష్ణభగవానుడు గరుడవాహనారూఢుడై వెడలిన వృత్తాంతములలో ఇది సుప్రసిద్ధము. ఇది హరివంశములో రమ్యముగ వర్ణింపబడినది. రుక్మిణీదేవి మందిరమున శ్రీకృష్ణుడు ఉన్న సమయమున నారదుడు వచ్చి, దేవలోకమునుండి తాను తెచ్చిన పారిజాత పుష్పమును భగవానున కివ్వగా, అతడు దానిని రుక్మిణీదేవి కిచ్చెను. ఈ విషయము సత్యభామకు తెలిసి కోపింపగా, ఆమెను సముదాయించిన భగవానుడు స్వర్గము నుండి పారిజాతవృక్షమునే తెచ్చి ఇత్తునని పల్కెను. అందులకై అతడు గరుడుని వాహనముగాగొని స్వర్గమున కేగి అచట దేవేంద్రుని జయించి, పారిజాతవృక్షమును తీసికొని వచ్చుట ఇందలి కథ. ఈకథను తెనుగున అష్టదిగ్గజ కవులలో ఒకడగు నంది తిమ్మనార్యుడు పారిజాతాపహరణ ప్రబంధముగా నిర్మించెను. అతడు ఆ ప్రబంధమున గరుడుని గమనమును **"పతగవిభుండు మింటిపయి భంజలికా మురలీ నుడాలవల్గితముల రానెదుర్పడిన ఖేచరవర్గములోసరించి"** (ఆ 2-102) అనుచు రమణీయముగా అభివర్ణించెను. పారిజాతవృక్షమును ఇంద్రుడు కృష్ణున కిచ్చుటకు అంగీకరింపకపోవుటచే యుద్ధము అనివార్య మయ్యెను. ఆయుద్ధమున గరుడుని విక్రమమును తిమ్మన

**హరిబాణలూనంబులై వచ్చు నమరాస్త్ర**
**ఖండముల్ దూల్చుఁ బక్షముల జడిసి,**
**యమృతగంధాసక్తమగు చంచుపుటమున**
**వడిసింధురంబుల బొడిచి యెత్తు,**
**నధిపు డేసిన బాఱు నాశుగంబులకంటె**
**మును మున్న చని లక్ష్యముల దళించు,**

**భటులపై హయలపై బహురథాగ్రములపై**
**నొక్కడయ్యును దోచు బెక్కుగతుల,**

**నఖముఖంబుల నిటికి గండ్రలుగ చేయు,**
**దివిజబిరుదధ్వజంబు లుద్రేకవృత్తి,**
**నిఖిలలోకాద్భుతాహవనిర్నిరోధ,**
**విక్రమస్ఫూర్తి ఖగరాజచక్రవర్తి,**

ఆ యుద్ధమున ఇంద్రునివాహనమగు ఐరావతముతో గరుడుడుచేసిన యుద్ధము సంస్కృత హరివంశమున చక్కగా వర్ణింపబడినది. గరుడుని ధాటికి తాళలేని ఐరావతము సైతము మూర్ఛిల్లెను.

"అథేంద్రో గరుడం బాణైః మహాశనిసమస్వనైః, వివ్యాధ సర్వగాత్రేషు మహాస్త్రప్రభవై స్తదా, స తాన్ బాణాన్ న గణయన్ వైనతేయః ప్రతాపవాన్, ససారాభిముఖో వీరః శక్రనాగ మరిందమః, ఉభౌ తౌ సహసా రాజన్ బలినౌ గజపక్షిణౌ, ప్రయుద్ధౌ వీర్యసంపన్నౌ మహాప్రాణౌ దురాసదౌ, సుముహూర్తం మహానాసీత్ సంమర్దో గజపక్షిణోః, విస్మాపనీయో జగతః ప్రేక్షితౄణాం భయావహః, మూర్ధ్న్యథైరావణం తార్క్ష్య స్తాడయామాస భారత, నఖాంకుశకరాళేన చరణేన మహాబలః, సంప్రహారాభిసంతప్తః స పపాత త్రివిష్టపాత్" (132 అధ్యా- 84-91) ఏ అస్త్రమునకు చలింపని గరుడునిపై ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించెను. అమృతాపహరణ సందర్భమునవలె అపుడును ఆ ఆయుధము నిర్వీర్యమయ్యెను. తన ఱెక్కలో ఒక ఈకను మాత్రము వదలెను. తతో వజ్రాయుధో వజ్ర మశనిం చ పునః పునః, ముమోచ గరుడే రాజన్ ఐరావణరిపౌ నృప, వజ్రాశనినిపాతాం స్తాం సేహే శక్రస్య నాగహా, అవధ్యో బలినాం శ్రేష్ఠో నిసర్గేణ తపోబలాత్, ముమోచ పక్ష మేకైకం మానయ న్నశనిం తదా" (అ 132-96-98) పై వర్ణనలు రెండును ఎట్టిన హరివంశమున చోటుచేసికొనలేదు.

**బాణాసురవధ :**

శ్రీకృష్ణుడు గరుడవాహనుడై యుద్ధమును చేసిన వృత్తాంతములలో ఇది వేరొకటి. శ్రీకృష్ణభగవానుని పౌత్రుడగు అనిరుద్ధుడు మహాబలి పౌత్రి (మనుమరాలు) అగు ఉషను వివాహమాడెను. ఆమెతండ్రి బాణునకు అది అంగీకార్యముకాక పోవుటచే అనిరుద్ధుని ఓడించి నాగపాశబద్ధుని చేసెను. అతనిని విడిపించి, రక్షించుటకై భగవానుడు బాణుని పట్టణమగు శోణిత పురమును చేరుటకు, నారదుని మాటను అనుసరించి గరుడుని స్మరించెను. (మఱియు అనిరుద్ధుని నాగపాశములను విడిపించుట గరుడునివలననే సాధ్యమగును) వెంటనే గరుడుడు శ్రీకృష్ణునిముందు ప్రత్యక్షమయ్యెను. తనను అచటికి రమ్మనుటకు కారణమేమని గరుడుడు ప్రశ్నింపగా - భగవానుడు గరుడుని స్తుతించుచు పల్కినమాటలు ఇచట ఉట్టంకింపబడుచున్నవి. "వాసుదేవో వచః ప్రాహ శ్రుణుష్వ పతతాం వర, బలః పుత్రేణ బాణేన ప్రాద్యుమ్ని రపరాజితః, ఉషాయాః కారణే బద్ధో నగరే



శోణితాహ్వయే, అనిరుద్ధ స్తు కామార్తో బద్ధో నాగైః మహాబలైః, తస్య మోక్షార్థ మాహూతో మయాత్వం పతగేశ్వర, తవ వేగే సమో నాస్తి పక్షిణాం ప్రవరో భవాన్, అశక్యం చ తదధ్వానం గంతు మన్యేన సత్తమ, తతః ప్రాపయ శీఘ్రం మాం యత్ర ప్రాద్యుమ్ని రావసత్, వైదర్భీ తే స్నుషా వీర రుదతే పుత్రగర్ధినీ, త్వాత్ప్రసాదాత్ భవత్యేషా పుత్రేణ సహ సంగతా, అమృతం హి హృతం పూర్వం త్వయా పన్నగనాశన, మయా సహ సమాగమ్య తస్మిన్ కాలే మహాభుజ, ఆత్మా మే త్వం ధ్వజ శ్చైవ మద్భక్త శ్చ మహాబల, సఖిత్వం మానయస్వాద్య భక్తిం చ పతగేశ్వర, తవ వేగసమో నాస్తి పక్షిణాం చ న తే సమః , సుపర్ణిసుకృతేన త్వాం శపే పన్నగనాశన, దాసీభావాత్ త్వయా మాతా మోక్షితైకాకినా పురా, పక్షవిక్షేపమాత్రేణ జితా దేవా స్త్వయా రణే, భవాన్ సురగణాన్ సర్వాన్ పృష్ఠ మారోప్య విక్రమాత్, గచ్ఛ మే హ్యగమాన్ దేశాన్ విజయ శ్చ తవాశ్రయాత్, గురుత్వాత్ మే గురుతుల్య స్త్వం లఘుత్వాత్ పవనోపమః, భూతభవ్యే భవిష్యే చ న తే తులోఽ స్తి విక్రమే" (అ 179-107-117)

భగవానుడు శోణితపురమును చేరిన లోనికి ప్రవేశింపబోగా చుట్టును జ్వలించు అగ్ని ఉండుటచే అందులకు అవరోధముకల్గెను. అపుడు కృష్ణభగవానుడు గరుడుని సహాయ మర్థింపగా అతడు శీఘ్రముగా ఆకాశగంగను చేరి, సహస్రముఖుడై, నీటిని గొని, శోణితపురము చుట్టునుగల అగ్నిని ఆర్పెను. "కురుష్వ వైనతేయ త్వం య న్నః కార్య మనంతరమ్, త్వయా విధానే విహితే కరిష్యా మ్యహ ముత్తరమ్, ఏతత్ శ్రుత్వా తు గరుడో వాసుదేవస్య భాషితమ్, చక్రే ముఖసహస్రం హి కామరూపీ మహాబలః, గంగా ముపాగమ త్తూర్ణం వైనతేయ స్తతో బలీ, ఆప్లుత్యాకాశగంగాయా మాపీయ సలిలం బహు, ప్రవవర్షో పరిగతో వైనతేయః ప్రతాపవాన్, తేనాగ్నిం శమయామాస బుద్ధిమాన్ వినతాత్మజః" (అ 180,16-19)

**మయూరునితో గరుడుని పోరు :**

బాణునితో భగవానుడు చేసిన యుద్ధమున గరుడుని పరాక్రమము అసాధారణము. బాణునకు రక్షగా వచ్చిన కుమారస్వామి వాహనమగు నెమలితో గరుడుడు చేసిన యుద్ధము ఇచట ఉట్టంకింపతగినది. "ప్రాయుధ్యేతాం ధ్వజే తత్ర తావన్యోన్య మభిద్రుతౌ, యుద్ధం త్వభూత్ వాహనయో రుభయోః దేవదైత్యయోః, గరుడస్య చ సంగ్రామే మయూరస్య చ యుధ్యతః, పక్షతుండప్రహారై స్తౌ చరణాగ్రనఖై స్తదా, అన్యోన్యం జఘ్నతుః క్రుద్ధౌ మయూరగరుడా వుభౌ, వైనతేయ స్తతః క్రుద్ధో మయూరం దీప్తతేజసమ్, జగ్రాహ శిరసి క్షిప్రం తుండేనాభిపతం స్తదా, దక్షిణేన చ పక్షేణ నిజఘాన మహాబలః, పద్భ్యాం పార్శ్వాభిఘాతాం శ్చ కృత్వా ఘాతా ననేకశః, ఆకృష్య చైనం తరసా వికృష్య చ మహాబలః, విసంజ్ఞం పాతయామాస గగనా దివ భాస్కరమ్" (అ 186, 42-49)

బాణుని జయించిన పిమ్మట గరుడుని అధిరోహించిన భగవానుడు నాగపాశములచే బంధింపబడిన అనిరుద్ధుడున్న చోటుకు చేరెను. గరుడునిరాకతో నాగపాశములు అదృశ్యము లయ్యెను. "తతో దృష్ట్వైవ గరుడం యేఽ నిరుద్ధశరీరగాః, శరరూపా మహాసర్పా వేష్టయిత్వా తనుం

స్థితాః, సర్వే తే సహసా దేహాత్ తస్య నిఃసృత్య భోగినః, క్షితిం సమవగాహంత ప్రకృత్యావస్థితా శ్శిరాః" (అ189,9-10)

పిమ్మట భగవానుడు ప్రద్యుమ్న అనిరుద్ధులతో గరుడుని అధిరోహించి వరుణలోకమును చేరెను. అందులకును గరుడుడు సహాయపడెను. "తథేత్యుక్త్వా తు గరుడః పక్షవాతేన సాగరమ్, సహసా క్షోభయత్వా చ వివేశ వరుణాలయమ్" అచట వారుణగణములతో గరుడుడు యుద్ధమును చేసి, భగవానుడు దివ్యగోవులను సంపాదించుటలో సహాయపడెను. "తద్యుద్ధ మభవత్ ఘోరం వారుణైః పన్నగారిణా, స ప్రద్యుమ్నానిరుద్ధాభ్యాం శ్చ గరుడేన చ సర్వశః, శరౌఘైః వివిధైః తీక్ష్ణైః వధ్యమానం సహస్రశః, తతో భగ్నం బలం దృష్ట్వా" (అ 189-26-31)

**శ్రీకృష్ణుని కైలాససందర్శనము :**

ఒకానొక సమయమున శ్రీకృష్ణభగవానుడు కైలాసశిఖరమును సందర్శింపగోరి గరుడుని స్మరించెను. స్వామి హృదయమును తెలిసిన గరుడుడు వెంటనే ద్వారకకు వచ్చెను. ఈసందర్భమును ఉత్ప్రేక్షించు హరివంశశ్లోకములు ఇచట ఉదాహార్యములు.

"గంతు మెచ్ఛన్ జగన్నాథః కైలాసం పర్వతోత్తమమ్, తత స్స చింతయామాస గరుడం పక్షిపుంగవమ్, ఆగచ్ఛ త్వరితం తార్క్ష్య ఇతి విష్ణు ర్జగత్పతిః, తత స్స భగవాన్ తార్క్ష్యో వేదరాశి రితి స్మృతః, బలవాన్ విక్రమీ యోగశాస్త్రవేత్తా (నేతా) కురూద్వహ, యజ్ఞమూర్తిః పురాణాత్మా సామమూర్ధాచ పావనః, ఋగ్వేదపక్షవాన్ పక్షీ పింగళో జటిలాకృతిః, తామ్రతుండః సోమహరః శత్రుజేతా మహాశిరాః పన్నగారిః పద్మనేత్రః సాక్షాత్ విష్ణు రివాపరః, వాహనం దేవదేవస్య దానవీగర్భకృంతనః, రాక్షసాసురసంఘానాం జేతా పక్షబలేన యః, ప్రాదురాసీత్ మహావీర్యః కేశవస్యాగ్రత స్తదా" (అ 267,1-7)

ఈ శ్లోకములనుబట్టి గరుడుని శిరస్సు సామవేదమని, ఋగ్వేదము పక్షములని, అతడు యోగశాస్త్రవిదుడనియు తెలియుచున్నది.

ఈ సందర్భమున ఎఱ్ఱన హరివంశములోని పద్యము అవశ్యము స్మరణీయము.

సీ ॥ సర్వపథీనుఁడై చను పతంగుడు గలఁడో కాక యరయ నన్యుడు జగమున
నెఱకలు వడసి యయ్యెడఁ బ్రవర్తిల్లెడు మేరగాంచెనో కాక మేరుశిఖరి
యంబరశ్యామిక యంబుధిపాగరుగా బ్రమసి యెక్కెనొ కాక బడబాగ్ని
హైమమై పరగు బ్రహ్మాండంబు పక్వమై తగఁబుట్టెనో కాక ఖగ మొకండు

తే ॥ వైనతేయుడు నీదృశవ్యాప్తి దీప్తుడాతడోకాక యితఁడని యఖిలజనులు
బహువిధానుమానారంభపరతఁజూడ సరుగుదెంచెఁ బక్షిప్రభుఁ డభ్రవీధి

(ఉత్తరభాగము 5-141)



కైలాసమునకు శ్రీకృష్ణుని కొనిపోవు సందర్భమున గరుడుని గమనమును వర్ణించు శ్లోకములు ఈక్రింద ఉట్టంకింపబడుచున్నవి. రవేణ మహతా తార్క్ష్య స్త్రైలోక్యం సమకంపయత్, సాగరం క్షోభయామాస పద్భ్యాం పక్షీ వ్రజం స్తదా, పక్షేణ పర్వతాన్ సర్వాన్ (అ 267-10,11) ఇచటి హరివంశములోని పద్యరత్నములను గమనింపుడు.

సీ ॥ తోరంపు టూర్పులతోడఁ బాతాళఁదాకంగ సాగరౌఘములు గలఁగ
వికటంపుటెఱకల విసరుస నుప్పొంగు తుప్పర డెందంబు దూపడంగ
బలితంపు జంఘల పెలుచని తాఁకున సమరయానములు తుత్తురుముగాఁగ
నుగ్రంపుఁజూపుల కొడలి కెంపుల దిక్కులన్నింట నెఱసంజ లావహింప

తే ॥ బఱచునురవడిఁ బొడమునిబ్బరపు మ్రోత
కొండగొబలెల్లఁ జొచ్చి యొండొండ వెరుగఁ
గ్రమతనుకాంతిపూరంబుఁ గడలుకొనఁగ
హరివహించి నభంబున గరుడుఁడరిగె (ఉత్తరభాగము 5-149)

**ఘంటాకర్ణునకు మోక్ష మనుగ్రహింపచేసినది గరుడవాహనుడే :**

శ్రీకృష్ణభగవానుడు బదరికాశ్రమమున తపస్సు చేసికొను సమయమున కుబేరుని అనుచరుడగు ఘంటాకర్ణుడను పిశాచనాయకుడు అచటికి వచ్చెను. అతడు పూర్వము పరమశివభక్తుడై, శివుని ఆరాధించి, ముక్తిని పొందగోరెను. కాని, ముక్తి శ్రీకృష్ణభగవానుని వలననే లభించునని శివుని వలన తెలిసి, అతనిని సేవించుటకై బయలుదేరి, దారిలో బరికాశ్రమమున శ్రీకృష్ణభగవానుని సేవించి, తన ఉద్దేశ్యమును తెలిపెను. తాను దర్శించినది శ్రీకృష్ణునియేనని తెలియని అతడు పిమ్మట అచటనే కూర్చుండి భగవానుని పలువిధముల స్తోత్రమును చేసి, అనుగ్రహింప, ప్రార్థించెను. భగవానుడు అతని భక్తితత్పరతకు మెచ్చి, అతనిపై కరుణకలిగినవాడై, నిజస్వరూపమును చూపి మోక్షమును అనుగ్రహించెను. అపుడు శ్రీకృష్ణభగవానుని ప్రత్యక్షమైనరూపము హరివంశమున ఇట్లు అభివర్ణింపబడినది. ". . . . జగన్నాథః ప్రీత స్తస్య బభూవ హ, అదర్శయత్ స్వ మాత్మాన మనన్యస్య జగత్పతిః, శుద్ధేఽంతః కరణే తస్య పిశాచస్యాథ భూమిప, స చ ఘోరః పిశాచోఽపి దదర్శాత్మని కేశవమ్, పీతకౌశేయవసనం పద్మాక్షం శ్యామలం హరిమ్, శంఖినం చక్రిణం విష్ణుం స్రగ్విణం గదినం విభుమ్, కిరీటినం కౌస్తుభినం శ్రీవత్సాచ్ఛాదితోరసమ్, నీలమేఘనిభం కాంతం గరుడస్థం ప్రభంజనమ్, చతుర్భుజం శుభగిరం నిశ్చలం సర్వగమ్ శివమ్" (అ 172, 9-13)

పైశ్లోకములలో భగవానుడు "**అనన్యస్య స్వమాత్మానమ్**" అనియుండుటను బట్టి మోక్షమనుగ్రహించునపుడు భగవానుడు భక్తులకు అనుగ్రహించు తన అసాధారణస్వరూపము గరుడవాహనాత్మకమేనని తెలియుచున్నది.

**బలిని గరుడుడు నాగపాశములనుండి విముక్తుని చేయుట :**

త్రివిక్రమావతార సందర్భమున భగవానుడు దేవతలకు స్వర్గమును తిరిగి సంపాదించి ఇచ్చెను. పిమ్మట భగవానుడు బలిని నాగబద్ధునిచేసి, స్వర్గమునకు వెడలెను. అపుడు నారదుడు బలివద్దకు వచ్చి, అతడు అట్లు నాగపాశములచే బంధింపబడుటను చూచి, అతనికి తానెరిగిన భగవత్స్తుతిని ఉపదేశించి, దానిని పఠింపుమని, నాగబంధములనుండి విముక్తుని చేయవలసినదిగా భగవానుని ప్రార్థింపుమని ఉపదేశించెను. బలియు అదేవిధముగ భగవానుని ప్రార్థించెను. అతని ప్రార్థనకు కఱగిన శ్రీమన్నారాయణుడు గరుడుని బలిని బంధవిముక్తుని చేయవలసినదిగా ఆదేశించెను. అతడును బలివద్దకు వచ్చి, నాగబంధములనుండి విడపించి అతడు బంధుమిత్రులతోపాటు పాతాళమున నివసింపవలెనని, అతడు అచటినుండి ఎచటకును కదలరాదని భగవానుని ఆజ్ఞ అనిచెప్పెను. ఈ వృత్తాంతము సంస్కృత హరివంశమున కలదు. ఎఱ్ఱాప్రగ్గడ దీనిని అనువదించినట్లు తోచదు. సంస్కృత హరివంశములోని శ్లోకము లిచట ఉదాహరింపబడుచున్నది. **"తతః ప్రసన్నో భగవా నాదిదేశ ఖగోత్తమమ్, గరుడం నాగహంతారం బలిం మోక్షయ బంధనాత్, తతో విక్షిప్య గరుడః పక్షా వతులవిక్రమః, జగామ వసుధామూలం యత్రాఽఽస్తే సంయతో బలిః, ఆగమం తస్య విజ్ఞాయ నాగా ముక్త్వా మహాసురమ్, యయుః పురీం భోగవతీం వైనతేయభయార్దితాః, ముక్తం విష్ణుప్రసాదేన చింతయాన మధోక్షజమ్, భ్రష్టశ్రియ మువాచేదం గరుత్మాన పపన్నగమ్, దానవేంద్ర మహాబాహో విష్ణు స్త్వా మబ్రవీత్ ప్రభుః, ముక్తో నివస పాతాళే న సపుత్రజనబాంధవః, ఇతః త్వయా న గంతవ్యం గవ్యూతి మపి దానవ". (అ 264-89-93)**

**పౌండ్రకవాసుదేవుని వధ :**

కాశీరాజు పౌండ్రకుడు తానే నిజమైన వాసుదేవుడనని, శంఖచక్రాదులను ధరించుటకు తానే అర్హుడనని, వాసుదేవనామమును వహించుటకు శ్రీకృష్ణుడు తగడు, కావున ఆపేరును అతడు వదలుకొనవలయునని భగవానునివద్దకు సందేశమును పంపెను. అతని గర్వమును అణచుటకై శ్రీకృష్ణభగవానుడు యుద్ధముచేయుటకై గరుడుని అధిరోహించి వెడలెను. ఈకథ భాగవత, విష్ణుపురాణ, హరివంశాదులలో ప్రస్తావింపబడినది. పౌండ్రకవాసుదేవుడు శంఖచక్రాది ఆయుధములనే కాక, తన ధ్వజముపై కృత్రిమ గరుడుని లాంఛనముగా గొనుట విశేషము. ఎఱ్ఱన దీనిని -

శంఖచక్రగదాఖడ్గచాపములకుఁ
బాంచజన్యాది నామకల్పనము లొలయఁ
బడఁగ గృత్రిమ తార్క్ష్యుండు ప్రజ్వరిలగఁ
దేరిపైనున్న పగతు నాశౌరి గనియె (ఉత్తరభాగము 6-219) అనుచు వర్ణించెను.

యుద్ధమున గరుడుడు ఆధ్వజమును ముక్కలు చేసెను. **"గరుడ చరణప్రహారంబులఁ గృత్రిమ గరుడలాంఛితంబులగు తదీయ ధ్వజదండంబు ఖండంబులు సేయించి"** అను ఎఱ్ఱన సూక్తి ఇచటస్మరణీయము (6-237)



**శ్రీభాగవతములోని మరికొన్ని వృత్తాంతములు :**

సృష్టిని చేయుమని బ్రహ్మచే ఆదేశింపబడిన కర్దమ ప్రజాపతి భగవానుని గూర్చి సరస్వతీ నదీతీరమున తపస్సుచేయగా, అతనిని అనుగ్రహించుచు భగవానుడు ప్రత్యక్షమయ్యెను. అప్పటి సన్నివేశము భాగవతమున (తృతీయస్కంధము 21వ అధ్యాయమున) ఇట్లు వర్ణింపబడినది. **"తావత్ప్రసన్నో భగవాన్ పుష్కరాక్షః కృతే యుగే, దర్శయామాస తం క్షత్తః శాబ్దం బ్రహ్మ దధత్ వపుః, స తం విరజ మర్కాభం స్మితపద్మోత్పల స్రజమ్, కిరీటినం కుండలినం శంఖచక్రగదాధరమ్, శ్వేతోత్పలక్రీడనకం మనఃస్పర్శిస్మితేక్షణమ్, విన్యస్తచరణాంభోజం మంసదేశే గరుత్మతః".** ఈశ్లోకములనుబట్టి కర్దమమునిని భగవానుడు గరుడవాహనారూఢుడై అనుగ్రహించెనని ఏర్పడుచున్నది.

**ప్రచేతసుని భగవానుడు అనుగ్రహించుట :**

ప్రాచీనబర్హి అను రాజకుమారుడు ప్రచేతనుడు. తండ్రి ఆజ్ఞానుసారము అడు భగవానుని గూర్చి జపమును చేయగా, అతనిని అనుగ్రహించుచు భగవానుడు ప్రత్యక్షమైనపుడు అప్పటి స్వామిరూపమును శ్రీభాగవతము ఇట్లు వర్ణించుచున్నది. **"తేషా మావిరభూత్ కృచ్ఛ్రశాంతేన శమయన్ రుచో, సుపర్ణస్కంధమారూఢో మేరుశృంగ మివాంబుదః, పీతవాసా మణిగ్రీవః కుర్వన్ వితిమిరా దిశః, కాశిష్ణునా కనకవర్ణవిభూషితేన, భ్రాజత్కపోలవదనో విలసత్కిరీటః, అష్టాయుధై రనుచము ర్మునిభి, స్సురేంద్రైః, ఆసేవితో గరుడకిన్నరగీతకీర్తిః" (4,30-4,5,6)**

పై శ్లోకములవలన గరుడవాహనారూఢుడైన భగవానుడు మేరుపర్వత శృంగమును అధిరోహించిన మేఘమువలె ప్రకాశించెనని తెలియుచున్నవి. ఇట్టి వర్ణన మిగిలినపురాణములలో, ఆళ్వార్ల పాశురములలో కూడ పలుచోట్ల కాననగును.

**దక్షప్రజాపతి వృత్తాంతము :**

దక్షప్రజాపతి సృష్టికార్యము సరిగా సాగుటకై భగవానుని గూర్చి బహువిధముల స్తుతించెను. అంత స్వామి ప్రత్యక్షమై దక్షుని కరుణించెను. ఆసందర్భము శ్రీభాగవతమున ఇట్లు వర్ణింపబడినది. **ఇతి స్తుతః సంస్తువతః స తస్మి న్నఘమర్షణస్త్ర, ఆవిరాసీత్ కురుశ్రేష్ఠ భగవాన్ భక్తవత్సలః, కృతపాదః సుపర్ణాంసే ప్రలంబాష్టమహాభుజః, చక్రశంఖాసిచర్మేషు ధనుః పాశగదాధరః" (6,4,35,36)** భగవానుడు భక్తులను అనుగ్రహించునపుడు గరుడవాహనుడైయుండుననుటకు పై వృత్తాంతము మఱియొక తార్కాణము.

**గరుడుడు-మార్గశీర్షమాసము :**

శ్రీభాగవతమున ద్వాదశస్కంధములో వ్యాసుడు ప్రతిమాసమును నిర్వహించు ద్వాదశాదిత్యులను, అప్సరసలను, మునులను, గంధర్వులను గూర్చి తెలుపుచు మార్గశీర్ష మాసమును గూర్చి ఇట్లు వివరించెను. **"అథాంశుః కశ్యప స్తార్క్ష్యః ఋతసేన స్తథోర్వశీ, విద్యుచ్ఛత్రుః మహాశంఖః**

సహోమాసం నవంత్యమీ" (11-41) ఈశ్లోకమునుబట్టి మార్గశీర్ష మాసమును నిర్వహించుటలో తార్క్ష్యుడు సహాయపడుచున్నట్లు ఏర్పడుచున్నది. భగవానుడు గీతలో **"మాసానాం మార్గశీర్షోఽహమ్"** అన్నట్లే **"వైనతేయ శ్చ పక్షిణామ్"** అనెను. కావున మాసములన్నిటిలోగొప్పది అగు మార్గశీర్షమును భగవద్రూపుడైన గరుత్మంతుడు నిర్వహించుట తగినదేకదా !

ఇచట ఉట్టంకింపబడిన భాగవతశ్లోకమున మార్గశీర్షమాసము సహశబ్దముచే నిర్దేశింపబడినది.**"సహతే ఇతి సహః"** అను వ్యుత్పత్తిని కల సహశ్శబ్దము అజంతముగా కూడ కనుపించుచున్నది. ఈ శబ్దములు రెండును బలము, మార్గశీర్షమాసములను అర్థమునిచ్చునవి. **"విజ్ఞానబలసంకులాత్"** అనునట్లు సంకర్షణ స్వరూపుడగు గరుడుడును బలమునకు మారుపేరు. అతని బలాఢ్యత పలు వృత్తాంతములలో విదితమే.ఇట్లు సహశబ్దము గరుడునకును లాక్షణికముగా బోధకమనవచ్చును. కావున మార్గశీర్షమాసమునకు గరుడునకుమధ్యగల సంబంధమును ఈనామముతో సూచింపబడినదననగును.

**ప్రజాపతి గరుడుని పక్షీంద్రునిగా అభిషేకముచేయుట :**

వేనరాజుకుమారుడగు పృథువును రాజుగా అభిషేకించిన పిమ్మట ప్రజాపతి ఆయాజాతులకు తగినవారిని అధిపతులుగా చేసెను. హరివంశము నాల్గవఅధ్యాయమున ఈ విషయము ప్రస్తావింపబడినది. ఈసందర్భమున **"అభిషిచ్యాధిరాజ్యే తు పృథుం వైన్యం పితామహః, తతః క్రమేణ రాజ్యాని వ్యాదేష్టు ముపచక్రమే, ఉచ్చైఃశ్రవస మశ్వానాం గరుడం చ పతత్రిణామ్ (4-12)** అను శ్లోకములు ఉదాహార్యములు.

**అమృతమథన వృత్తాంతము :**

దేవతలు, రాక్షసులును అమృతమునకై పాలసముద్రమును చిలుకునపుడు, మందరపర్వతమును కవ్వముగా, వాసుకిని దారముగా చేసికొనదలచిరి. వారు అందఱు తమ బలమును ఉపయోగించి, మందరపర్వతమునుపెకలించి, సముద్రతీరమునకు తీసికొనిపోవుటకు ప్రారంభించిరి. కాని, ఆ పర్వతము బరువును మోయలేక, దానిని వారందఱును క్రిందకు వదలివేసిరి. అపుడు ఆపర్వతము క్రింద పడి పలువురు దేవతలు, రాక్షసులును గాయపడిరి. వారి నిస్సహాయస్థితిని గమనించిన భగవానుడు దయతో గరుడునిపై అచటికివచ్చి, అతిసులభముగా తనచేతితో పర్వతమునుఎత్తి, గరుడునిపై పెట్టి, సముద్రతీరమునకు ఆపర్వతమును చేర్చెను. ఈ సందర్భము భాగవతమున సప్తమ స్కంధములోని 6వ అధ్యాయమున ఇట్లు వర్ణింపబడినది. **"తాం స్తథా భగ్నమనసో భగ్నబాహూరుకంధరాన్, విజ్ఞాయ భగవాం స్తత్ర బభూవ గరుడధ్వజః, గిరిపాతవినిష్పిష్టాన్ విలోక్యామరదానవాన్, ఈక్షయా జీవయామాస నిర్జరాన్ నిర్వ్రణాన్ యథా, గిరిం చారోప్య గరుడే హస్తేనైకేన లీలయా, ఆరుహ్య ప్రయయా వబ్ధిం సురాసురగణై ర్వృతః, అవరోప్య గిరిం స్కంధాత్ సుపర్ణః పతతాంవరః, యయౌ జలాంత ఉత్సృజ్య హరిణా స విసర్జితః" (36-39)**

దీనిచే క్షీరసాగర మథనమునకు ముందే గరుడుని అవతారము జరిగినట్లు స్పష్టపడుచున్నది.



**త్రివిక్రమావతార సందర్భమున గరుడుడు :**

భగవానుడు త్రివిక్రముడై కుడి ఒక పాదముతో భూమిని ఆక్రమించి, ఎడమ వేరొకపాదముతో పైలోకములను కొలిచినపుడు దైత్యులు అందఱును భగవానుని ఎదిరించుటకు సిద్ధపడిరి. అపుడు భగవానుని అంతరంగరక్షకులగు నందుడు, సునందుడు, జయుడు, విజయుడు, ప్రబలుడు, బలుడు, కుముదుడు, కుముదాక్షుడు, విష్వక్సేనుడు, గరుడుడు, జయంతుడు, శ్రుతదేవుడును సాయుధులై వారిని నిరోధించిరి. ఈ ఉదంతము భాగవతము 8వ స్కంధమున 21 అధ్యాయమున కలదు. **"తా నభిద్రవతో దృష్ట్వా దితిజానీకపాన్ నృప, ప్రహస్యానుచరా విష్ణోః ప్రత్యషేధ న్నుదాయుధాః, నందః సునందోఽథ జయో విజయః ప్రబలో బలః, కుముదః కుముదాక్ష శ్చ విష్వక్సేనః పతత్రిరాట్, జయంతః శ్రుతదేవ శ్చ పుష్పదంతోఽథ సాత్వతః, సర్వే నాగాయుతప్రాణాః చమూంతే జఘ్ను రాసురీమ్" (15-17).**

బలిచక్రవర్తి దానవవీరుల నందఱను వలదని నివారించెను. అనంతరము గరుడుడు భగవానుని ఉద్దేశ్యమును గ్రహించి, బలిని వరుణపాశములతో బంధించెను. **"అథ తార్క్ష్యసుతో జ్ఞాత్వా విరాట్ ప్రభుచికీర్షితమ్, బబంధ వారుణైః పాశైః బలిం సౌతేఽహని క్రతౌ (8-21-20).**

ఈ విషయమున హరివంశమునకు భాగవతమునకు మధ్యగల భేదము గుర్తింపతగినది.

**పృథుచక్రవర్తిని భగవానుడు అనుగ్రహించుట :**

బ్రహ్మదేవుని ఆదేశము ప్రకారము పృథుచక్రవర్తి లోకక్షేమమునకై భగవానుని ఉద్దేశించి గొప్పక్రతువును చేసెను. అపుడు భగవానుడు ప్రీతిచెంది యజ్ఞశాలలో ప్రత్యక్షమయ్యెను. అప్పటి సన్నివేశము గరుడవాహనమును అధిరోహించివచ్చినట్లు ఈక్రింది ప్రమాణశ్లోకము (భాగవతము 4వ స్కంధము 20వ అధ్యాయము) వలన తెలియుచున్నది. **"అథావమృజ్యాశ్రు కలా విలోకయ న్నతృప్తదృగ్గోచర మాహ పూరుషమ్, పదా స్పృశంతం క్షితి మంస ఉన్నతే విన్యస్తహస్తాగ్ర మురంగవిద్విషః" (22వ శ్లో)**

**ధ్రువుని అనుగ్రహించుటకై భగవానుడు గరుడవాహనారూఢుడై వచ్చుట :**

ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుడు సవతితల్లి అగు సురుచిచే అవమానింపబడి, భగవదనుగ్రహమువలన ఉన్నతస్థితిని పొందగోరి మధువనమున గొప్పతపస్సుచేసెను. అతని చిత్తశుద్ధిని గమనించిన భగవానుడు ధ్రువుని అనుగ్రహింప గోరి గరుడవాహనారూఢుడై మధువనమునకు వచ్చెను. **"త ఏవ ముత్పన్నభయా ఉరుక్రమే, కృతావనామాః ప్రయయు స్త్రివిష్టపమ్, సహస్రశీర్షాఽపి తతో గరుత్మతా, మధో ర్వనం భృత్యదిదృక్షయా గతః"** (4వ స్కంధము- 9వ అధ్యాయము-1 వ శ్లో.)

త్రిపురాసుర సంహార సమయమున భగవానుడు బాణముగా మారెనని పురాణములు

తెలుపుచున్నవి. ఆ సందర్భమున గరుడుడు బాణముటెక్కగా మారెనని తెలుపబడినది. అనగా ఆసందర్భమున కూడ గరుడుడు భగవానుకు గమనసాధనమయ్యెనని ఏర్పడుచున్నది.

**గజేంద్రుని భగవానుడు రక్షించుట :**

ఇంద్రద్యుమ్నుడను రాజు శాపవశమున గజేంద్రుడై మొసలిచే పట్టుబడి, రక్షణకొఱకు భగవానుని ప్రార్థించెను. అపుడు స్వామి ఆర్తరక్షణలోగల త్వరవలన గరుడునిపై అధిరోహింపకనే బయలుదేరినను, తన వెనువెంటగావచ్చిన గరుడునిపై పిమ్మట ఎక్కి, గజేంద్రుని కడకువచ్చి, అతనిని రక్షించెను. ఈ విషయము శ్రీభాగవతములోని ఈ క్రింది శ్లోకములు తెలియజేయుచున్నవి. **"త్వం తద్వాదార్త ముపలభ్య జగన్నివాసః, స్తోత్రం నిశమ్య దివిజైః సహ సంస్తువద్భిః, ఛందోమయేన గరుడేన సమూహ్యమానః, చక్రాయుధోఽభ్యగమ దాశుయతో గజేంద్రః, సోఽంతః సరస్యుపబలేన గృహీణత ఆర్తో, దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రమ్" (8-3-31,32).** గజేంద్రుని రక్షించిన పిమ్మట భగవానుడు గరుడుని పై ఎక్కి వెడలెను. **"ఏవం విలోక్య గజయూథప మబ్జనాభః, తేనాఽపి పార్షదగతిం గమితేన యుక్తః, గంధర్వసిద్ధవిబుధై రుపగీయమానః, కర్మాద్భుతం స్వభవనం గరుడాసనోఽగాత్" (8-4-13).**

ఈ ఉపాఖ్యానములోనే భగవానుడు తనను స్మరించినట్లే తనరూపమగు గరుడుని స్మరించిన వారికిని జీవిత చరమసమయమున నిర్మలమైన స్మృతిని కలుగచేయుదుననెను. **"శ్రీవత్సం కౌస్తుభం మాలాం గదాం కౌమోదకీం మమ, సుదర్శనం పాంచజన్యం సుపర్ణం పతగేశ్వరమ్, స్మరంతి మమ రూపాణి ముచ్యంతే హ్యేనసోఽఖిలాత్, తేషాం ప్రాణాత్యయే చాహం దదామి విమలాం మతిమ్" (4-8-19,25).** కావున గరుత్మంతుని స్మరణము భగవానుని స్మరణముతో సమానమని ఏర్పడుచున్నది. గరుడుడు భగవానుని రూపమే అనుటకు **"వైనతేయ శ్చ పక్షిణామ్"** అను గీతాసూక్తి అనుసంధేయము.

**సూర్యవంశమునకు గరుడునకు మధ్య సంబంధము :**

గరుడుని సోదరి అగు సుమతిని సగరుడను సూర్యవంశపు చక్రవర్తి వివాహమాడెను. ఈ వృత్తాంతము బ్రహ్మాండపురాణములోని 16,17, 18 వ సర్గలలో కలదు.

వినత కద్రువకు దాస్యము చేయు కాలమున, ఒకనాడు వినత కట్టెలను సంపాదించుటకై అరణ్యమునకు పోయెను. ఆ సమయమున గొప్ప వర్షముకురిసెను. ఆ వర్షములో వినత అరణ్యమున దారితప్పి, తలదాచుకొనుటకై ఒక సన్యాసి ఆశ్రమమును చేరెను. ఆ మహాత్ముడు వినత స్థితిని చూచి జాలిపడి, ఆమె దాస్యమును పోగొట్టు కుమారుడు ఆమెకు జన్మించునని అనుగ్రహించెను.

వినత కశ్యపుడను తన కుమార్తె అగు సుమతితో కలసి జీవించు కాలమున ఒకనాడు సుతవుని కుమారుడగు ఉపమన్యువను ఋషి వారివద్దకు వచ్చి ఇట్లనెను - "నేను గయా క్షేత్రమును దర్శించి, పితృదేవతలను ఆరాధించినపుడు, నేను వివాహమును చేసికొని, సంతానవంతుడనైనపుడే



తమకు పుణ్యలోకప్రాప్తి కల్గునని వారు పల్కిరి. కావున మీరు నాకు మీ కుమార్తెను ఇచ్చి వివాహమును చేయుడు". ఉపమన్యువు మాటకు వినత అంగీకరింపలేదు. అందులకు కోపించిన ఉపమన్యువు వేరొక బ్రాహ్మణునితో సుమతికి వివాహము జరిపించినచో వినతతల బ్రద్దలగునని శపించెను. వినతకు అపుడు ఏమి చేయుటకు తోచకుండెను. ఇట్టి సమయములోనే వినతకు గరుడుడు జన్మించెను. తన తల్లికి ఏర్పడిన సమస్యను గరుడుడు విని ఇట్లనెను- "ఉపమన్యువు శాపమును బట్టి వేరొక బ్రాహ్మణునికి సుమతిని ఇచ్చి వివాహము చేయకూడదనియే కదా ఏర్పడుచున్నది. కావున బ్రాహ్మణునితో కాక క్షత్రియునితో సుమతి వివాహమును జరిపిన సమస్యతీరును కదా" వినతకు గరుడుని ఆలోచన నచ్చినను, సుమతికి తగిన క్షత్రియుడెవ్వడో తెలియలేదు. అందువలన ఆమె గరుడుని తనకు పూర్వము వరమిచ్చిన సన్యాసివద్దకు పంపెను. అతడును గరుడుని ఔర్వుడను మునివద్దకు పొమ్మని పల్కగా, ఔర్వుడు సగరుడే అనుమతికి తగిన భర్త అని తెలిపెను. పిమ్మట సుమతీ సగరుల వివాహము జరిగెను. ఇట్లు గరుడనకు సూర్యవంశముతో అవినాభావ సంబంధము ఏర్పడెను.

గరుడునకు సూర్యునితో అవినాభావసంబంధముకలదని ఆధునిక విమర్శకుల అభిప్రాయము. జోతిశ్చక్రమును రక్షించు వాలఖిల్యమునులను గరుడుడు మోసికొనిపోవుట, అతడు ప్రతిదినము సూర్యుని ఆరాధించునట్లు తెలుపబడుటయు ఇందులకు కొన్ని నిదర్శనములని వారు పల్కుచున్నారు. సూర్యమండల పర్యంతము గరుడుడు నిరపాయముగా ప్రయాణము చేయగల్గుట, సర్పములకు అట్టి సామర్థ్యము లేకుండుటయు హేతువులుగా వారు ఉదాహరించుచున్నారు. మఱియు సూర్యుని అగ్రజుడైన అసూరుడు సూర్యసారథి అగుటయు వేరొక అంశము. ఈ సందర్భమున భారతీయ వాఙ్మయములోని గరుడునకు, సిరియాదేశ పురాణవాఙ్మయములోని గరుడునకు కల పోలికలును పరిశీలనీయములని ఆధునికులు అందురు. Ashur, Ahura, Mazda అను సిరియాదేశములోని దేవతల రూపములు వలయములోపల వ్రాయబడును. ఈ వలయము సూర్యమండలమునకు సంకేతమని, అందలి రూపములు గరుడునకు చిహ్నమని వారి వివరణము. ఇందులకు ప్రమాణములుగా వారు కొన్ని ఆధారములను చూపుచున్నారు. Khmer ప్రాంతములోని ప్రాచీనశిల్పములలో గరుడుడు వలయములో నున్న మానవరూపములో చెక్కబడినాడని, Oldhem అను విమర్శకుడు తెలిపెను. గరుడనాగజాతులు రెండును సూర్యుని మూలపురుషునిగా కల్గినవను వాదముతో ఇది పోలియున్నదని, పలుచోట్ల యుద్ధదేవత సూర్యుని రూపములోనున్నాడని, ఉదాహరణకు సిరియాదేశములోని యుద్ధదేవత అగు Ashur ఱెక్కలతో కూడిన వలయముతో సూచింపబడెనని Shantilal Nagar అను విమర్శకుడు Garuda- The celestial bird అను గ్రంథములో పేర్కొనెను. భారతీయసాహిత్యములోనే కాక పలుదేశముల సాహిత్యములలో కూడ సూర్యుడు విహంగముగా (పక్షిగా) నిర్దేశింపబడెను. దీనిని బట్టి పూర్వము గరుడునకు సూర్యునకుమధ్య అవినాభావసంబంధము ఉండెనని కొందఱి నవీన పరిశోధకుల ఊహ.

గరుడుని రూపముకూడ కాలక్రమమున వివిధపరిణామములను చెందినదని

చెప్పవలసియున్నది. పూర్వము పలు ప్రాంతములలో పలు విధములైన పక్షులు గరుడ శబ్దముతో (Eagel) వ్యవహరింప బడెడివట. ఈనాటి రాబందు జాతికి చెందిన పక్షికూడ గరుడపక్షిగా చెప్పబడెడిది. సాంచి తూర్పు ముఖద్వారము వద్ద గల స్తంభముపై చెక్కబడిన గరుడుని ముక్కు చిలుకముక్కును పోలియున్నది. ఈ సందర్భమున వినత శుకకి (చిలుకరూపమును కల్గినది) మనుమరాలుగా శ్రీరామాయణమున చెప్పబడుట స్మరింపతగినది. కాని, ఇట్టి రూపము తరువాతి కాలమున కన్పింపదు. గరుడుని రూపంలో మొదట పక్షిగా, తర్వాత మానవ- పక్షిరూపాలను రెండిటిని కలసి ఉన్న సంకీర్ణరూపంతో, విష్ణువాహనంగా, విష్ణువు కేతనంగా, ఆతర్వాత స్వతంత్రదేవతగా ఇట్లు క్రమపరిణామం కన్పిస్తుంది.

**గరుడునకు సంబంధించిన మరికొన్ని వివరములు :-**

1. వానరులు సీత జాడను వెదకునపుడు గరుడుని నివాసమును దర్శించిరి. (రామాయణము - కిష్కింధాకాండ - 40వ సర్గ)
2. గరుడుడు దక్ష ప్రజాపతి కుమార్తెలను నల్గురను వివాహమాడెను. (భాగవతము - షష్ఠస్కంధము)
3. గరుడునకు కపోతుడను కుమారుడు కలడు (ఉద్యోగపర్వము -101 అధ్యాయము)
4. అర్జునుని జన్మదినోత్సవ సందర్భమునకు గరుడుడు కూడ వచ్చెను. (ఆదిపర్వము - 122వ అధ్యాయము - 50వ శ్లోకము)
5. సుబ్రహ్మణ్యస్వామి జన్మించినపుడు గరుడుడు తన కుమారుడగు మయూరుని అతనికి బహూకరించెను (ఆనుశాసన -86-21)

**సంస్కృతకావ్యాల్లో గరుడుడు :**

గరుడుని ప్రభావం సంస్కృతకావ్యసాహిత్యంలో ఉన్నతమైనది. కాళిదాసు విక్రమోర్వశీయంలో గరుడుని వేగానికి ప్రతీకగా (మొదటి అంకంతో) పేర్కొన్నాడు. దండి అవంతిసుందరీకథలో ఒకచోట ఒక సిద్ధుడు గరుడ మంత్రాన్ని అష్టసిద్ధులకోసం జపిస్తున్నట్లు చెప్పాడు. నైషధమహాకావ్యంలో శ్రీహర్షుడు **"యథోహ్యమానః"** ఇత్యాది శ్లోకంలో నలుడు దమయంతి హృదయంలో ప్రవేశించిన సందర్భాన్ని గరుడుడు బాణాసురుని రాజధాని శోణితపురాన్ని ప్రవేశించినదానితో పోల్చాడు. కథాసరిత్సాగరంలో అమృతాహరణవృత్తాంతం ఇంకొక విధంగా వర్ణింపబడినది. సూర్యరథానికి కట్టబడిన గుఱ్ఱాల వర్ణం విషయంలో కద్రువ-వినతల మధ్య వివాదం ఏర్పడింది. కద్రువ అవి నల్లనివి అంటే, వినత కాదు, తెల్లనివి అన్నది. నిజానికి నల్లనివైన సూర్యాశ్వాలు నల్లగా కన్పించేటట్లు కద్రువ తన కుమారుల విషప్రభావంలో చేసి పందెం గెలిచింది. అందువల్ల వినత కద్రువకు దాసి అయినది. ఆసంగతిని విన్న గరుడుడు కద్రువ వద్దకు వచ్చి, తనతల్లి దాస్యాన్ని



తీర్చడానికి ఏమి కావాలని అడిగాడు. కద్రువ అతనితో దేవదానవు లపుడు క్షీరాబ్ధిని చిలుకుతున్నారని, దానినుండి పుట్టే అమృతాన్ని సంపాదించి ఇస్తే, వినత దాస్యం తీరుతుందని అన్నది. గరుడుడు వెంటనే క్షీరాబ్ధిని చేరి, అక్కడ తన బలాన్ని విష్ణువు సమక్షంలో ప్రదర్శించి, మెప్పించి, అతని అనుగ్రహంతో అమృతాన్ని సంపాదించి తెచ్చి, తన తల్లి దాస్యాన్ని పోగొట్టాడు. ఈ విధమైన పలు వృత్తాంతాలు కావ్యసాహిత్యంలో ఉన్నాయి. విస్తర భీతి వల్ల దిఙ్మాత్రంగా ఈ ఒకటిమాత్రం ప్రస్తావింపబడినది. బౌద్ధమత ప్రభావంతో రచింపబడిన నాగానంద నాటకంలో గరుడుని ప్రస్తావన ఉన్నది. అందులో గరుడుడు నాయకుడైన జీమూత వాహనుని అహింసా మార్గంవల్ల ప్రభావితుడై, నాగులను భక్షించడం మానేస్తాడు.

స్తోత్రాల్లో గరుడుడు : "దాసస్సఖా" ఇత్యాదిగా స్తోత్రరత్నములో యామునులు "యథా యోగం సేవ్యమానం'' ఇత్యాదిగా వైకుంఠ గద్యలో భగవద్రామానుజులు, "లక్ష్మీ ప్రియాః పరిజనాః పతగేంద్ర ముఖ్యాః'' ఇత్యాదిగా కూరేశులు, "శ్రుతిమయం" అనుచు శ్రీరంగరాజస్తవమున భట్టరు, "భుజగేంద్ర గరుత్మదాది లభ్యైః" ఇత్యాదిగా దేశికులు, ఇట్లే పలువురు పూర్వాచార్యులు తమ స్తోత్రములలో గరుడుని మహిమను ఉగ్గడించిరి. వీరి సూక్తుల వలన పలు విశేషములు గోచరించుచున్నవి. భట్టరు గరుడుని అద్దముగా, దేశికులు మందరపర్వతముగా వర్ణించుట ఇందులకు ఒక తార్కాణము. ఇట్టి రూపణలు స్తోత్రములలో పలు కన్పించుచున్నవి.

**దివ్యప్రబంధవాఙ్మయంలో గరుడుడు :**

భగవానుడనే చల్లని సరస్సులో అవగాహించిన దివ్యసూరులకు తమిళవాఙ్మయంలో ఆళ్వార్లు (మునుగువారు) అనే సార్థకనామం ఏర్పడింది. వీరు అనుగ్రహించిన ప్రబంధాలలో పలుచోట్ల గరుడుని వైభవాన్ని కొనియాడే సూక్తులున్నాయి. వానిలోగల స్వారస్యాలను పూర్వాచార్యులు అనితరసాధారణమైన రీతిలో వ్యాఖ్యానించారు. ఆ విశేషాలలో కొన్ని మాత్రం ఇక్కడ దిఙ్మాత్రంగా నివేదింపబడుతున్నాయి.

**గరుడుని స్వరూపం :**

**1. ఱెక్కల అందం, విస్తృతి :-** గరుడునకు సుపర్ణుడనే పేరు వేదకాలంనుండి ప్రసిద్ధం. ఈ నామానికి అందమైన, పెద్దవైన, గొప్పఱెక్కలను కలవాడని అర్థం. ఈ భావాన్ని ప్రతిబింబించే పలు ప్రయోగాలు దివ్యప్రబంధాల్లో ఉన్నాయి. **"అఞ్జిఱైప్పుళ్"** (పెరియతిరు 5-6-6), **"అఞ్జిఱైప్పుళ్ళామ్"** (తిరునెడు-6) తి.వా. (1-4-1) ఇత్యాదులు ఇందులకు తార్కాణాలు. గరుడుని ఱెక్కలు విశాలమైనవి. ఇంతటి వైశాల్యం ఏవిధంగా వచ్చినదనడానికి ఒక చక్కని ఉత్ప్రేక్ష దివ్యప్రబంధవ్యాఖ్యలలో కానవస్తుంది. **"పొఱుశిఱైప్పుళ్"** అనే తిరువాయ్ మొழி (1-9-3) దివ్యప్రబంధసూక్తిని వ్యాఖ్యానిస్తూ నమ్బిళ్లై - **"సర్వేశ్వరన్ పెరియతిరువడియై మేళ్కొళ్ళువతాక నినైత్తు, 'వా' ఎన్ఱழைత్తాల్, అవనుడైయ అంగీకారత్తాల్ ఉణ్డాన హర్షత్తాలే పెఱుక్కాఱు శుழிత్తాప్పోలే శుழிత్తు త్తన్నిల్ పారానిన్ఱుళ్ళ శిఱకైయుడైయనాయ్ క్కొణ్డు"** అని పల్కుట ఇందులకొక ఉదాహరణం. గరుడుని ఱెక్కల గొప్పతనాన్ని **"ఇరుమ్ శిఱైప్పుళ్"** (ముదల్‌తిరు-17) అనే సరోయోగిసూక్తి తెలుపుతున్నదని అప్పిళ్లై అనే వ్యాఖ్యాత

**"పెరియశిఱకైయుడైయవనాన పెరియతిరువడియై"** అంటూ తెలిపారు. గరుడుని ఱెక్కలు బంగారురంగులో మెఱుస్తాయని, లేక బంగారువలె ఆకర్షణీయమైన రంగును కల్గిఉంటాయని అందువల్ల సుపర్ణుడనే పేరు సార్థకమని అమరసుధావ్యాఖ్య తెలుపుచున్నది. ఇక, గరుడుని ఱెక్కల చిత్రవర్ణం కూడా దివ్యప్రబంధాల్లో ప్రస్తుతమైనది. **"పొటికొళ్ శిఱై ఉవణమ్"** (ముదల్‌తిరు -22) అనే సరోయోగి ప్రయోగాన్ని వ్యాఖ్యాత **"చిత్రపటమ్‌పోలే నానావర్ణమాన శిఱకైయుడైయ పెరియతిరువడి"** అని వివరించారు. ఇటువంటి ప్రయోగాలు, వివరణలు అనేకం.

**2. కన్నుల్లోని కోపం :-** గరుడుని నేత్రాలలో శత్రునిరసనవిషయకమైన క్రూరత్వం **"వెజ్గణ్‌పుళ్"** (తి.వా. 6-8-5), **"వెజ్గణ్‌పఱవై"** (తి.వా. 8-2-1) అనే శఠకోపసూరి ప్రయోగాల్లో వ్యక్తమౌతున్నది. **"వరుకిఱపోతే వఝియిలే ప్రతిబంధకజ్గళై ప్పోక్కుకైయిలే శివత్త కణ్ణైయుడైయవన్"** అనే అచటి నమ్బిళ్లై వ్యాఖ్యానసూక్తి స్మరణీయం.

**3. నల్లని ముక్కు :-** పాంచరాత్రాగమాదుల్లో గరుడుడు ముక్కు చివర నల్లని రంగు కల్గినవాడుగా తెలుపబడింది. "నీలనాసాగ్ర సంయుతమ్" ఇత్యాది సూక్తులు ఇందులకు ఉదాహరణాలు. గరుడుని ముక్కు నల్లని గుర్తు కల్గినదని **"కఱైయణి మూక్కుడైప్పుళ్లై"** (తి.వా. 3-10-2) అనే శఠకోపసూరి సూక్తి కూడ తెలుపుతున్నది. ఈ నల్లని చిహ్నం ఏవిధంగా ఏర్పడింది ? అనే సందేహాన్ని తీరుస్తూ వ్యాఖ్యాత నమ్బిళ్లై - **"ప్రతిపక్షత్తైక్కొన్ఱు కఱైకఝువ అవసరమిన్ఱిక్కేయిరుక్కైయాలే కఱైయేఱి, అతువే ఆభరణమాయిరుక్కుమ్ మూక్కు ఎన్నుతల్"** అనే ఒక హేతువును ఉత్ప్రేక్షించారు. అందువల్ల ఈ గుర్తు గరుడుని శత్రునిరసనశీలత్వానికి చిహ్నం.ఇట్టి భావనే సుదర్శనుని విషయంలో కూడా కానవస్తుంది. ఇందులకు పరాశరభట్టర్ కృత శ్రీరంగరాజస్తవ-పూర్వశతకంలోని **"దైత్యచ్ఛేదకల్మాషితాంగమ్"**అనే సూక్తి ఒక ఉదాహరణ. నమ్బిళ్లై వేరొక హేతువును కూడా - **"అన్ఱిక్కే, తాయార్ పుత్రముఖమ్ కాణవేణుమ్ ఎన్నుమ్ అభినివేశత్తాలే ముట్టైయా యిరుక్కిఱ పరువత్తిలే ఒరు ఉద్యోగత్తైప్పణ్ణినాళాయ్, ఆభరణమాక వుడైయ పుళ్లెన్నుమామ్"** అంటూ సంభావించడం విశేషం. **"మీళియమ్ పుళ్లైక్కడాయ్"** (తి.వా. 7-6-8) ఇత్యాదిప్రయోగాలు కూడా ఇచట గమనింపతగినవి.

**4. కిణాంకములు :-** పూర్వోదాహృతమైన శఠకోపసూరి ప్రణీతమైన తిరువాయ్‌మొఝి (3-10-2) సూక్తిలోని **"కడావి"**అనే పదస్వారస్యాన్ని నమ్బిళ్లై అనుగ్రహిస్తూ -**"రథాదికళై నడత్తుమాపోలే తిరుమేనియోట్టై స్పర్శత్తాలే తిమిర్‌న్దు వడిమ్బిట్టు త్తాక్కి నడత్తవేణ్డియిరుక్కిఱపడి"** అని వచించారు. దీనివల్ల భగవానుని స్పర్శసుఖంవల్ల పరవశుడైన గరుడుని తన పాదాలతో స్వామి ప్రహరించినపుడు కిణాంకములు ఏర్పడినవనుట ఇచట పరోక్షంగా ప్రస్తుతం. ఈభావమే **"అమ్‌పుళ్"** (4-5-4) అనే తిరువాయ్‌మొఝి ప్రయోగంలో నిహితమై ఉన్నట్లు ఆచార్యుల భావన. ఇట్టి దివ్యప్రబంధసూక్తి స్వారస్యాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీయామునులు స్తోత్రరత్నంలో **"త్వదంఘ్రి సమ్మర్దకిణాంకశోభినా"** అని సాయించారు. భగవానుడు భక్తరక్షణలో గల త్వరలో వేగంగా వెళ్ళాలనే ఉద్దేశ్యంతో తన కాలితో గట్టిగా మోదడంవల్ల, దుష్టశిక్షణకై జరిగిన పోరులో ప్రత్యర్థుల ఆయుధ ప్రహారాల వల్ల ఈ కిణాంకాలు ఏర్పడ్డాయని వ్యాఖ్యాతల వివరణము.



**5. గరుడుని అలంకారం :-** పాంచరాత్ర వైఖానస ఆగమగ్రంథాల్లో గరుడుని పలు అలంకారాలు వివరింపబడ్డాయి. ఈఅంశం దివ్యసూరి సూక్తుల్లోకూడా సూచనాప్రాయంగా కన్పిస్తుంది. **"పణ్‌కొణ్డపుళ్"** (తి.వా. 3-8-5) అనే శఠకోపసూరి సూక్తిని నమ్బిళ్లై **"పణ్ణ్బొన్ఱు వాహనపరిష్క్రియయై చ్చొల్లుదల్"** అని వివరించడం ఇందులకొక నిదర్శనం.

**6. ఎఱ్ఱనికేశాలు, గొప్పరూపము :** తిరువాయ్‌మొఝిలోని **"నిగఱ్చెమ్బుజ్గివిఝికళ్ నీణ్డవశురర్ ఉయిరెల్లామ్ తకర్‌త్తుణ్డుఝలుమ్ పుట్పాకన్"** (8-10-6) అనేసూక్తి వల్ల గరుడుడు జాతిప్రయుక్తమైన ఎఱ్ఱని కేశాలను, అగ్నివలె మండే కళ్లను, గొప్పరూపాన్ని కల్గినవాడని ఏర్పడుతున్నది.

గరుడుని ఱెక్కలు అందంగా ఉండడానికి గల ఒక కారణంకూడా పూర్వాచార్యులు ఒక చోట ఉత్ప్రేక్షించారు **"అఞ్జిఱైయపుళ్ళూర్‌ది"** (తిరుచ్ఛంద -46) అనే భక్తిసారసూరి సూక్తిని పెరియవాచ్చాన్‌పిళ్లై **"స్పర్శత్తాలే అఝకుపెఱ్ఱతిరుచ్చిఱకైయుడైయ పెరియతిరువడి"** అని వివరించడం గమనార్హం. ఈసందర్భంలో వ్యాఖ్యాత అంతటితో ఆగక -**"అవనైమేఱ్కొణ్డాల్ ఈశ్వరనుక్కు అలంకారమాయిరుక్కుమ్బడియాన అఝకై చ్చొల్లిఱ్ఱాకవుమామ్"** అని వ్యాఖ్యానించడంకూడా గరుడుని ఱెక్కల సౌందర్యాతిశయాన్ని తెలుపుతున్నది. భగవానునకు సైతం శోభను కల్గించే అందం గరుడుని ఱెక్కలకు ఉన్నదని కదా ఇచటి భావం.

**గరుడుని స్వభావం :**

**1. వేదమయత్వం :-** గరుడుని వేదమయత్వం **"సుపర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరో"** ఇత్యాది శ్రుతులవల్ల **"వేదాత్మా విహగేశ్వరః"** ఇత్యాది అభియుక్తోక్తులవల్ల స్పష్టపడుతున్నది. ఈ అంశాన్ని భట్టనాథులు **"వన్నాత ప్పుళ్"** (3-9-1) అంటూ తమ ప్రబంధంలో తెలిపారు. ఈసూక్తిని శ్రీకృష్ణ సూరివరులు -**"నాదప్రధానవేదమయనా యిరుక్కిఱ పెరియతిరువడియాలే, త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః" ఇత్యాదియాలే ఇవనుడైయ వేదమయత్వం సువ్యక్తమాక చ్చొల్లప్పడానిన్ఱదిఱే'** అని వ్యాఖ్యానించడం గమనార్హం. పరకాల సూరి **'తువాయప్పుళ్'** అనేసూక్తిలో ఈ అర్థాన్ని వచించారు అని వ్యాఖ్యాన సూక్తి. ఈ ప్రయోగాన్ని నమ్బిళ్లై **"నిర్దోషమానశబ్దత్తై వడివాక వుడైయవ నెన్నుదల్, వేదాత్మా-ఎన్నక్కడవదిఱే"** అని వ్యాఖ్యానించారు. ఇదే భావం **"పణ్‌కొణ్డపుళ్"** (3-8-5) అంటూ తిరువాయ్‌మొఝి ప్రబంధంలో శఠకోపసూరి వ్యక్తం చేశారు.

**2. అసాధారణ బలిమి :-** గరుడుని అసాధారణమైన బలాన్ని నిరూపించే దివ్యసూరి సూక్తులు అనేకం ఉన్నారు. -**"వలమ్‌పుళ్"** అనే తిరువిరుత్త ప్రబంధ (87) సూక్తి, **"వలమ్‌కొళ్‌పుళ్ అనే తిరువాయ్‌మొఝి"** (2-4-4) సూక్తి ఇందులకు నిదర్శనాలు.

**3. విస్మనీయవ్యాపారశీలత్వము :-** గరుడుని లీలలు అత్యాశ్చర్యకరములు. ఈ భావాన్ని శఠకోపసూరి **"మావియమ్ పుళ్"** అంటూ తిరువిరుత్తంలో (67) వ్యక్తంచేశారు.

**4. శత్రునిరసనశీలత్వమ్ :-** గరుత్మంతుని శత్రునిరసనస్వభావత్వం దివ్యసూరులు పలు సూక్తులలో తెలుపబడినది. శఠకోపసూరి - **"పాటిప్పాటి యశురర్‌తమ్ పల్‌కుఘ్రాజ్గళ్ నీటెఘ్రపాయ్‌పఅవై ఒన్టేటి"** అంటూ సువిశదంగా తెలిపారు. ఇదే భావాన్ని **"కొడియపుళ్"** (తి.వా.5-69) ఇత్యాది ప్రయోగాల్లో కూడా గమనించవచ్చు. శత్రువులపై కోపించేస్వభావం **"కాయ్ శినైప్పఅవై"** (తి.వా. 9-2-5), **"తఘ్రల్‌పోల్ శినత్త అప్పుళ్"** (తిరువిరుత్తం-3) ఇత్యాదిసూక్తులలో వ్యక్తమౌతున్నది.

**5. దయాగుణం : -** శఠకోపసూరి **"అరుళాఘ్రి ప్పుళ్"** (తి.వా.1-4-6) అంటూ గరుడుని దయాగుణాన్ని ప్రస్తుతించారు ఈప్రయోగాన్ని నమ్పిళ్లై - **"అరుళ్‌కడలానపుళ్"** అని వివరించారు.

**6. మండలగతి : -** గరుడుని మండలాకార పరిభ్రమణాన్ని **"శారికైప్పుళ్"** (తిరువిరుత్తం 19) అనే శఠకోపసూరి సూక్తి తెలుపుతున్నది. ద్రావిడంలో **'శారి'** అంటే మండలాకృతి అని అర్థం. అందువల్ల **'శారికై'** అనే విశేషణం వల్ల ఈ అర్థం స్ఫురిస్తున్నది.

**7. భగవద్విధేయత్వం :-** **"వన్నాతప్పుళ్"** (3-9-1) అనే భట్టనాథసూరి సూక్తిని వివరిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్లై - **"వన్మై పెరియ తిరువడిక్కు విశేషణమాకవుమామ్. ఇవనుక్కు వలిమై యావదు నినైత్తకార్యమ్ ముడిక్కవల్లశక్తి"** అని అనుగ్రహించడం, అట్లే **"పాయ్‌పఅవై ఒన్టు"** (తి.వా. 2-6-8) అనే శఠకోపసూరి ప్రయోగాన్ని నమ్పిళ్లై **"పెరియతిరువడిక్కు అద్వితీయత్వమ్ అవన్ కరుత్తఅిన్డ నడక్కైయిల్ తలైవనాకై"** అని వ్యాఖ్యానించడం గరుడుని భగవద్విధేయత్వాన్ని, భగవానుడు తలపెట్టిన కార్యాన్ని నిర్వహించడంలోగల సామర్థ్యాన్ని స్పష్టపరుస్తున్నవి. ఇట్టి ప్రయోగాలు, వ్యాఖ్యలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

**8. భగవదనుభవంవల్ల ఆడుట : -** గరుడుడు భగవానుని సేవవల్ల కల్గిన ఆనందాతిశయంతో ఒడలు తెలియనట్లు ఆడుతాడట. **"ఆడుమ్ పఅవై"** అనే శఠకోపసూరి (7-10-3) సూక్తికి నమ్పిళ్లై వ్యాఖ్యను అనుగ్రహిస్తూ -**"సర్వేశ్వరన్ వాహనమ్ ఎన్గిఅ హర్ష ప్రకర్షత్తాలే మధుపానమత్తరైప్పోలే కళిత్తాడానిఘ్నళ్ల పెరియతిరువడి తిరుత్తోళిలే"**- అని పల్కడం ఇందులకొక ఉదాహరణ. ఇదే భావాన్ని **"ఆడుపుట్కొడి"** (తి.వా.4-10-7) **"ఆడల్‌పఅవై"** (తి.వా. 8-8-9) అనేసూక్తుల వ్యాఖ్యలలో గమనించవచ్చు.

**9. యుద్ధనిర్వహణలో అద్వితీయత్వము :-** పెరియాఘ్వార్ తిరుమొఘ్రిలోని **"శెరువాఘ్రమ్ పుళ్లాళన్"** (4-9-10) అనే సూక్తిని వ్యాఖ్యాత **"యుద్ధత్తై స్వయమేవ నిర్వహిక్కుమ్ పెరియతిరువడియై ఆళుకిఅవన్, ఆశ్రితవిరోధికళాన అసురరాక్షసర్‌కళోడే యుద్ధమ్ పణ్ణుమిడత్తిల్ అన్ద యుద్ధత్తై పెరియతిరువడి తానే నడత్త, ఇవన్ కాణవన్ద శోఘ్రోపాతి అత్తైక్కణ్డు, అవన్ తోళిలే ఇరుక్కుమత్తై యాయ్‌ఘ్రు."** అని వివరించడం వల్ల ఈ అంశం స్పష్టమౌతున్నది.

**10. వేగము :** గరుడుని వేగం అసాధారణమైనది. అది వాయువేగమనోవేగాలకంటె ఎక్కువ. శఠకోపసూరి గరుడుని వేగాతిశయాన్ని **"అశురర్ మఙ్గ కడావియ వేగప్పఅవై"** (తిరువిరుత్తం -6) అంటూ స్తుతించారు. **"తిరువుళ్లమ్ పోలేయిటే తిరువడియుడైయవేగమిరుప్పదు"** అంటూ నమ్పిళ్లై తిరువిరుత్తవ్యాఖ్యలో



అంటారు. గరుడుడు అసురులను సమూలంగా నశింపచేశాడు అనే సూక్తిలోని స్వాపదేశార్థాన్ని నమ్పిళ్లై- **"అశురర్ మఙ్గకడావియవేగప్పఅవై - ఎన్గిఅ విశేషణత్తాలే కొణ్డప్రయోజన మెన్ ? ఎన్నిల్, తదీయర్ ఓరా శ్రయత్తిలే శీటినాల్ పిన్నైఅఙ్గశేషిప్పతు ఒన్టిల్లై-ఎన్గై"** అని వివరించిడం వల్ల భగవద్భక్తులకు ఎవరిపైన అయినా కోపంకల్గితే వాళ్లు సములంగా నశిస్తారు, మిగలరు అనే అర్థానికి అది సంకేతమని తెలుస్తున్నది.

**11. గరుడుని భగవద్వాహనత్వము :-**

భగవానునకు గరుడుడు **"దాస స్సఖా"** ఇత్యాదిగా పలురీతులలో సేవచేయువాడైనా వాహనముగా, ధ్వజముగా పురాణేతిహాసాదులలో, దివ్యప్రబంధాదిసంప్రదాయవాఙ్మయంలో సుప్రసిద్ధుడు. ఇట్లు వాహనంగా, ధ్వజంగా గరుడుడు అవడంలోని స్వారస్యాలు దివ్యసూరిసూక్తుల ననుసరించి, వానిని వ్యాఖ్యానిస్తూ పూర్వాచార్యులు అనుగ్రహించిన విశేషార్థాలను అనుసరించి యత్కించిత్ నివేదింపబడుతున్నది. అమరకోశములోని గరుడునకు కల పర్యాయపదములో విష్ణురథనామమొకటి ఉన్నది. దీనిని సుధావ్యాఖ్యానకారుడు - **"విష్ణోః రథ ఇవ, యద్వా - రథః పౌరుషదేహయోః - ఇతి త్రికాండశేషః, విష్ణోః రథః, పౌరుషం, దేహో వా, వైనతేయ శ్చ పక్షిణామ్ - ఇతి గీతా"** అని వివరించాడు. దీనిని బట్టి గరుడుడు భగవానుని పౌరుషానికి చిహ్నమని, అతడు భగవద్రూపానికి ప్రతీక అని ఏర్పడుతున్నది. శ్రీవిష్ణుసహస్రనామంలో గరుడవాహనత్వాన్ని **"మహాక్షః"** అనే నామం వివరిస్తున్నదని శ్రీపరాశరభట్టర్ తెలిపారు. **"మహాన్ పూజ్యః అక్షః యస్య సః. వహనేన రథావయవసామ్యాత్ అక్షః, త్రయీమయః తార్క్ష్యః. స హి గరుడ వాహనస్య ఔపవాహ్యః"** అనే అచటి వివరణం స్మరణీయం. ఈగరుడవాహనత్వానికి చెందిన కొన్నిస్వారస్యాలు దివ్యప్రబంధసూక్తుల, వాని వ్యాఖ్యల ఆధారంగా ప్రస్తుతింపబడుతున్నాయి.

**భగవానుడు ఏల గరుడుణ్ణి అధిరోహిస్తాడు :**

దీనికి పలువిధాలైన సరసములైన వివరణలను పూర్వాచార్యులు అనుగ్రహించారు. కలివైరిసూరి కృత తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని **"అఙ్జిఱైయపుళ్ తనిప్పాకన్"** (6) అనే ప్రయోగాన్ని పెరియవాచ్చాన్‌పిళ్లై **"వినైయుళ్లపోదన్ట్ వాహనాపేక్షైయుళ్లదు ! ఎన్నిల్ -వినైయిల్లాద పోదిలుమ్ రాజాక్కళ్ అఘ్రకుశణ్డేఅక్కడపదాయిటే యిరుప్పదు. ఓడుమ్ పుళ్లేటి - ఎన్నక్కడపదిటే.పెరియతిరువడి శెల్లామైయాలుమ్, తన్‌శెల్లామైయాలుమ్, నిత్యసూరికళైఅనుభవిప్పైక్కాకవుమ్ అఘ్రకుశెణ్డేఅ క్కడవదాయిటే యిరుప్పదు. "శెఘ్రమ్ పఅవైత్తానేఱిత్తిరివాన్" ఎన్నక్కడ వదిటే "** అని వివరించారు. దీనిని బట్టి భగవానుడు గరుడుని అధిరోహించకపోతే తాళలేని తన స్వభావంవల్ల, గరుడుని అట్టిస్వభావం వల్ల, పరమపదంలోని నిత్యసూరులకు, ఈ లోకంలోని భక్తులకు గరుడునిపై తాను అధిరోహించినపుడు ఉండే అందాన్ని సేవింపచేయడానికి గరుడుని స్వామి వాహనంగా స్వీకరిస్తాడని తెలుస్తున్నది. భక్తుల మనస్సులను దోచడానికి కూడా గరుడవాహనుడుగా స్వామి దర్శన మిస్తాడట. **"పుళ్లూరుమ్ కళ్వర్"** (తిరువిరు -22) అనే సూక్తిని నమ్పిళ్లై వ్యాఖ్యానిస్తూ- **"పెరియ తిరువడియై**

**నడత్త ఎన్దు ఒరువ్యాజమాయ్ సర్వస్వాపహారమ్ పణ్ణుమవరాయ్‌గ్రు"** అని పల్కడం ఇందులకు తార్కాణం. **"వెళ్లేఱన్ నాన్ముకన్ ఇన్దిరన్ వానవర్ పుళ్లూర్‌ది కళ్లుల్ పణిన్దు ఏగ్రువరే"** అనే తిరువాయ్‌మొళ్ళి (2-2-10) సూక్తిని నమ్పిళ్లై వ్యాఖ్యానించేటప్పుడు -**"సర్వేశ్వరన్ పెరియపిరాట్టియారుమ్, తానుమాయిరుక్కుఱ ఇరుప్పిల్ పుకప్పెఱామైయాలే, తిరుప్పాఱ్కడలుక్కు ఇవ్వరుకే కూప్పిట్టాల్ ఇవర్‌కళుక్కు క్కాట్టిక్కొడుక్కైక్కాక తిరువడిత్తోళిలే యేఱి పుఱప్పడుమ్"** అని పల్కడంవల్ల క్షీరాబ్ధిశయనుడైన స్వామిదగ్గఱకు చేరలేని బ్రహ్మాదులను అనుగ్రహించే నిమిత్తం స్వామి గరుడవాహనారూఢుడు అవుతాడట. ఆవిధంగా - **"అరుళాళ్ప్పుళ్‌కడవీర్ అవర్‌వీది ఒరునాళ్"** (తి.వా. 1-4-6) అని, **"వెళ్లైచ్చురిశఙ్గొడాళ్లి ఏన్ది తామరైకణ్ణ నెన్నెఞ్జినోడే పుళ్లైక్కడాకిన్ఱవార్తై"** అని ప్రార్థించే శఠకోపసూరి వంటి మహనీయులైన భక్తులను అనుగ్రహించడానికి కూడా గరుడుణ్ణి అధిరోహిస్తాడు. నరకాసురుడు, బాణాసురుడు, మాలి మొదలగు దుష్టులనిరసనార్థం గరుడుణ్ణి వాహనంగా చేసికోవడం ప్రసిద్ధమే కదా ! అందువల్ల శిష్టరక్షణార్థం **(పరిత్రాణాయ సాధూనాం)**, దుష్టశిక్షణార్థం **(వినాశాయ చ దుష్కృతామ్)** గరుడ వాహనుడుగా స్వామి అవుతాడు. ఇచట ఇంకొకవిశేషం కూడా ఉన్నది. వేదం సద్ధర్మ ప్రతిపాదకం. గరుడుడు వేదాత్మకుడు. గరుడుణ్ణి భగవానుడు అధిరోహించడం అంటే తాను వేదప్రతిపాద్యుడననే సద్ధర్మాన్ని స్థిరీకరించడమే. అందువల్లే దేవాలయాల్లో జరిగే గరుడోత్సవంలో గరుడుడు తన రెండు చేతులలో భగవానుని పాదద్వయాన్ని వహిస్తూ, భక్తులు అందఱికి చూపుతూ, భగవత్పాదద్వంద్వమే సర్వశరణమనే వేదపరమార్థాన్ని బోధిస్తున్నాడు. దీన్నిబట్టి గరుడవాహనత్వం సద్ధర్మసంస్థాపకమని ఏర్పడుతున్నది. ఈ విధంగా గరుడుణ్ణిస్వామి అధిరోహించడం 1. సాధుపరిత్రాణార్థం, 2. దుష్టనిరసనార్థం, 3. ధర్మసంస్థాపనార్థమని తేలింది. వీటిలో మొదటిరెండు పర-వ్యూహ-విభవ- అంతర్యామి రూపాలకు చెందినవికాగా, మూడవది అర్చారూపానికి సంబంధించినది కావడం విశేషం.

**గరుడునిపై భగవానుడు - మేరువుపై కాలమేఘం :**

గరుడుని అధిరోహించిన భగవానుని శఠకోపసూరి -**"కాయ్‌శినైప్పుఱవై యూర్‌న్దు పొన్‌మలైయిన్ మీమిశై కార్‌ముకిల్ పోల"** (తి.వా. 9-2-6) అంటూ మేరుపర్వతంపై ఉన్న నల్లని మేఘంగా ఉత్ప్రేక్షించారు. ఈభావాన్ని పురస్కరించుకొని వ్యాఖ్యాతలు పలుసందర్భాల్లో ఇట్టి వివరణను చేశారు. **"పూవైవణ్ణనార్ పుళ్లిన్ మేల్‌వర"** (పెరియతిరు -11-1-7) అనే పరకాలసూరిసూక్తిని శ్రీకృష్ణసూరి **"ఒరుమేరువై క్కినియమేఘమ్ పడిన్దాప్పోలే పెరియతిరువడి తోళిలేవర"** అని, **"పుళ్లూర్ కొడియానే కొణ్డల్ వణ్ణా"** (తి.వా. 3-8-1) అనే శఠకోపసూరి సూక్తిని నమ్పిళ్లై- **"తిరువడి ముదుకిలే తోన్ఱపోదు ఒరు మేరువై క్కినియకాలమేఘమ్ పడిన్దాప్పోలేయాయ్‌గ్రిరుప్పదు. నీలం మేరా వివాంబుదమ్"** అని వ్యాఖ్యానించడం గమనార్హం. **"పుళ్లూరుమ్ పొన్మలైయై"** అనే పరకాలసూరి (11-7-1) ప్రయోగాన్ని పెరియవాచ్చాన్ పిళ్లై సరసంగా **"సర్వాభరణ భూషితనాయ్, పెరియతిరువడితోళిల్ ఇరున్ద ఇరుప్పు ఒరుపొన్ మలైమేలే ఒరుపొన్‌మలై"** అని వ్యాఖ్యానించడం కూడా స్మరింపతగినది.



**గరుడవాహనత్వం-మోక్షప్రదాయకత్వ- పరత్వాలసూచకం :-**

భట్టనాథుల**"పఱవైయేఱు పరమ్‌పురుడా"** (5-4-2) అనే సూక్తిని, దీన్ని వివరిస్తూ పెరియవాచ్చాన్‌పిళ్లై - **"పెరియతిరువడియై వాహనమాకవుడైయ పురుషోత్తమనే ! తిరువేఙ్గడముడైయాన్ పెరియతిరువడిమేలే ఎళ్ళున్దరుళివన్దు ఇవరైపరమపదత్తుక్కుక్కొడుపోకైయిలే త్వరిత్తపడి. విరోధినివృత్తి పిఱప్పిత్తతుమ్ తిరువేఙ్గడముడైయాన్ పెరియతిరువడిమేలే వన్దితే "** అని అనుగ్రహించడం వల్ల గరుడ వాహనత్వం స్వామి మోక్షప్రదత్వానికి, పురుషోత్తమత్వానికి సూచకమని తెలుస్తున్నది. ఇట్టి వివరణమే తిరువాయ్‌మొళ్ళి వ్యాఖ్యలో (4-10-17) కూడ చూడవచ్చును.

**గరుడవాహనత్వం - దుష్టశిక్షణ :** భగవానుడు దుష్టులను గరుడవాహనుడై శిక్షిస్తాడు. దివ్యసూరుల పలుసూక్తుల్లో పలువురు దుష్టులను సంహరించేటప్పుడు స్వామి గరుడవాహనుడనేవిషయం బోధపడుతుంది. మచ్చునకు కొన్ని సూక్తులు.

**నరకాసుర వధ :-**

**"వెమ్‌శినత్త కొడుమ్‌తొళ్ళిలోన్ విశైయురువై యశైవిత్త అఞ్జిఱైపుట్పాకన్"** (పెరియ తిరు -5-6-6) ఈ సూక్తిలోని **"కొడుమ్ తొళ్ళిలోన్"** అనే ప్రయోగం నరకాసురుణ్ణి సూచిస్తున్నదని అరుంబదవివరణము.

**మాలివధ :-**

**"తాఙ్గరుమ్‌పోల్ మాలిపఱప్పదివైయూర్‌న్దు"** అనే పరకాలసూరిసూక్తి (2-10-4) భగవానుడు గరుడారూఢుడై మాలిని నిరసించినట్లు తెలుపుతున్నది.

**బాణాసురకథ :**

తిరువాయ్‌మొళ్ళిలోని - **"వాణనై ఉళ్‌వన్మైతీర తోళ్‌తుణిత్త పుళ్‌వల్లాయ్"** (3-8-9), అనే సూక్తివల్ల బాణాసుర పథసందర్భంలో స్వామి గరుడుని అధిరోహించి యున్నాడని ఏర్పడుతున్నది. ఇట్టి సూక్తులు, సందర్భాలు ఇంకాచాలా ఉన్నాయి.

**గరుడధ్వజత్వము :**

గరుడధ్వజత్వవిషయంలోకూడా దివ్యసూరుల సూక్తులు, ఆచార్యుల వ్యాఖ్యాన స్వారస్యాలు అనేకం ఉన్నాయి. వానిలో కొన్ని మాత్రమే స్థాలీపులాకంగా ప్రస్తుతింపబడుతున్నాయి.

**రక్షణధర్మానికి సంకేతు :**

ధ్వజంలో గరుడుని చిహ్నంగా ధ్వజంలోభగవానుడు కల్గి ఉండడం ఆస్వామి రక్షణధర్మానికి చిహ్నం. **"పుట్కొడి పిడిత్తు"** (తిరుచ్చంద -19) అనే భక్తిసారసూక్తిని పెరియవాచ్చాన్ పిళ్లై - **"తన్ పక్కలిలే ఆర్తర్ అడఙ్గవన్దు కారియమ్ కొళ్లుమ్పడి పెరియతిరువడియై రక్షణధర్మత్తుక్కు ధ్వజమాక**

**పిడిత్తు"** అని వ్యాఖ్యానించడం ఇందులకు ఒక ఉదాహరణ. దీనివల్ల గరుడుణ్ణి ధ్వజంలో చిహ్నంగా స్వామి కల్గి ఉండడం ఆర్తుల రక్షణకు సంకేతమని ఏర్పడుతున్నది.

**పరత్వానికి చిహ్నం :**

శ్రీవిష్ణుసహస్ర నామస్తోత్రంలోని **"గరుడధ్వజః"** అనే నామాన్ని భట్టరు వివరిస్తూ- **"తద్ది సర్వేశ్వరస్య అసాధారణం చిహ్నమ్"** అని అనుగ్రహించారు. ఇట్టి వివరణలే దివ్య ప్రబంధవ్యాఖ్యలలో పలుచోట్ల ఉన్నాయి. **"పుళ్లూర్ కొడియానే అణ్డత్తుమ్బరిల్"** (తి.వా-3-8-1) అనే శఠకోపసూరి సూక్తిని నమ్పిళ్లైవ్యాఖ్యానిస్తూ - **"అవన్‌తొழிల్ ఇరుక్కుమ్ ఇరుప్పైక్కణ్డాల్ ఇవనే సర్వాధికన్ ఎన్ఱు తోన్ఱుమ్పడియాయ్‌గ్గిరుప్పదు"** అని అనుగ్రహించడం, **"పుళ్లుడైయణ్ణల్"** (తి.వా.4-1-9) అనే తిరువాయ్‌మొழிసూక్తిని ఆ ఆచార్యులే -**"శ్రియఃపతి ఎన్నుమాప్పోలే-ఈశ్వరనుక్కు-నిరూపకమిఱే అవన్"** అని వివరించడం ఇందులకు కొన్ని ఉదాహరణాలు. **"కొడిమన్నుపుళ్"** అనే తిరువాయ్‌మొழிసూక్తి వివరణలో ఈ విధంగా తనకు దాసుడైన గరుడుణ్ణి నిరూపకంగా భగవానుడు ఏల కల్గిఉన్నాడు? అని ప్రశ్నను లేవనెత్తిన నమ్పిళ్లై చమత్కారంగా ఈ విధంగా సమాధానించారు. **"తన్నై ఆశ్రయిత్తారైయుమ్ తనకు వ్యావర్తక విశేషణమాన కొళ్లుమవన్నై. అవన్ తన్నై వ్యావర్తక విశేషణమాక కొణ్డువానెన్ అల్లాదారిల్‌కాట్టిల్ ఎన్నిల్, అవనుడైయ ముక్కు-వలియుమ్, పక్షపాతముమ్ అతుక్కడి"** ఈ విధంగా ఆశ్రితులను నిరూపకంగా పల్కడం కూడా సత్సంప్రదాయ సిద్ధమే. శ్రీరామాయణంలో లక్ష్మణుని నిర్దేశించేటప్పుడు **"రామానుజమ్"** అంటూ రాముణ్ణి నిరూపకంగా పల్కి, వెంటనే రాముణ్ణిగూర్చి తెలిపేటప్పుడు **"లక్ష్మణపూర్వజం చ"** అంటూ లక్ష్మణుణ్ణి వ్యావర్తకవిశేషణంగా వాల్మీకి పేర్కొన్నాడుకదా ! గరుడుణ్ణి వాహనంగా, ధ్వజంగా స్వామికల్గి ఉండడంలోని ప్రయోజనాన్ని **"పుళ్లూర్‌కొడియానే"** (తి.వా.3-8-1) అనే శఠకోపసూరిసూక్తిని నమ్పిళ్లై- **"ఆశ్రితరే ఇరున్దవిడత్తు శెల్లుకైక్కు వాహనమ్, దూరత్తిలే కణ్డు వారానిన్దాన్ ఎన్ఱుధరిక్కైక్కు ధ్వజమాకై"** అని పల్కడంద్వారా తెలిపారు.

**లక్ష్మీపతిత్వం - గరుడ వాహనత్వం :-**

శ్రియఃపతిత్వంవలె గరుడవాహనత్వం భగవానుని పరత్వాసాధారణలక్షణమని పూర్వోక్తమే.-ఈరెండు వెంటవెంటనే పల్కిన సందర్భాలకూడా దివ్యప్రబంధసూక్తుల్లో కన్పిస్తాయి. ఉదాహరణకు - **"అశురరైచ్చెఱ మావియమ్‌పుళ్‌వల్ల మాతవన్"** (తివిరుత్తం 61) అనే సూక్తి **"పొఱుశిఱైప్పుళ్లు వన్దేఱుమ్ పూమకళార్ త్తనిక్కేళ్వన్"** అనే (తి.వా.1-9-3) సూక్తిని తలపిస్తుంది.

**సుదర్శనధారిత్వం -గరుడవాహనత్వం :-**

భగవానుని సన్నాహానికి గరుడుడు, సంకల్పానికి సుదర్శనుడు సంకేతాలు. శ్రీదేశికులు సంకల్పసూర్యోదయంలో **"సన్నాహసంకల్పౌ"** అని అంటారు. స్వామియొక్క సుదర్శనధారిత్వాన్ని, గరుడవాహనత్వాన్ని వెనువెంటనే అనుసంధించిన దివ్యసూరిసూక్తులు చాలా ఉన్నాయి. మచ్చునకు



కొన్ని - 1. ఆழி ఏన్ది అక్షైరెప్పుళ్లూర్‌ది (తిరుచ్చన్ద -46), 2. కరుళప్పుట్కొడి శక్కరప్పడై (తి.వా.5-7-3) 3. తూవియమ్ పుళ్లుడైయాన్ అడలాழியమ్మాన్ (తి.వా4-5-4)

**పలువురితో గరుడునకు సామ్యాలు :** దివ్యసూరుల సూక్తుల్లోని రస్యరహస్యార్థాలనువెలికి తీసే పూర్వాచార్యులు తమదివ్యవ్యాఖ్యలలో పలు సందర్భాల్లో గరుడునకు పలువురితోకల సామ్యాలను రమణీయంగా వివరించారు. వానిలో కొన్ని ఇచట ప్రస్తుతింపబడుతున్నాయి.

**1. మహిషీ సామ్యం :**

తిరువాయ్‌మొழி ప్రబంధంలోని **"ఒడుమ్‌పుళ్లేఱి"** (1-8-1) అనే సూక్తిని నమ్పిళ్లై **"మహిషి కుచస్తనపరిరంభణమ్‌పోలే తన్నైమేత్కొణ్డు నడత్తుమాఱు అపేక్షిత మాయిరుక్కుమిఱే వాహనత్తుక్కు"** అని వివరించడం వల్ల ఈ సామ్యం స్ఫురిస్తున్నది. దివ్యమహిషి పరిరంభణం ఏవిధంగా స్వామికి ఆనందదాయకమో, ఆవిధంగానే గరుడుణ్ణి అధిరోహించడంకూడా ఆనందప్రదం అని ఈ వ్యాఖ్యవల్ల ఏర్పడుతున్నది కదా !

**2. వృద్ధమంత్రిసామ్యం :**

తిరువిరుత్త ప్రబంధంలోని **"తழల్‌పోల్‌శినత్త అప్పుళ్లిన్"** (3) అనే ప్రయోగాన్ని వివరిస్తూ నమ్పిళ్లై **"రాజపుత్రర్‌కళ్ ఒరువిషయత్తిలే కాల్‌తాழ்న్దాల్ వృద్ధమంత్రికళానవర్‌కళ్ వన్దు- నాడు పట్టదుపడ ఇఙ్గనే ఇరుక్క అమైయుమో? ఎన్ఱు నియమిత్తుక్కొడుమాపోలే తానుమవనుమా యిరుక్కైఆ సమయత్తిలే పెరియతిరువడివన్దు కడుత్తు ఇఱాఙ్గిక్కొడుపోక"** అని అనుగ్రహించడం వల్ల ఇట్టి సామ్యం ప్రతీతమవుతున్నది.

**3. చక్రసామ్యం :** తిరువాయ్‌మొழி ప్రబంధంలోని **"కఱైయణిమూక్కుడైప్పుళ్లై"** (3-10-2) అనే సూక్తిని నమ్పిళ్లై **"ప్రతిపక్షత్తైక్కొన్ఱు కఱైకழువ అవసరమిన్ఱిక్కే యిరుక్కైయాలే క్కఱైయేఱే అతువే ఆభరణమాయిరుక్కుమ్ మూక్కు"** అని వ్యాఖ్యానించారు. అందువల్ల గరుడుడు నిరంతరం శత్రు నిరసనం చేయడంవల్ల తన ముక్కుకు అంటుకొని శత్రువుల రక్తం వల్ల ఏర్పడిన మచ్చను తుడుచుకోకపోవడం చేత ఆగుర్తు ఆవిధంగానే నిలచి ఉందని గరుడుని పరాక్రమానికి అది గుర్తుగా భాసిస్తున్నదని తెలుస్తున్నది. సుదర్శనం విషయంలో కూడా భట్టరు **"దైత్యచ్ఛేదకల్మాషితాంగమ్"** అని అంటూ దైత్యులను ఛేదించడం వల్ల సుదర్శనుని దేహమంతా కలుషితమైనదని పల్కడం ఇట్టిదేకదా ! అంతేకాక భట్టరు **"నాథవీక్షాశీధుక్షీబోద్వేలనృత్తాభిరామమ్"** అని అంటూ భగవానుని వీక్షణాలనే మద్యంవల్ల మత్తెక్కి కృత్యంచేస్తున్నట్లు సుదర్శనం పరిభ్రమిస్తుందన్నారు. గరుడునికూడా **"ఆడుమ్‌పఱవై"** అంటూ దివ్యసూరులు కీర్తించారు. ఈ విధంగా గరుడుడు ఆడడానికి భగవత్సంబంధమే కారణమని ఆచార్యులు సరసంగా వివరించారు కూడా ! ఈ విధంగా దివ్యసూరి పూర్వాచార్యుల సూక్తుల సమన్వయంవల్ల సుదర్శన - గరుడుల మధ్య పోలిక స్ఫురిస్తున్నదనడంలో తప్పులేదుకదా !

**4. విశ్వామిత్రసామ్యం :** తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని **"అఙ్జిరైయ పుట్కొడియే ఆడుమ్పాడుమ్"** (12) అనే సూక్తిని వ్యాఖ్యాత **"పాణిగ్రహణమ్ పణ్ణివైక్క కొణ్డువన్ద విశ్వామిత్రనైచ్చొల్లుకిఱదు"** అని వ్యాఖ్యానించగా, దీన్ని అరుంబదకారులు **"విశ్వామిత్రనైప్పోలే తిరువడియుమ్"** అని వివరించారు. దీని వల్ల శ్రీరామచంద్రుని మిథిలకు విశ్వామిత్రుడు తీసికొనివచ్చి సీతతో పాణిగ్రహణం జరిపించినట్లే, పరకాలనాయకి వద్దకు గరుడుడు స్వామిని తీసికొనివచ్చాడని, అందువల్ల గరుడ-విశ్వామిత్రుల సామ్యం ధ్వనిస్తున్నదని పూర్వాచార్యుల అభిప్రాయం కదా !

**5. చోళేంద్రసింహ - శత్రుంజయసామ్యాలు :** పెరియతిరుమొழி ప్రబంధంలోని **"పోరానై క్కొమ్బుశిత్త పుట్పాకన్ ఎన్నమ్మాన్"** (3-3-6) అనే పరకాలసూరిసూక్తిని పెరియవాచ్చాన్ పిళ్లై - **"చోళేంద్రసింహనిల్ ఇరుప్పై క్కాట్టియాయ్ ఱు ఇవళై అనన్యార్హైయాక్కి ఱు"** అని వ్యాఖ్యానించారు. ఇక్కడ అరుంబదకారులు -**"గజేన మహతా యాంతమ్ - ఎన్దుఅయోధ్యాజనఙ్గళై ఈడుపడుత్తినాప్పోలే కోయిల్పెరుమాళుమ్ అరఙ్గన్‌తిరుముఱ్ఱడియార్రై ఈడుపడుత్తువర్. అప్పడియే ఇవరుమ్ పెరియతిరువడిమేల్ ఇరుప్పిల్ ఈడుపట్టాళ్ ఎన్దుకరుత్తు"** అని వివరించారు. ఇందువల్ల శ్రీరామచంద్రుడు యౌవరాజ్యపట్టాభిషేక సందర్భంలో శత్రుంజయమనే పట్టపుటేనుగుపై ఊరేగినపడు అయోధ్యాప్రజలు దర్శించి పరవశించినట్లు, శ్రీరంగంలోని రంగనాథస్వామి చోళేంద్రిసింహమనే గజంపై ఊరేగునపుడు అచటి భక్తులు ఆనందించినట్లు, స్వామి గరుడునిపై వేంచేసినపుడుపరకాలనాయకి దర్శించి, పరవశించిందని ఏర్పడడంవల్ల పై సామ్యం స్ఫుటమవుతున్నది.చోళేంద్రసింహమని శ్రీరంగనాథుని ఏనుగుకు పేరు. **"చోళేంద్ర సింహం - నమ్బెరుమాళ్‌యానై"** అని వ్యాఖ్యానం పుటోనోట్‌లో చూపబడింది. ఇట్లే **"వెఙ్గణ్‌పూళ్లూర్న్దు వన్దు"** (తి.వా.6-8-5) అనే నమ్మాళ్వార్ల సూక్తిని నమ్పిళ్లై - **"పట్టమ్‌కట్టిన యానైయిలే యేఱి అభిమత విషయత్తైక్కిట్టుమ్ రాజపుత్రనైప్పోలే"** అని వివరించడం వల్ల గరుడునకు భద్రగజసామ్యం కూడా తోస్తున్నది.

**6. విశల్య, సంధానకరణిసామ్యం :** తిరువిరుత్త ప్రబంధంలోని **"శారికైప్పుళ్ అన్దణ్ణత్తుழாయ్"** (19) అనేప్రయోగాన్ని పెరియవాచ్చాన్ పిళ్లై **"పోన ఉయిరై మీట్టవఱ్ఱాయిరుక్కై, సంధానకరణి, విశల్య కరణి ఎన్నుమాప్పోలే"** అని వ్యాఖ్యానించారు. దీన్ని అరుంబదకారులు. **"పుళ్లర్ ఎన్ద విశేషణత్తినాలే విశల్యకరణియుమ్, తుழாయ్ ఎన్దైయాలే సంధానకరణియుమ్"** అని వివరించగా, వేరొక అరుంబదకారులు -**"సంధానకరణి తిరువడి, విశల్యకరణి తిరుత్తుழாయ్"** అని వివరించారు. అంతేకాక ఈ రెండింటిని సమన్వయించే వేరొక అరుంబదంలో - **"పుళ్ ఎన్దత్తైప్పఱ సంధానకరణి ఎన్దదు. తుழாయ్ ఎన్దత్తైప్పఱ విశల్యకరణి ఎన్దదు. కొడువన్దు శేర్‌క్కుమవరాకైయాలుమ్, హృదయత్తిల్ వ్యథైయై పోక్కుమవరాకైయాలుమ్ ఇప్పడి అరుళిచ్చెయ్‌దారెన్దు కణ్డుకొళ్వదు"** అని వివరింపబడింది. దీనివల్ల గరుడుడు స్వామిని భక్తులదగ్గఱకు తీసికొనివచ్చి వారితో చేరుస్తాడు కావున సంధానకరణిగా, హృదయంలోని బాధను తీరుస్తాడు కావున విశల్యకరణిగా రూపింపబడ్డాడని తాత్పర్యం.



**7. మేరుపర్వత సామ్యం : "కాయ్‌శినైప్పుఱవై యూర్న్దు పొన్‌మలైయిన్‌మీమిశైక్కార్ ముకిల్‌పోల"** అనే తిరువాయ్‌మొழி (9-2-6) సూక్తిలో నమ్మాళ్వార్లు గరుడుని మేరుపర్వతంగా, అతనిని అధిరోహించిన స్వామిని నీలమేఘంగా సంభావించారు. దీనివల్ల గరుడుని మేరుపర్వత సామ్యం స్ఫుటమౌతున్నది. సుపర్ణుడని పేరుగల గరుడుణ్ణి మేరువుగా భావించడం ఉచితమే కదా! అమరసుధా వ్యాఖ్యలో -**"కనకమయత్వాత్ కనకవర్ణత్వాద్వా శోభనే పర్ణే పక్షౌ అస్య"** అని సుపర్ణనామం వివరింపబడడంకూడా స్మరించదగినది. ఈవిధమైన సామ్యాలను పూర్వాచార్యవ్యాఖ్యలలో ఇంకా చాలా గమనించవచ్చును.

**విష్ణ్వాలయాలు -గరుడుడు :** భగవదాలయాలలో గరుడుని ప్రాముఖ్యం స్పష్టంగా గోచరించే విషయం. భగవానుని అర్చామూర్తికి ఎదురుగా అంజలిబంధంతో గరుడుడు నిలచి ఉంటాడు. బ్రహ్మోత్సవాలలో సర్వత్ర గరుడోత్సవానికి చాలా విశిష్టత ఉన్నది. ఈ ఉత్సవం 3వ నాడుగాని, 5వ నాడుగాని జరుగుతుంది. త్రయీమయుడు కనుక, పంచవర్ణీరహస్య రూపుడు కనుక ఈ క్రమం అన్వర్థం బ్రహ్మోత్సవాలు ధ్వజరూపుడైన గరుడుని ఆరోహణంతో ప్రారంభమై అవరోహణంతో ముగుస్తాయి. దేవాలయాలలోని ధ్వజస్తంభం గరుడునకు ప్రతిరూపమని ఆగమ శాస్త్రం చెబుతున్నది. ఆగమ శాస్త్రాలలో తెలుపబడిన ఆలయాల్లో ప్రతిష్ఠింపబడే గరుడుని రూపంగూర్చిన, ధ్వజపటంపై లిఖించే గరుడుని రూపం గూర్చిన వివరాలను ఇచట ప్రస్తుతించడంలేదు. (అని ఉపదేశగమ్యాలు, క్లిష్టమైనవి, బహువిధాలైనవి అవడంవల్ల) ప్రసిద్ధ విష్ణుక్షేత్రాలన్నిటితో గరుడునకు అవినాభావసంబంధం ఉన్నది. తిరుమలకు గరుడాద్రి అని పేరు. ఆ కొండ పరమపదంలోని భగవానుని క్రీడాద్రి అని, గరుత్మంతునిచే భగవదాజ్ఞానుసారం భూలోకానికి తీసికొనిరాబడినదని పురాణకధనం. మేల్‌కోటైగా ప్రసిద్ధిచెందిన తిరునారాయణపురంలోని వైరముడి అనే కిరీటం గరుడునివల్ల అచటికి చేరినదే. అహోబలంలోని పర్వతం "అహోబలే గారుడశైలమధ్యే" అని గారుడశైలంగా ప్రసిద్ధి. ఇంకా 108 విష్ణుక్షేత్రాలలో గరుడమూర్తికి వైశిష్ట్యాలు చాలా ఉన్నాయి. చాలా క్షేత్రాల్లోని అర్చామూర్తులు గరుడునకు ప్రత్యక్షమైనట్లు ఆయా స్థలపురాణాలవల్ల తెలుస్తున్నది. అట్టిక్షేత్రాలలో కొన్ని - తిరువెళ్లఱై (వేదగిరిక్షేత్రం), తిరువిణ్ణగర్, తిరుక్కణ్ణపురమ్, (కృష్ణారణ్యక్షేత్రం), తేరழுన్దూర్, తిరుమణిక్కూడమ్, తిరుమహేంద్రపురం, తిరువణ్‌పరిశారమ్, తిరునారాయణపురమ్, కపిస్థలము. ఆంధ్రప్రదేశ్‌లోని సింహాచలక్షేత్రములోని స్వామి విమానమునకు తార్క్ష్యాద్రి విమానమని పేరు. అట్లే తిరువழுన్దూర్‌లోని విమానమునకు గరుడ విమానముగా ప్రసిద్ధికలదు. శ్రీవిల్లి పుత్తూరులో స్వామితో సమానాసనంలో గరుడుడు వేంచేసిఉండటం విశేషం. నాచ్చియార్ కోయిల్ అనే క్షేత్రంలో జరిగే కల్ గరుడసేవ, కంచిలో జరిగే వరదరాజస్వామి గరుడసేవ, నవతిరుపతులలో జరిగే గరుడసేవ ముఖ్యంగా పేర్కొనదగినది. తిరుమలలో జరిగే గరుడసేవ జగత్ప్రసిద్ధం కదా ! మన్నార్ గుడి క్షేత్రంలో నాయిచ్చియార్ సన్నిధికి ఎదురుగా గరుడుని తల్లి అయిన వినతకు ఆలయం ఉండటం పేర్కొనదగినది. ఇట్టి విశేషములు అనేకములు.

తిర్యగ్రూపమును దాల్చుట నిత్యసూరులకు తగునా ? గరుడుడు **"దాసస్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనమ్"** అను రీతిలో పలురూపాలను పొంది భగవత్కైంకర్యం చేస్తాడని కొనియాడబడుతున్నాడు. కాని,నిత్యసూరులలో ప్రథమగణ్యుడైన ఇతడు ఈ విధంగా తిర్యగ్రూపాల్ని, వితానవ్యజనాది అచేతనరూపాలను దాల్చడం తగునా? **"శరీరజైః కర్మదోషైః యాతి స్థావరతామ్"** అని కదా సూక్తి, అంటే, దానికి పెరియవాచ్చాన్ పిళ్లై తిరునెడున్దాణ్డక వ్యాఖ్యలో ఒక చక్కని సమాధానాన్ని ఇలా ఇచ్చారు. **"పాపయోనియాన జన్మమ్ అవర్కళుక్కుణ్డో ? ఎన్నిల్, పిరాట్టియుమ్ సర్వేశ్వరనుమ్ తిరుత్తిరైక్కుళ్లే యిరున్దాల్, నిలా,తెన్డల్ సంచరిక్కుమ్బోదు పిళ్కాలిక్క వేణ్డుమ్బడియితే అప్పోతై ఐకాంత్య మిరుప్పదు. అవ్వవస్థానుగుణమాక మానర్, కుఱళర్ సంచరిక్కుమాప్పోలే, అంతరంగ సేవైక్కు అనుకూలమానవడివై పరిగ్రహిప్పార్కళ్ ఎన్నై. సరీసృపజాతియోడు, పక్షిజాతియోడు వాశియఱ పరిగ్రహిప్పర్కళ్. సంసారికర్మఫలానుగుణమాక శరీర పరిగ్రహమ్ కణ్ణక్కడవన్, అవన్ అవస్థానుగుణమాక ప్పణ్ణక్కడవన్"** ఈ వ్యాఖ్యాన సూక్తినిబట్టి తిర్యగాదిరూపపరిగ్రహణం నిత్యసూరులకు ఆయా కైంకర్యావస్థానుగుణంగా ఉంటుందని, కాని అది కర్మఫలంవల్ల కాక, వారి ఇచ్ఛానుగుణంగా ఉంటుందని, ఈవిధంగా ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కరూపంగాకాక, **"ఏకథా భవతి ద్విధా భవతి త్రిధా భవతి"** ఇత్యాదిగా ఒకేసమయంలో పలురూపాలను సౌభరి వలె పరిగ్రహించే శక్తి వారికి ఉన్నదని తెలుస్తున్నది. ఈభావాన్ని పరాశరభట్టరు శ్రీరంగరాజస్తవంలో **"అహ్రుతసహజదాస్యాః సూరయః"** అనడమేకాక, **"శ్రీరంగదివ్యభవనం భువి గోపురాణాం ప్రాకారితేన నికరేణ గరుత్మతేవ"** ఇత్యాది వేరొక శ్లోకంలో శ్రీరంగంలోని ప్రాకారవిమానాదులన్నీ గరుడుని రూపాలే అని పల్కడం స్మరించతగ్గది. అందువల్ల ఈవిధంగా అచేతనరూపం సైతం భగవత్కైంకర్య దృష్టిలో అభిలషణీయమే.

**గరుత్మంతుని ఱెక్కలు :** గరుడుని రూపములోని ఆయా భాగము లన్నియు వేదాత్మకములే. **"తస్య గాయత్రీ జగతీ పక్షా వభవతామ్"** అను యజుర్వేదీయసూక్తి గరుడుని ఱెక్కలు రెండును గాయత్రి, జగతి అను వైదికఛందోరూపములని తెల్పుచున్నది. తిరువిరుత్త ప్రబంధములోని **"వేకప్పుఱవై"** అను సూక్తిని వ్యాఖ్యానించునపుడు నమ్బిళ్లై - **"ఆసురప్రకృతికళాన బాహ్యకుదృష్టికళ్ మఙ్గుమ్బడి ప్రవర్తిక్కప్పట్ట నిత్యాపౌరుషేయత్వ రూపమాన పక్షద్వయావలంబత్తాలే"** ఇత్యాదిగా పల్కడం వల్ల గరుడుని రెండు ఱెక్కలు వేదంయొక్క నిత్యత్వ - అపౌరుషేయత్వాలకు ప్రతీకలని ఆచార్యుల భావనగా తోస్తున్నది. **"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః, తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః"** అను సూక్తి వలన పక్షులకు గమనసామర్థ్యము ఱెక్కల వలన సిద్ధించునట్లే జ్ఞానులకు జ్ఞానానుష్ఠానముల ద్వారా మోక్షం సిద్ధించునని ఏర్పడుచున్నది. కావున, జ్ఞానులలో గొప్పవాడైన గరుత్మంతుని ఱెక్కలు జ్ఞానానుష్ఠానములకు ప్రతీకలుగా చెప్పవచ్చును.

**గరుడాకృతిలో హోమగుండం :** వైదిక కార్యకలాపాల్లో కూడా గరుడుని స్థానం విశిష్టమైనది. అశ్వమేధయాగాన్ని నిర్వహించే హోమగుండం గరుడాకృతిలో నిర్మింపబడేదని బ్రహ్మవైవర్త



పురాణంలోని దక్షిణమధురామహాత్మ్యంలో **"ఇష్టకాభిశ్చితో వేది స్తత స్తు కుశలై ద్విజైః, అథస్తాత్ప్రాఙ్ముఖాస్తీర్ణపక్షస్య గరుడాకృతేః"** అను శ్లోకమువలన స్పష్ట మౌతున్నది. తూర్పుముఖముగా రెండు విస్తరించిన ఱెక్కలతో కూడిన గరుడాకృతిలో ఈ వేదిక నిర్మింపబడేదని పై శ్లోకాల వల్ల ఏర్పడుతున్నది.

**వైనతేయేష్టి :** కామ్యకర్మలుగా ప్రసిద్ధాలైన పలు యష్టులలో వైనతేయేష్టి ఒకటి. ఈ ప్రక్రియలో గరుడుని అంతర్యామియైన భగవానుడు ఆరాధింపబడతాడు. ఈ యష్టి వలన సంతానం లేనివారు సంతానవంతులవుతారని ఆగమాలు తెలుపుతున్నవి. శ్రీమన్నారాయణసంహితలో "వైనతేయాభిధం త్విష్టిమేకం సాంప్రతమ్, యత్కృత్వా యజ్ఞకర్తా చ తత్సహాయక సంజ్ఞకాః, శీఘ్రం విందత్యభీష్టార్థాన్ ప్రాప్నువన్తి సుతాన్ ధ్రువమ్'' అనే సూక్తులు ఇందులకు ఒక ప్రమాణము. దశరథుడును ఈ వైనతేయేష్టిని నిర్వహించి ఆ పిమ్మట పుత్రకామేష్టిని చేయటం ద్వారా నల్గురు పుత్రులను పొందెనని ప్రసిద్ధి.

**శకునశాస్త్రంలో గరుడుడు :** ఆకాశములో గరుడుని చూచుట, దాని ధ్వనిని వినుటయు శుభశకునము. **"గారుడం దర్శనం పుణ్యం తతోఽపి ధ్వనిరుచ్యతే"** ఇత్యాదులు ఇందులకు ప్రమాణములు. ఇట్టి అంశములు ఇంకనూ పలు కలవు.

**సంగీతశాస్త్రంలో గరుడుడు :** మంగళవాద్యములు 16 విధములుగా నున్నవి. ఆతోద్యము అను పేరుతో వ్యవహరింపబడు వాద్యముల నాదము గరుడుని ధ్వనియేనని ప్రసిద్ధి కలదు.

**రత్నశాస్త్రంలో గరుడుడు :** గరుడుడు స్వర్గం నుండి తెచ్చిన అమృతం దర్భలపై చిందినది. అందుచే అవి పవిత్రములైనవి. అమృతవీర్యం అను పేరుతో ప్రశంసించబడుచున్నవి. తమిళభాషలో దర్భలకు తూప్పుల్ అని పేరు వచ్చుటకు ఇదియే కారణము. గరుడుడు తన నోటినుండి ఉమిసిన బలాసురుని అస్థికల ఖండములే మరతకమణులైనవని, కావుననే వానికి గారుడమణి అని పేరు వచ్చినదని రత్నపరీక్ష అను గ్రంథములో తెలుపబడినది. మరతక శబ్దానికి విషాన్ని హరించేది అనే వ్యుత్పత్తి అమర సుధాదులలో తెలుపబడడం కూడా స్మరింపబడినది.

**నగరనిర్మాణంలో గరుడుడు :** శ్రీరంగరాజస్తవములో శ్రీరంగ నగరమును వర్ణించుచూ పరాశర భట్టరు రెక్కలు విచ్చుకొనిన గరుడుని ఆకారములో నగరమున్నదని పల్కిరి. భగవద్రామానుజులు పూర్వము తిరుపతి నగరమును గరుడాకృతిలో నిర్మించిరను జనశ్రుతియు కలదు. తంజావూరు నగరము గరుడాకారములో నిర్మింపబడుటచే దానికి గరుడపురి అని పేరు కల్గినదని చెప్పబడుచున్నది.

**బౌద్ధ, జైన సాహిత్యాలలో గరుడుడు :**

బౌద్ధమతసాహిత్యానికి చెందిన జాతకకథల్లో గరుడుని ప్రస్తావన ఉన్నది. గరుడ-నాగజాతుల మధ్య గల సహజవైరాన్ని బుద్ధుడు పోగొట్టిన ఉదంతాలు ఇందు ప్రస్తావింపబడ్డాయి. ఉదాహరణకు ఉరగజాతక మనే కథ సంగ్రహంగా ఇట్లున్నది. బ్రహ్మదత్తుడు వారణాసిని పాలించే కాలంలో ఒకానొక సమయంలో జరిగిన ఉత్సవంలో పలువురు అచట చేరారు. వారిలో పలువురు

సర్పాలు, గరుడుడు కూడా ఉన్నారు. అపుడు ఒక నాగం తనకు తెలియక తన ప్రక్కన ఉన్న గరుడుని భుజంపై తనచేతిని వేసినదట. గరుడుడు, ఆనాగుడు అప్రయత్నంగా ఒకరినొకరు చూచుకొన్నారు. నాగుడు మిక్కిలి భీతితో అచటినుండి పారిపోయాడు. గరుడుడు అతణ్ణి తరిమాడు. అపుడు బోధిసత్త్వుడు (బుద్ధుడు) స్నానం చేయడానికిగా తన వస్త్రాన్ని గట్టుపైపెట్టి ఒక నదిలో దిగాడు. నాగుడు బోధిసత్త్వుని ఆశ్రమంలోచేరి, గట్టుపై ఉన్న బోధిసత్తుని వస్త్రంలో మణిగా మారి దాగాడు. గరుడుడు ఈ సంగతిని గుర్తించినా, బోధిసత్త్వుని వస్త్రాన్ని తాకే ధైర్యంలేక, తనకు ఆకలిగాఉన్నదని, అతని వస్త్రంలో మణిరూపంలో ఉన్న నాగుణ్ణి తనకు అధీనం చేయవలసినదని అడిగాడు. అహింసయే పరమధర్మంగా భావించే బోధిసత్త్వుడు గరుడుని పొగడి, సమాధాన పఱచి, ఆ నాగాన్ని రక్షించాడు. ఇటువంటి జాతకకథలు ఇంకాఉన్నాయి. వైదిక సంప్రదాయాన్ని విరోధించే బౌద్ధజైన సాహిత్యాల్లో చాలా వైదికదేవతల స్వరూపస్వభావాలు భిన్నంగా చిత్రీకరింపబడడం సహజము. కాని, గరుడుని విషయంలో పెద్ద మార్పు లేకపోవడం విశేషం. అయితే కొన్నిచోట్ల కొన్ని ప్రత్యేకములైన వర్ణనలు ఉన్నాయి. సుమతినాథచరిత్రమనే జైనగ్రంథంలో గరుడుడు తుంబురుయక్షుని వాహనంగా చెప్పబడ్డాడు. ప్రతిష్ఠాసారోద్ధారమనే వేరొక గ్రంథంలో కూడ **"గరుడాధిరూఢం శ్రీతుంబురం శ్యామరుచిం భజామి"** అంటూ ఆవిధంగానే చెప్పబడింది. శాంతినాథ చరిత్రలో గరుడుడు యక్షుడుగా వర్ణింపబడ్డాయి. ఇతని స్వరూపాన్నిగూర్చి శ్వేతాంబర-దిగంబర గ్రంథాలలో వేర్వేరుగా వర్ణనలు ఉన్నాయి. ఇట్టి గరుడ రూపుడైన యక్షునిరూపం Deogarh కోట దక్షిణముఖద్వారం వద్దగల స్తంభంపై కానవస్తున్నది. అట్లే, గరుడుడు చక్రేశ్వరీదేవికి వాహనమని వేరొక శ్వేతాంబరజైన గ్రంథంలో ఉన్నది. దిగంబర జైనసాహిత్యంలో ఇంకొక చోట గరుడుడు జాంబూనదాదేవీ వాహనంగా తెలుపబడ్డాడు. వాస్తుసారాది గ్రంథాలనుబట్టి ఈగరుడయక్షుడు నల్లనిరంగుకలవాడని, ఒకచోట చతుర్బాహుడని, చిలుకనుగాని, వరాహాన్నిగానివాహనంగా కల్గి ఉంటాడని తెలుస్తున్నది. బౌద్ధసాహిత్యంలో పలుచోట్ల గరుడుడు విష్ణువాహనంగా కూడా కన్పిస్తాడు. అమరావతిలో గల బౌద్ధ శిల్పాలలో కూడా గరుడుని ప్రాధాన్యం స్పష్టంగా గోచరిస్తున్నది. వానిలో పూలమొగ్గవలె కలశాన్ని చేతిలో ధరించియున్న గరుడునిరూపం ఉన్నది. ఈ కలశం అమృతకలశం అని పరిశోధకుల భావన.

**విదేశాల్లో గరుడుడు :**

Eagle రూపంలో గరుడుడు పలు దేశాల్లోని సంస్కృతుల్లో చోటుచేసికొన్నాడు. విశేషమేమనగా, మన సాహిత్యంలోని గరుడుడు ఏరూపంలో ఉన్నా (పక్షిరూపంలోకాని, సంకీర్ణరూపంలోకాని) దివ్యుడు. కాని, విదేశాల్లో ఇట్టి భావన కన్పింపదు. వివిధదేశాల్లోని గరుడప్రాధాన్యం గూర్చి క్లుప్తంగా ఈ క్రింద తెలుపబడుతున్నది.

**1. రోమ్ :** రోమ్‌లో క్రీ.శ. 5వ శతాబ్దికి చెందిన కళావిశేషాల్లో Eagle స్పష్టంగా గోచరిస్తున్నది. ఇదేకాలానికి చెందిన పారిస్‌లోని ఆభరణాల్లో గరుడుని బొమ్మఉన్నది. ఇది ఇప్పటికీ పారిస్‌లోని మ్యూజియంలో భద్రపఱుపబడినది. Althens నగరంలో దొరికిన 11వ శతాబ్దానికి సంబంధించిన



కళాఖండాల్లో గోళ్లతో పట్టి కుందేలును తీసికొనిపోయే గరుడుని బొమ్మ చిత్రీకరింపబడినది. ఈకాలానికి చెందిన రజత పాత్రలపై గరుడుని చిత్రం ఉన్నది.

**2. ఎసిరియా :** ఈ దేశానికి చెందిన క్రీ.పూ. 1000-800 సం॥లమధ్యకాలానికి చెందిన ఒకశిల్పంలో ఒకానొక మతసంబంధమైన కార్యకలాపం చెక్కబడింది. దాంట్లో ప్రభువు వెంటగానున్న ఒక అమానవరూపం గోచరిస్తున్నది. ఆరూపానికి గరుడుని ముఖం, రెండు ఱెక్కలు ఉన్నాయి.

**3. సుమేరు :** ఈ దేశానికి సంబంధించిన క్రీ.పూ. 2600-2200ల సం॥ల మధ్యకాలానికి చెందిన ఒక తామ్ర ఫలకంపై సింహముఖంతో, మిగిలిన రూపం అంతా గరుడునకు చెందిన ఆకారం కన్పడుతున్నది. ఈ పక్షిరూపానికి ఆదేశంలో Imdugud అనిపేరు. ఇది కూడ బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నది.

**4. మెసపాటోమియా :** క్రీ.పూ. 3వేల సంవత్సరాలనాటి రజత, కంచుపాత్రలపై ఱెక్కలు విచ్చుకొన్న గరుడుని బొమ్మలు ఉన్నాయి. క్రీ.పూ. 747-27 కాలంనాటి వేరొక చారిత్రకావశేషాల్లో శత్రువును వెంటాడే సైనికునిదృశ్యం చెక్కబడింది. ఈ సైనికుని వెంటె గరుడపక్షి ఆకారంలో, విచ్చుకొనిన ఱెక్కతో, గోళ్లతో సర్పాన్ని పట్టుకొని ఎగిరి వచ్చే గరుడుని రూపం ఉండడం విశేషం.

**5. జపాన్ :** జాపాన్‌దేశంలోని Tengu బౌద్ధసాహిత్యంలోని గరుడుని ఆకారంతో పోలిఉన్నది. గరుడముఖంతో కన్పించే ఈరూపం నక్కను వాహనంగాకల్గి, ఈకల విసనకఱ్ఱను గాని, ఖడ్గాన్నిగాని చేతిలో కల్గి ఉన్నది. కొన్నిచోట్ల ముఖం రాబందుముఖాన్నికూడా పోలిఉన్నది.

**6. నమీబియా :** ఈ దేశంలో క్రీ.పూ. 2వ శతాబ్దికి చెందిన చిత్తరువులోఒకరాణిరూపం చిత్రీకరింపబడింది. ఆమె ఖడ్గాన్ని ధరించిన ఎడమచేతిని పైకిఎత్తి ఉన్నది. కుడిచేతిలో ఖడ్గంతో పాటు, పలు తలలనుకల రాక్షసరూపాన్ని ధరించి ఉన్నది. ఆమెకు పైన గరుడరూపాన్ని కల్గిన, గోళ్లతో పామును పట్టుకొన్న పక్షిరూపం చిత్రీకరింపబడింది.

బౌద్ధ, జైన సాహిత్యప్రభావం మనదేశానికి సమీపంలో ఉన్న సింగపూర్, మలేషియా, ఇండోనేషియా మొదలగు దేశాల్లో బాగా కన్పిస్తుంది. అందువల్ల ఆ దేశాల్లోకూడా గరుడుని ప్రభావం ఉన్నది. ఇండోనేషియాలోని విమాన మార్గాలను 'గరుడ' అని పేరుపెట్టడం దీనికొక ఋజువు.

గరుడుడు సర్పాలను మోసికొని రమణీయకూటానికి పోయే వృత్తాంతాన్ని మహాభారతంలో Father Heran అనే పాశ్చాత్య పండితుడు విశ్లేషిస్తూ, నాగులు గరుడుని నాయకత్వంలో ఈజిప్టుదేశాన్ని ఆక్రమించడానికి ఇది చిహ్నమనే వింత వాదాన్ని లేవనెత్తాడు. దీనికి ఉపోద్బలకంగా ఈజిప్టులోని శిలాప్రతిమల్లో నాగుల, గరుడుల రూపాలు ప్రక్కప్రక్కనే చెక్కబడి ఉండడాన్ని చూపాడు. మఱియు నాగ-గరుడరూపాల సహయోగభావన ఈజిప్టుదేశంలో కొన్ని ప్రాంతాల్లో ప్రాచుర్యంగా ఉండడాన్ని కూడా ఉదాహరించాడు. మహాభారతంలో గరుడుడు నాగులను తీసికొనిపోయిన

సముద్రగర్భంలోని రమణీయ కూటమనే ప్రదేశం ఉత్తర ఈజిప్టు ప్రాంతంలోని El-Rahmaniya అనే ప్రాంతమని వాదించాడు. కాని, ఈవాదం పసలేనిదని SA-Dauge వంటి విమర్శకులు కొట్టిపారేశారు. గరుడుడు నాగులను మోసికొనిపోవడం నాగులపై గరుడునకున్న ఆధిపత్యాన్ని సూచించకపోగా, అతడు వారికి అధీనుడుగా ఉండడాన్ని సూచిస్తుందని వారు అభిప్రాయపడ్డారు. గరుడ-నాగరూపాల సహభావం కేవలం ఈజిప్టుదేశంలోనే కాక గరుడప్రభావం ఉన్న ఇంచుమించు అన్ని ప్రదేశాల్లో కన్పిస్తున్నదని, రమణీయకూటం ప్రస్తుత నికోబార్ దేశంలోని నక్కవరప్రాంతమై ఉంటుందని సిద్ధాంతం చేశారు. అమెరికా దేశానికి రాజచిహ్నం గరుడుడు. దీనికి అచట "గోల్డెన్ బర్డ్" అని పేరు.

**గండభేరుండరూపం :**

గరుడముఖాలను రెండింటిని సంతరించుకొన్న ఈ రూపం భారతీయసాహిత్యంలో, తంత్రశాస్త్రములో విశిష్టమైన స్థానాన్ని పొందింది. ఈరూపానికి ప్రాచీనమైన చరిత్ర చాలా ఉన్నది. అత్యంత పురాతనమైన గండభేరుండ రూపం పశ్చిమ ఆసియాలో కన్పించింది. టర్కీదేశంలోని Alala Huyuk అనేచోట క్రీ.పూ. 1400 సం. ప్రాంతానికి చెందిన రెండుతలల గండభేరుండం తన రెండు కాళ్లతో రెండు గుఱ్ఱాలను తన్నుకొనిపోయే చిత్రం ఒకటి దొరికింది. మనదేశంలో తక్షశిలవద్ద జరిపిన తవ్వకాల్లో క్రీ.శ. 1వ శతాబ్దికి చెందిన గండభేరుండరూపం బయటపడింది. Marshall అనే విదేశీయ విమర్శకుడు ఈ గండభేరుండ భావన Scytenians నుండి తక్షశిల ప్రాంతానికి, అక్కడనుండి క్రమంగా దక్షిణభారతానికి వ్యాపించిందని భావించాడు. కాని, ఈ వాదనను పలువురు అంగీకరించలేదు. దక్షిణభారతదేశంలోని పలు రాజవంశీయులకు ఈ పక్షితో అవినాభావంబంధం ఉన్నది. క్రీ.శ.1047 సం. ప్రాంతంలో ఏకశిలారూపమైన గండభేరుండ స్తంభాన్ని చాళుక్యులు కర్ణాటలోని Belgari వద్ద (షిమోగాజిల్లా) చెక్కించారు. ఈ స్తంభంపై రెండు తలల గండభేరుండం ఉన్నది. దీన్ని చెక్కించిన చాముండరాయుడు అనేరాజు తనను గండభేరుండ నామంతో నిర్దేశించుకోవడం విశేషం. హొయసల ప్రభువులు పలువురు తమ పరాక్రమ చిహ్నంగా గండభేరుండనామాన్ని పెట్టుకొన్నారట. (నారసింహ III- క్రీ.శ. 1254-1291, భల్లాలుడు 1291-1342 మొ.వారు) విజయనగర రాజులు కూడా పలువురు ఈ బిరుదాన్ని ఆదరించారు. అచ్యుత రాయలకాలంలోని బంగారునాణాలపై గండభేరుండ రూపం ఉన్నది. Wood ward, Burnelt మొదలగు పరిశోధకులు ఈరూపం రష్యాదేశంలోకూడా ఉండడాన్ని ఋజువుచేశారు. యూరప్‌దేశాలలోకూడా గండభేరుండరూపం మధ్యయుగంలో ప్రవేశించింది. ఈయుగానికి చెందిన జర్మన్ ప్రభువులు తమ పాలనచిహ్నంగా ఈరూపాన్ని చేసికొన్నారు. భారతీయ మంత్రతంత్ర శాస్త్రాలలో గండభేరుండరూపానికి ప్రత్యేకత ఉన్నవిషయం స్పష్టమే. పురాణసాహిత్యంలో కూడా ఈరూపం ప్రస్తావన అక్కడక్కడ కన్పిస్తున్నది.



**శాసనాల్లో, చారిత్రక అవశేషాల్లో గరుడుడు :**

సాంప్రదాయిక ఇతిహాసపురాణాదిసాహిత్యాన్ని పూర్తిగా ప్రమాణంగా స్వీకరించడానికి సిద్ధపడని ఆధునిక పరిశోధకులు ఏవిషయంగూర్చిఅయినా నిర్ణయించడానికి ఉపయోగించే ఆధారాల్లో శాసనాలు చాలా ముఖ్యమైనవి. గరుడుని విషయంలో ఈ శాసనాధారాలు ఏవిధంగా ఉన్నాయో క్లుప్తంగా పరిశీలిద్దాం. మధ్యప్రదేశ్‌లో Besnagar (విదిశజిల్లా) దగ్గర లభించిన గరుడస్తంభంలోని శాసనం మొదటి శాసనంగా చెప్పవచ్చు. దీనిని Helioderous అనే గ్రీకురాయబారి క్రీ.పూ. 2వశతాబ్దంలో చెక్కించడం విశేషం. గుప్తులకాలానికి ముందు చెక్కబడిన రాతిశిల్పాల్లో, ముద్రికల్లో గరుడుని బొమ్మకన్పిస్తున్నది. ఈ ముద్రికలు బ్రిటిష్ మ్యూజియంలో భద్రపరచబడి ఉన్నాయి. ఇవి సుమారు క్రీ.శ. 3వశతాబ్దిలోనివి. తర్వాత సముద్రగుప్తుని తామ్రశాసనంలో గరుడుని బొమ్మఉన్నది. గుప్తులరాజ చిహ్నం గరుడుడు అవడంవల్ల వీరు నాగులను మూలపురుషులుగా కల్గిన రాజవంశాలను అణిచి వేశారని కొందఱి విశ్లేషణ. బుద్ధగుప్త, కుమారగుప్తుల కాలానికి చెందిన ముద్రికల్లో గరుడుని ఆకారం గోచరిస్తున్నది. ఈ చిత్రాల్లోని గరుడుడు రెండు ఱెక్కలతో కూడిన మానవాకారంలో ఉన్నాడు. ముఖంలో ఊర్ధ్వపుండ్రం కూడా ఉండడం విశేషం. ఘూర్జర జయభట్టు III (క్రీ.శ. 709-10) కాలానికి చెందిన పలకలలో గరుడుని రూపాలున్నాయి. 8వ శతాబ్దినాటివి. గరుడుని విగ్రహాకళ మరింత పరిణతిని పొందినది. గరుడుని సంకీర్ణ రూపము ఈకాలమున గోచరించుచున్నను పక్షిలక్షణముల కంటె మానవరూపమే అధికముగా కన్పించుచున్నవి. అమోఘవర్షుని (క్రీ.శ. 860) శాసనములను బట్టి అతని రాజచిహ్నము గరుడుడని స్పష్టమగుచున్నది. అట్లే10వ శతాబ్దములోని రాష్ట్రకూటుల శాసనములలో, 11 శతాబ్దికి చెందిన జయసింహుని శాసనము Gadag మొదలగు వానిలో గరుడచిహ్నములు కలవు. ఈ విధమైన గరుడాంకితములైన శాసనములు 15వ, 16వ శతాబ్ది పర్యంతము గోచరించుచున్నవి. ఉదాహరణకు సదాశివరాయని తామ్రశాసనములో (క్రీ.శ. 1478) గరుడ ప్రసక్తి కలదు.13వ శతాబ్దికి చెందిన సుందరపాండ్యుని శాసనమునుబట్టి ఆప్రభువుచే శ్రీరంగాలయమున బంగారు గరుడవిగ్రహము చేయింపబడినట్లును ఏర్పడుచున్నది. ఈ విధముగా శాసనాధారములనుబట్టి గరుడుని రూపము మొదట తిర్యగ్రూపమైనను, గుప్తులకాలమునుండి సంకీర్ణరూపమును పొందినదని, కొన్ని సందర్భములలో అతడు చతుర్బాహువుగాకూడ నున్నాడని, ప్రభువులు తమ రాజముద్రికలందు, అధికారచిహ్నములందు గరుడుని రూపము ముద్రించెడివారని, గరుడుడు ప్రభువులచే తమ పరాక్రమచిహ్నముగా భావింపబడెడివాడనియు ఏర్పడుచున్నది. ఈసందర్భములలో పలువురు ప్రభువులు గరుడుని పట్లగల భక్తికి చిహ్నముగా గరుడస్తంభములను కూడ నిర్మించిరి.

**గరుడుని ద్వాదశనామస్తోత్రమ్ :-**

బృహత్తంత్రసారమను గ్రంథములో గరుడద్వాదశనామస్తోత్ర మిట్లు చూపబడినది.

సుపర్ణం వైనతేయం చ నాగారిం నాగభీషణమ్ ।
జితాంతకం విషారిం చ అజితం విశ్వరూపిణమ్ ॥
గరుత్మంతం ఖగశ్రేష్ఠం తార్క్ష్యం కాశ్యపనందనమ్ ।
ద్వాదశైతాని నామాని గరుడస్య మహాత్మనః ॥

**అమృతకలశములతో గరుడుడు :** గరుడుడు స్వర్గమునుండి అమృతమును తెచ్చి, తల్లి దాస్యమును తీర్చినగాథ సుప్రసిద్ధము. దీనిని ఆధారముగాగొని మధ్యయుగమునకు చెందిన పలుశిల్పములలో గరుడుడు అమృతకలశధారిగా చెక్కబడినాడు. ఈ శిల్పములలో గరుడుని రూపము పై నుండి నాభివరకు మానవరూపము.

**ప్రాచీనముద్రికల్లో గరుడుడు :** బ్రిటిష్ మ్యూజియంలో భద్రపరుపబడిన ఒకానొక ముద్రికలో గరుడుని అస్పష్టమైన రూపంగోచరిస్తున్నదని, ఇదియే గరుడుని ముద్రికల్లో అత్యంత ప్రాచీనమై ఉంటుందని (Jaya Stial) అనే భారతీయ పరిశోధకుని అభిప్రాయం. క్రీ.శ.5-6శతాబ్దులకు చెందిన ద్యుతివర్మకాలంలోని తామ్రఫలకాలపై, గరుడుడు, సర్పము, వృషభంచిత్రీకరింపబడ్డాయి. గుప్తులు గరుడుని తమ రాజచిహ్నంగా ఉపయోగించారు.ఇది వారి భాగవతభక్తికి, నాగజాతిని వారు అణచిన వృత్తాంతానికి సంకేతమని పండితుల భావన. రాజ్‌ఘాట్‌లో చాలా గరుడముద్రికలు లభించాయి. ఇందులో చాలా వాటిలో ఱెక్కలు విచ్చుకొన్న గరుడుని రూపం కనిపిస్తున్నా ఒక ముద్రికలో అంజలిముద్రతో ఉన్న గరుడుడు కన్పిస్తున్నాడు. సముద్ర గుప్తుని కాలంలోని గయతామ్రపు ఫలకాల్లో, కుమారగుప్తుడు కాలంలోని ఫలకాల్లో కనుపించే గరుడుడు మానవ ముఖంతో, పక్షిరూపంతో ఉన్నాడు. ఈ విధంగా ప్రాచీన కాలంలోని సముద్రికలనుబట్టి గరుడుని ఆరాధనా ప్రాచుర్యం తెలుస్తున్నది.

**ప్రాచీన నాణాల్లో గరుడుడు :** క్రీస్తుపూర్వకాలమునకు చెందిన పలునాణాల్లో గరుడుని రూపం కన్పిస్తున్నది. క్రీ.పూర్వములోని Heliodorus స్తంభము ఆకాలంలోని గరుడారాధనకు బలమైన ప్రతీక అని పూర్వమే చెప్పబడింది. ఇటువంటి గరుడస్తంభాల బొమ్మలు నాణాల్లోకూడా గోచరిస్తున్నాయి. Pawaya, (పూర్వపు గ్వాలియార్ రొట్టం) ప్రాంతాల్లో దొరికిన నాణాల్లో కన్పించే గరుడ, మకర, తాళముద్రలు ఆకాలంలోని భాగవత సంప్రదాయాన్ని ఋజువు చేస్తున్నాయని పండితుల అభిప్రాయం. క్రమేణ గరుడారాధన బలపడినందున గరుడుని రూపాలనే ప్రభువులు తమ గుర్తుగా చేసికొన్నారు. దీనికి గుప్తుల యుగమే ఉదాహరణ. ఆప్రభువులకాలంలోని పలు బంగారు, వెండి, నాణాల్లో గరుడుని ముద్రలున్నాయి. V.A.Smith అనే పరిశోధకుడు గరుడుని రూపం రోమ్‌దేశంలోని Eagle అనే పక్షి ఆధారంగా రూపొందింపబడిందని వాదించాడు. కాని Allen అనే పండితుడు ఈ అభిప్రాయాన్ని నిరాకరిస్తూ, ఈ విధమైన రూప సామ్యం సాధారణమని, నిజానికి క్రీస్తుశకానికి ముందే గరుడుని ఆరాధన భారతదేశంలో ఉన్నదని, దానికిHeliodrous స్తంభమే తార్కాణమని వాదించాడు. ఈవాదంతో Altekar వంటి పలువురు పండితులు ఏకీభవించారు. స్కంధగుప్తుని కాలంలోని బంగారు నాణాల్లో మధ్యలో గరుడస్తంభం ముద్రింపబడిఉన్నది. ఆవిధంగానే కుమారగుప్తుని సమయానికిచెందిన నాణాల్లో కూడా గరుడస్తంభముద్రలున్నాయి.



చంద్రగుప్తుని కాలంలోని గొడుగు ఆకారంలో ఉన్న నాణాల్లో పక్షిరూపంలోని గరుడుని బొమ్మలున్నాయి. అట్లే సముద్రగుప్తుని, రామగుప్తుల కాలంలోని కొన్ని నాణాలపై విచ్చుకొన్న ఱెక్కలతో ఉన్న గరుడుని ఆకారం ఉన్నది. కృష్ణదేవరాయల సమయానికి చెందిన తామ్రనాణాలపై శంఖచక్రధారి, కిరీటధారియైన గరుడుని ఆకారం ఉన్నది. ఈ గరుడుడు గరుడవాహన సన్నివేశంలో ఉన్నాడు. అని Studies in Indology అనే గ్రంథంలో VV Mairashi తెలిపారు. ఇదే విధంగా చంద్రగుప్తుని కాలానికి చెందిన కొన్ని రాగినాణాలపై మానవ -పక్షి రూపాలు కలసిన గరుడుని ఆకారం ఉన్నది. కొన్నిటిలో గరుడుడు రెండు చేతులలో రెండు సర్పాలను పట్టుకొన్న సన్నివేశంలో ఉన్నాడు. ఇదేవిధంగా యాదవరాయల కాలంలో, ప్రతాపరుద్రుని కాలంలోని నాణాలలో గరుడుని రూపం స్పష్టంగా కన్పిస్తున్నది.

**గరుడస్తుతులు :** వేదంలో సుపర్ణ, తార్క్ష్య, గరుత్మచ్ఛబ్దాలతో నిర్దేశింపబడిన గరుడుని స్తుతులు లౌకిక వాఙ్మయంలో చాలా తక్కువగానే కన్పిస్తున్నాయి. విష్ణువునకు వాహనంగా, ధ్వజంగా గుర్తింపు పొందిన తర్వాత గరుడుని స్థానం సాహిత్యంలో మరింత ఉన్నతమైనది. ఆగమాల్లో కూడా ప్రాధాన్యం పెరిగింది. మంత్ర శాస్త్రంలో సైతం గరుడునకు ప్రత్యేకమైన దేవతగా స్థానం సుస్థిరమైనది. ఆయా పురాణాల్లో, ఆగమగ్రంథాలలో, మంత్రశాస్త్ర గ్రంథాలలో గరుడుని ఆకారవర్ణన, విగ్రహ నిర్మాణ విధానం, ధ్వజపటనిర్మాణ ప్రతిష్ఠాదులు వివరింపబడ్డాయి. కాని, గరుడుని స్తుతులు మాత్రం చాలా తక్కువగానే కన్పిస్తున్నాయి. ఉపనిషత్తుల్లో గరుడోపనిషత్తు, స్తోత్రాలలో గరుడాష్టోత్తరశత నామస్తోత్రం, గరుడద్వాదశనామస్తోత్రం, దేశిక కృతాలైన గరుడ దండక, గరుడపంచాశత్ స్తోత్రాలు ప్రసిద్ధాలు ఇవికాక, బెల్లంకొండరామరాయకృతంగా, నరసింహాచార్యకృతంగా గరుడసందేశమనే పేరుతో రెండు సందేశకావ్యాలు ఉన్నట్లు M. కృష్ణమాచార్యులవారి "History ofSanskritLiterature" గ్రంథంలో పేర్కొనబడ్డాయి. అవి లభిస్తున్నట్లు తోచదు.

**గరుడ పంచాశత్ వైశిష్ట్యం:**

కవితార్కికసింహబిరుదాంకితులై, సర్వతంత్రస్వతంత్రులై, సర్వశాస్త్రములందు నిరుపమానపాండితీగరిమను కలవారై వెలుగొందిన వేదాంతదేశికులు సంస్కృతమున సుమారు ముప్పదిస్తోత్రములను వివిధ దేవతామూర్తులను గూర్చి అనుగ్రహించిరి. వానిలో కొన్ని శ్లోకాత్మకములు, ఒకటి దండకము ఇంకొకటి గద్యరూపమునను రచింపబడినది కూడ కలదు. గరుడుని గూర్చి దేశికులు రచించిన స్తోత్రములు రెండు కలవు. వానిలో గరుడపంచాశత్ అను ప్రస్తుతస్తోత్రము ఏబదియొక్కశ్లోకములనుకల శ్లోకరూపమైన అద్భుతకావ్యము. అట్లే, గరుడదండకమను వేరొకటి దండకమను విశిష్టమైన ఛందోరూపమున కూర్పబడినది.

వేదాంతదేశికులు తిరువహీంద్రపురమను క్షేత్రమున నివసించినపుడు వారి ఆచార్యులద్వారా గరుడమంత్రోపదేశమును పొందిరి. ఆ మంత్రమును భక్తితో జపింపగా గరుడ భగవానుడు మిక్కిలి సంతుష్టుచే, దేశికులముందు ప్రత్యక్షమై హయగ్రీవమంత్రమును ఉపదేశించిరి.

ఈ విధముగా గరుడుని అనుగ్రహమునకు పాత్రమైన దేశికులు గరుడుని వైభవమును సర్వతోముఖముగా ప్రదర్శించు ఈ స్తోత్రమును ఆ గరుడుని ఆజ్ఞాపై రచించిరి. ఇందులకు స్తోత్రమున చివరిశ్లోకములోనున్న **"సైకాం పంచాశతం యామతనుత వినతానందనం నందయిష్యన్, కృత్వామౌకా తదాజ్ఞాం కవికథక ఘాటాకేసరీ వేంకటేశ:"** అనుసూక్తి ప్రమాణము. ఒకనాటి రాత్రి దేశికులకు స్వప్నమున గరుడభగవానుడు సాక్షాత్కరించి, తన విషయమున స్తోత్రమును రచింపుమని ఆజ్ఞాపించగా, దేశికులు ప్రస్తుతస్తోత్రమును రచించిరని పెద్దలందురు. దీనినికూడ పైప్రమాణము బలపఱచుచున్నది.

ఇందులకు అనుగుణముగా ప్రస్తుత స్తోత్రము అయిదు వర్ణములతో గరుడమంత్రము అయిదువర్ణములను (అక్షరములను) కల్గినది. (భాగములతో) కూడినదిగా రచింపబడినది. 1. పరవ్యూహవర్ణకము 2. అమృతాహరణవర్ణకము 3. నాగదమనవర్ణకము 4. పరిష్కారవర్ణకము 5. అద్భుత వర్ణకము అనునవి ఆ అయిదుభాగములు. మొదటివర్ణకము గరుడుని పరరూపమును, సంకర్షణాత్మకవ్యూహరూపమును వర్ణించుచున్నది. ఇందు 8 శ్లోకములు కలవు. రెండవవర్ణకము గరుడుడు అమృతమును స్వర్గము నుండి తీసికొనివచ్చు వృత్తాంతమును తెలుపుచున్నది. ఇందు 17 శ్లోకములు కలవు. మూడవవర్ణకము నాగములను గరుడుడు అణచిన విధమును తెలుపుచున్నది. ఇందు 10 శ్లోకములు కలవు. నాల్గవ వర్ణకమగు పరిష్కారవర్ణకము పలు సర్పములు గరుడునకు ఆభరణములై ప్రకాశించుట వర్ణింపబడినది. ఇందును 10 శ్లోకములు కలవు. చివరి వర్ణకము గరుడుని అద్భుతకృత్యములను అభివర్ణించుచున్నది. దీని యందు 6 శ్లోకములు కలవు. చివరి శ్లోకము ఫలశ్రుతి.

ఈ స్తోత్రము దేశికుల నిరర్గళధారాసంపాతరూపమైన కవితా ప్రవాహమునకు ఒక మచ్చుతునక. అంతయే కాక ఈ మహనీయుల సర్వశాస్త్ర పాండిత్యమును సూచించుచున్నది. మొదటిశ్లోకమున గరుడమంత్రోద్ధార ప్రకారమును తెలుపుట, 21 వ శ్లోకమున గరుడుని వేగమును వర్ణించుచు "వక్రాతిచారాః" అనుచు జ్యోతిశ్శాస్త్రములోని పారిభాషిక పదములగు వక్రచార, అతిచారములను పదములనుప్రయోగించుట ఇందులకు స్థాలీపులాకన్యాయమున ఉదాహరణములు,

ఈ స్తోత్రమును పారాయణముచేసిన వారికి విషజంతువులవలన బాధ కలుగదు. వారికి ఎట్టి కష్టములు, మనస్తాపములును ఏర్పడవు. కోరిన ఫలములు త్వరగా సిద్ధించును. గరుడుని మహిమవంటి మహిమను పొందగల్గుదురు- అని దేశికులు చివరి శ్లోకమున తెలుపుట దీని వైశిష్ట్యమును తెలుపుచున్నది.

**గరుడపంచాశత్వ్యాఖ్యలు :** ఈ స్తోత్రముపై కౌశిక కులతిలకులు శ్రీభాష్యశ్రీనివాసాచార్యుల వారిసంస్కృతవ్యాఖ్య, శిన్నాము శ్రీనివాసాచార్యుల వారి సంస్కృతటిప్పణి, ద్రావిడభాషలో ప్రతిపదార్థ తాత్పర్యములును 1912వసంలో పరీధావి సంవత్సరము ఆషాఢమాసములో కుంభకోణమునందు శ్రీగోపాలవిలాసముద్రాక్షరశాలలో ముద్రింపబడినవి. టిప్పణి కొన్ని శ్లోకములవరకే కలదు. అదియు కొన్నింటికి మిక్కిలి సంక్షిప్తముగా నున్నది. ఇవికాక వేరు సంస్కృతవ్యాఖ్యలు కాని, మణిప్రవాళ వ్యాఖ్యలుగాని ఉన్నవేమో తెలియదు. తెనుగున ఇంతవరకు సమగ్ర వ్యాఖ్య ఈస్తోత్రమునకు లేదు.



ఒకటి రెండు క్లుప్తమై వ్యాఖ్యానములున్నవి. ప్రస్తుత అర్చనావ్యాఖ్యలో సంస్కృత వ్యాఖ్యాన విశేషములు, టిప్పణీవిశేషములతో పాటు, నాకు స్ఫురించిన కొన్ని అంశములను చేర్చితిని. Shantial Nagar అను విద్వాంసుడు ఆంగ్లములో Garuda- The celestial bird అనే గొప్ప పరిశోధనాగ్రంథమును ప్రచురించిరి. అందలి కొన్ని విశేషములను గొని, మరికొన్ని సంప్రదాయ విశేషాలను జతచేసి ఉపోద్ఘాతమును కూర్చితిని. తెనుగులో గరుడుని పైఇట్టి విశ్లేషణాత్మకమైన రచన ఇంతవరకు లేదని భావింతును. కావున ఇదియు అపూర్వము కాగలదని ఈ ప్రయత్నమును చేసితిని. కాని ఏమాత్రము సాఫల్యమందితినో సహృదయులైన పాఠకులే ప్రమాణము. అనుబంధముగా గరుడాష్టోత్తరశతనామ స్తోత్రమును చేర్చితిని. ఈ అర్చనా వ్యాఖ్యాన రచనలో, ఉపోద్ఘాతమును వ్రాయుటలో పలురీతుల బాసటగా నిలచి, తగు సవరణలను సూచనలను ఇచ్చిన అస్మత్పితృ చరణులు **న్యాయవేదాంతవిద్వాన్, ఉవే శ్రీమాన్ ఈయుణ్ణిరంగాచార్య స్వామివారి** దివ్యసన్నిధిలో **"తలైయల్లాల్ కైమ్మాటిలేన్"** అనురీతిలోకృతజ్ఞతావినమ్రుడనై, శిరసా అభివాదమును చేయుచున్నాను. మాతృమూర్తిలగు సీతమ్మగారి ఆదరణ,ప్రోత్సహములు మరువలేనివి. వారి సన్నిధిలో శతధాప్రణమిల్లుచున్నాను. ఈగ్రంథము ముద్రించుటకు ఆవశ్యకమైన ఆర్థిక సహాయమును ఉదారముగా అనుగ్రహించిన శ్రీనివాస ప్రభువు దివ్యసన్నిధిలో మోకరిల్లుచున్నాను. తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యమువారికి కృతజ్ఞతలు. నాకు పలు విధాలుగా సహాయమందించి, ప్రోత్సహించిన జ్యేష్ఠసహోదరులు శ్రీమాన్ డా॥ ఈ.ఏ శింగరాచార్యులవారికి, మాతృసమానురాలు ల. సౌ. జయలక్ష్మి గారికి నాకార్తజ్ఞ్యమును నివేదించు కొనుచున్నాను. నాకు ఎప్పుడూ ప్రోత్సాహ సహకారాలను అందించిన నా సతీమణి చి. సౌ. డా॥ విజయలక్ష్మికి, మా చిరంజీవులు చి.ధరణి, చి॥ బదరీనాథ్‌లకు ఆశీస్సులు. గ్రంథమును చక్కగా డి.టి.పి. చేయుటలో ముద్రించుటలో తోడ్పడిన చి ॥ జయ, చి ॥ సౌ॥ స్వర్ణలత, అన్నపూర్ణ గ్రాఫిక్స్ యజమాని శ్రీశర్మగార్లకు నా ధన్యవాదములను తెలుపుకొనుచున్నాను. నా ఈ ప్రయత్నము ఏకొద్దిమందికైనను తృప్తినికల్గించినచో ధన్యమని తలంతును.

**స్వస్తి సహృదయ హృదయాయ**

విశాఖపట్నం
21-3-2003

సహృదయ విధేయుడు
*భాష్యకారాచార్యులు*

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే గరుడభగవతే నమః
శ్రీమతే వేదాంతగురవే నమః
శ్రీమద్వరవరమునయే నమః

# విజ్ఞప్తిః

1. అప్రాకృత మహం వందే శ్రీనివాసాభిధం మహః ।
యస్య భాసా జగత్సర్వం విభాతి మహతా సదా ॥

2. వేంకటేశవిశాలోరఃపీఠికా మధితస్థుషీమ్ ।
దేవీం పద్మావతీం భక్త్యా ప్రపద్యే శ్రితవత్సలామ్ ॥

3. శ్రీ శేషసింహదేశికచరణౌ సేవే మదీయజీవాతూ ।
యత్కరుణాలవలేశా ద్దాసోఽయం వస్తుతాం లేభే ॥

4. సీతాంబారంగరామానుజాచార్యౌ పితరౌ మమ ।
మూర్తీభూతకృపాసారౌ కలయామి సదా హృది ॥

5. కవితార్కికపంచాస్యః శ్రీమద్వేదాంతదేశికః ।
స్తోత్రం గరుడపంచాశ న్నామకం దయయాఽతనోత్ ॥

6. దాసోఽయం భాష్యకారాఖ్యః స్తద్వ్యాఖ్యా మాంధ్రభాషయా ।
గురూణాం కృపయాతానీ దర్చనాం ప్రీతయే సతామ్ ॥

7. అజ్ఞానేన ప్రమాదేన దోషా యే విహితా మయా ।
తాన్ సర్వాన్ కృపయా సంతః క్షంతు మర్హంతి వత్సలాః ॥

8. సౌగుణ్యం యది దృశ్యేత తదాచార్యకృపాఫలమ్ ।
ఇత్యావేద్య రసజ్ఞానాం సన్నిధా విద మర్ప్యతే ॥



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే వేదాంతగురవే నమః

గరుడపంచాశత్ వ్యాఖ్య

## ఉపోద్ఘాతము

కవిత్కారికసింహబిరుదాంకితులై, సర్వతంత్రస్వతంత్రులై, సర్వశాస్త్రములందు నిరుపమానపాండితీగరిమను కలవారై వెలుగొందిన వేదాంతదేశికులు సంస్కృతమున సుమారు ముప్పదిస్తోత్రములను వివిధ దేవతామూర్తులను గూర్చి అనుగ్రహించిరి. వానిలో కొన్ని శ్లోకాత్మకములు, ఒకటి దండకము ఇంకొకటి గద్యరూపమునను రచింపబడినది కూడ కలదు. గరుడుని గూర్చి దేశికులు రచించిన స్తోత్రములు రెండు కలవు. వానిలో గరుడపంచాశత్ అను ప్రస్తుతస్తోత్రము ఏబదియొక్కశ్లోకములనుకల శ్లోకరూపమైన అద్భుతకావ్యము. అట్లే, గరుడదండకమను వేరొకటి దండకమను విశిష్టమైన ఛందోరూపమున కూర్చబడినది.

వేదాంతదేశికులు తిరువహీంద్రపురమను క్షేత్రమున నివసించినపుడు వారి ఆచార్యులద్వారా గరుడమంత్రోపదేశమును పొందిరి. ఆ మంత్రమును భక్తితో జపింపగా గరుడ భగవానుడు మిక్కిలి సంతుష్టుచే, దేశికులముందు ప్రత్యక్షమై హయగ్రీవమంత్రమును ఉపదేశించిరి. ఈ విధముగా గరుడుని అనుగ్రహమునకు పాత్రమైన దేశికులు గరుడుని వైభవమును సర్వతోముఖముగా ప్రదర్శించు ఈ స్తోత్రమును ఆ గరుడుని ఆజ్ఞపై రచించిరి. ఇందులకు స్తోత్రమున చివరిశ్లోకములోనున్న **"సైకాం పంచాశతం యామతనుత వినతానందనం నందయిష్యన్, కృత్వామౌకా తదాజ్ఞాం కవికథక ఘటాకేసరీ వేంకటేశః"** అనుసూక్తి ప్రమాణము. ఒకనాటి రాత్రి దేశికులకు స్వప్నమున గరుడభగవానుడు సాక్షాత్కరించి, తన విషయమున స్తోత్రమును రచింపుమని ఆజ్ఞాపించగా, దేశికులు ప్రస్తుతస్తోత్రమును రచించిరని పెద్దలందురు. దీనినికూడ పైప్రమాణము బలపఱచుచున్నది.

ఇందులకు అనుగుణముగా ప్రస్తుత స్తోత్రము అయిదు వర్ణములతో గరుడమంత్రము అయిదువర్ణములను (అక్షరములను) కల్గినది. (భాగములతో) కూడినదిగా రచింపబడినది. 1. పరవ్యూహవర్ణకము 2. అమృతాహరణవర్ణకము 3. నాగదమనవర్ణకము 4. పరిష్కారవర్ణకము 5. అద్భుత వర్ణకము అనునవి ఆ అయిదుభాగములు. మొదటివర్ణకము గరుడుని పరరూపమును, సంకర్షణాత్మకవ్యూహరూపమును వర్ణించుచున్నది. ఇందు 8 శ్లోకములు కలవు. రెండవవర్ణకము గరుడుడు అమృతమును స్వర్గము నుండి తీసికొనివచ్చు వృత్తాంతమును తెలుపుచున్నది. ఇందు 17 శ్లోకములు కలవు. మూడవవర్ణకము నాగములను గరుడుడు అణచిన విధమును తెలుపుచున్నది. ఇందు 10 శ్లోకములు కలవు. నాల్గవ వర్ణకమగు పరిష్కారవర్ణకము పలు సర్పములు గరుడునకు ఆభరణములై ప్రకాశించుట వర్ణింపబడినది. ఇందును 10 శ్లోకములు కలవు. చివరి వర్ణకము గరుడుని అద్భుతకృత్యములను అభివర్ణించుచున్నది. దీని యందు 6 శ్లోకములు కలవు. చివరి శ్లోకము ఫలశ్రుతి.

ఈ స్తోత్రము దేశికుల నిరర్గళధారాసంపాతరూపమైన కవితా ప్రవాహమునకు ఒక మచ్చుతునక. అంతయే కాక ఈ మహనీయుల సర్వశాస్త్ర పాండిత్యమును సూచించుచున్నది. మొదటిశ్లోకమున గరుడమంత్రోద్ధార ప్రకారమును తెలుపుట, 21 వ శ్లోకమున గరుడుని వేగమును వర్ణించుచు **"వక్రాతిచారాః"** అనుచు జ్యోతిశ్శాస్త్రములోని పారిభాషిక పదములగు వక్రచార, అతిచారములను పదములనుప్రయోగించుట ఇందులకు స్థాలీపులాకన్యాయమున ఉదాహరణములు,

ఈ స్తోత్రమును పారాయణముచేసిన వారికి విషజంతువులవలన బాధ కలుగదు. వారికి ఎట్టి కష్టములు, మనస్తాపములును ఏర్పడవు. కోరిన ఫలములు త్వరగా సిద్ధించును. గరుడుని మహిమవంటి మహిమను పొందగల్గుదురు- అని దేశికులు చివరి శ్లోకమున తెలుపుట దీని వైశిష్ట్యమును తెలుపుచున్నది.

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే గరుడభగవతే నమః
శ్రీమతే వేదాంతగురవే నమః



శ్రీవేదాంతదేశికప్రణీతమైన

# గరుడపంచాశత్

## అర్చనావ్యాఖ్యానసహితము

### గరుడమంత్రమును జపముచేయు విధానము

1. **అంగేష్వానందముఖ్యశ్రుతిశిఖరమిళద్దండకం గండపూర్వం**
**ప్రాగేవాభ్యస్య షట్సు ప్రతిదిశ మనఘం న్యస్తశుద్ధాస్త్రబంధాః ।**
**పక్షివ్యత్యస్తపక్షిద్వితయముఖపుటప్రస్ఫుటోదారతారం**
**మంత్ర గారుత్మతం తం హుతవహదయితాశేఖరం శీలయామః ॥**

ప్రాక్ + ఏవ =(జపమును చేయుటకు) ముందుగానే, గండపూర్వమ్= గకార, డకారములు ముందుండునట్లు, ఆనందముఖ్య = ఆనందస్వరూపమగు బ్రహ్మమును ముఖ్యముగా (ముఖ్యార్థముగా) కల్గిన, శ్రుతిశిఖర = వేదాంతమున ముఖ్యమైనదగు ప్రణవముతో, మిళత్ = కూడిన, దండకమ్ = దండకరూపమైన మంత్రమును (మూలమంత్రము అనియు అర్థము), అనఘమ్= క్రమముతప్పిన దోషము లేకుండునట్లు, షట్సు అంగేషు =ఆఱు అవయవములలో, అభ్యస్య =న్యాసము చేసి, ప్రతిదిశమ్ =అన్ని దిక్కులందు, న్యస్త = ఉంచబడిన, శుద్ధ + అస్త్రబంధాః = పవిత్రమైన అస్త్రబంధమును (దిగ్బంధమును) కల్గిన మనము, పక్షి = పక్షి అనుపదమును, వ్యత్యస్తపక్షి = అక్షరములు వ్యత్యస్తములైన పక్షి అనుపదమును (క్షిప అను క్రమమును), ద్వితయ = రెండిటిని కల్గినది, ముఖపుట = ప్రారంభమున (ఆదిలో) , ప్రస్ఫుట = మిక్కిలి స్పష్టముగా వెల్గు, ఉదార = గొప్పదైన, తారమ్= ప్రణవమును కల్గినది, హుతవహదయితా =అగ్నియొక్క భార్యయగు స్వాహాదేవిని తెలుపు పదమును (స్వాహా అను పదమును), శేఖరమ్=చివర కల్గినది అగు, గారుత్మతమ్ =

గరుత్మంతునకు చెందిన, తం మంత్రమ్ = ఆ మంత్రమును, శీలయామః = ధ్యానింతుము.

గరుడమంత్ర జపమును చేయుటకుముందు ఆ మంత్రముయొక్క ఋషి - ఛందస్సు - దేవత - మొదలగు వానిని ధ్యానింపవలెను. పిమ్మట చిటికెనవేలు మొదలుకొని కరన్యాసమును చేయవలెను. అనంతరము ఆనందస్వరూపమగు బ్రహ్మమును ముఖ్యార్థముగా తెలుపు వేదముయొక్క ముఖ్యభాగమగు ప్రణవముతోకూడిన మంత్రము యొక్క ఒక్కొక్క అక్షరమును పల్కి కరన్యాసమును చేయవలెను. పిమ్మట అదే రీతిలో తల మొదలు పాదమువరకు దేహన్యాసమును చేయవలెను. అనంతరము హృదయము మొదలుగా గల స్థానములలో అంగన్యాసమును చేయవలెను. పిమ్మట ఎనిమిది దిక్కులందు దిగ్బంధమును చేయవలెను. ఇట్లు పూర్వాంగమును పూర్తిచేసిన పిదప గరుడభగవానుని మంత్రమును ధ్యానింపవలెను. అనంతరమే మంత్రమును జపింపవలెను.

**"గరుడపంచాశత్"** అను ఈ స్తోత్రమును రచింపనెంచిన దేశికులు ప్రస్తుతశ్లోకమున గరుడమంత్రోపాసనాక్రమరూపమైన నమస్కారమును చేయుచున్నారు. **"ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్"** అని శాస్త్రవచనము కదా ! ఇట్టి మంత్రోపాసన రూపమైన మంగళా చరణమును ఆ ఉపాసనాపద్ధతిని తెలుపుక్రమమున చేయుట విశేషము.

**(గండపూర్వమ్)** - దీర్ఘబిందుసహితమైన గకారము బీజము. కేవలబిందు సహితమైన డ కారము శక్తి. అకారముతో, బిందువుతో కూడిన ఈ రెండు అక్షరములు కీలకము. ఋషి విశ్వామిత్రుడు. త్రిష్టుప్ ఛందస్సు, లక్ష్మీనారాయణసహితుడైన గరుడమూర్తి దేవత.

**(ఆనందముఖ్యశ్రుతిశిఖర)** - వేదాంతమునందు ప్రధానప్రతిపాద్యుడు ఆనందమయుడగు భగవానుడే.. **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"** అని కదా భగవానుని గీతావచనము ! **"దండక"** మనుటచే న్యాసమునకు తగిన మాలా మంత్రము గ్రహింపబడును. భగవానుడు ఆనందమయుడనుటకు **"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"** ఇత్యాది శ్రుతి వాక్యములు స్మరణీయములు. ప్రణవముయొక్క వేదాంతశిఖరత్వము, దానిచే పరబ్రహ్మ ప్రతి పాదింపబడుటయును **"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః"** ఇత్యాది ప్రమాణములచే సిద్ధములు, **"ఆనందముఖ్యస్వర శిఖర మిళద్దణ్డకమ్"** అని వేరొక పాఠముకలదు. అపుడు, ఆనందముఖ్య = పరబ్రహ్మను ముఖ్యార్థముగా కల్గినవగు, స్వరశిఖర = స్వరములనబడు అచ్చులలో శ్రేష్ఠములగు అకార, ఉకారములతో (అర్థాత్ బిందు సహిత మకారముకూడ గ్రాహ్యము), మిళద్దణ్డకమ్ = కూడిన దణ్డకము అని అర్థము. దణ్డకపదప్రయోగముచే న్యాసమునకు తగిన మాలామంత్రమును కూడా గ్రహింపనగును. **"దణ్డక మితి కథనేన న్యాసోచితమాలామంత్రస్యాపి గ్రహణమ్"** అని సంస్కృతవ్యాఖ్య.

**(షట్సు అంగేషు)** - అంగుష్ఠము, తర్జని - మధ్యమ - అనామిక - కనిష్ఠిక, (బొటనవేలు



చూపుడువేలు, మధ్యవేలు, ఉంగరపువేలు, చిటికెనవేలు) అను అయిదువేళ్ళు, కరతలకరపృష్ఠములతో కలపి ఆఱు అంగములందు -

**(అభ్యస్య)** - యథాక్రమముగా న్యాసముచేసి అని అర్థము. ఇచట కూడ **"గండపూర్వమ్"** అను పూర్వపదమును అన్వయించి, గండశబ్దముచే ఉపలక్షింపబడిన ముఖము, శిరస్సు, హృదయము, నాభి, పదములు అను ఆఱు అంగములను గ్రహింపనగును. **"అత్రాపి గండపూర్వ మిత్యనుషజ్య గండశబ్దోపలక్షితముఖశిరోహృదయనాభి పదాఖ్యాన్యఙ్గాని లక్షణయా గృహ్యంతే"** అని సంస్కృతవ్యాఖ్య.

మొదట కరన్యాసము, పిమ్మట దేహన్యాసము, ఆతరువాత అంగన్యాసము. తదనంతరము ధ్యానమును చేయవలయును. మొదట ఋషి, ఛందస్సు, దేవతాదులను స్మరించి, కరన్యాస - దేహన్యాస- అంగన్యాసములతో అంగుష్ఠాదికరన్యాసమును, హృదయాది అంగన్యాసములను చేయునపుడు గరుడపంచాక్షరిలోని ఒక్కొక్క అక్షరమును ప్రణవముతో సంపుటితము చేసి (కలపి), యథాక్రమము ఒక్కొక్క అవయవమునందు విన్యాసమును చేయవలెను. ఆఱవ అంగమునందు మంత్రమును పూర్తిగా న్యాసమును చేయవలెను. ఈ విధముగానే దేహన్యాసమునందును ప్రణవ సంపుటితములైన గరుడ పంచాక్షరీ వర్ణములను శిరస్సుమొదలుగాగల అంగములందు విన్యాసమును చేయవలెను. పిమ్మట దిగ్బంధనమొనర్చి, మూర్తిని ధ్యానించి, గరుడపంచాక్షరిని జపింపవలెను. ఈ వివరణము అక్షరన్యాసమునకు సంబంధించినది. ఇట్టి న్యాసాది స్వరూపము అనేకవిధములుగా నున్నది. దానిని ఆచార్యముఖముగా గ్రహించుటతగినది.

**(పక్షివ్యత్యస్తపక్షిద్వితయముఖపుటప్రస్ఫుటోదారతారమ్)** - పక్షిశబ్దమునకు, వ్యత్యస్తమైన పక్షిశబ్దమునకు (ముందు) ప్రారంభమున ప్రణవమున కల్గినది. అనగా ప్రణవముతో కూడిన పక్షిశబ్దము, క్షిపశబ్దములని అర్థము.

**(హుతవహదయితాశేఖరమ్)** - అగ్నికి భార్య స్వాహాదేవి. ఆమెను నిర్దేశించు స్వాహాశబ్దమును చివర కల్గినవి అని అర్థము. ఇట్లు **"ఓమ్ పక్షి స్వాహా, ఓమ్ క్షిప స్వాహా"** అను రెండు విధములైన మంత్రములు ఇచట తెలుపబడినవి. **"ఆదిమధ్యావసానేషు యథాక్రమం ప్రణవపక్షిస్వాహాకార సహితం, ప్రణవ క్షిప స్వాహాసహితం చ ద్వివిధమపీత్యర్థః"** అని సంస్కృతవ్యాఖ్య.

ప్రణవ-పక్షి-స్వాహాత్మకమైన మంత్రోద్ధారము ఈశ్వరసంహితలోని అష్టమాధ్యాయమున- **"ప్రణవం పూర్వ ముద్ధృత్య పక్షిశబ్ద మనంతరమ్, పంచాక్షరో మహామంత్రః స్వాహాంతః సంప్రకీర్తితః"** అని తెలుపబడినది. అట్లే, రెండవప్రకారమగు ప్రణవ- క్షిప-స్వాహాత్మకమైన మంత్రముయొక్క ఉద్ధారము గరుడోపనిషత్తులో తెలుపబడినది. ఈ శ్లోకముయొక్క భావమును సంగ్రహముగా తెలుపుచు సంస్కృతవ్యాఖ్యాత ఇట్లనిరి. **"అయ మర్థః - ప్రథమం ఋషి చ్ఛందో దేవతాధిక ముక్త్వా**

**కరన్యాసదేహన్యాసాంగన్యాసేషు అంగుష్ఠాదికరన్యాసహృదయాద్యఙ్గన్యాసకరణే పంచాక్షరాణి ప్రత్యేకం ప్రత్యేక మాదాయ ప్రణవసంపుటితం యథా తథా యథాక్రమం పక్షస్వవయవేషు విన్యస్య, షష్ఠావయవే తు కృత్స్నం మంత్రం విన్యస్య, దేహన్యాసకరణేఽపి అక్షరాణి ప్రత్యేకం ప్రత్యేక మాదాయ, ప్రణవసంపుటితం యథా తథా తత్తదవయవేషు శిరఃప్రభృతి పాదపర్యంతం చ విన్యస్య, తతో దిగ్బంధనమూర్తిధ్యానపూర్వకం గరుడపంచాక్షరీపరిశీలనం కుర్మ ఇతి. "ప్రథమం తు కరన్యాసం దేహన్యాస మనంతరమ్, అంగన్యాసం తతః కుర్యాత్ తతో ధ్యానం సమాచరేత్." అయం త్వక్షరన్యాసః ఏవం న్యాసాదిస్వరూప మనేకవిధమ్. గరుడమంత్ర - ఋషి - ఛందోదేవతాదికం సర్వ మప్యుపదేశ గమ్య మితి."**

ఈ రెండు విధములైన మంత్రములేకాక, మఱి రెండువిధములైన మంత్రములును శ్లోకమున దేశికులచే సూచించబడినవని వ్యాఖ్యాతలు అభిప్రాయపడిరి. **"పక్షివ్యత్యస్తపక్షిద్వితయముఖపుట"** అనునపుడు **"ముఖపుట"** శబ్దమునకు ప్రారంభమున అనికాక, శిరోభాగమున అను అర్థమును గ్రహించి, పక్షి - క్షిప శబ్దముల అనంతరము అను అర్థమును గ్రహింపనగును. ఈక్రమమున ముందు పక్షి, క్షిప శబ్దములు, ఆ పిమ్మట ప్రణవము, పిమ్మట స్వాహా శబ్దముతో కూడిన రెండు మంత్రములు తెలుపబడినట్లయినవి. పక్షి శబ్దముతో కూడిన ప్రణవ-స్వాహాత్మకమైన మంత్రముయొక్క ఉద్ధారము విష్ణుతిలకమున - **"మంత్రం తు వైనతేయస్య శ్రుణుష్వ కమలాసన, యవర్గాంత్యతృతీయం చ పవర్గప్రథమాదిమమ్, తారం స్వాహాంత ముద్ధృత్య సాధయేత్ సాధకో మనుమ్."** అని తెలుపబడినది. క్షిపశబ్ద- ప్రణవ- స్వాహాత్మకమైన మంత్రముయొక్క క్రమము ఈశ్వర సంహితలోని అష్టమాధ్యాయమున - **"పాఙ్మూలం మంత్ర మధ్యాద్యవ్యత్యయాత్ విషహా భవేత్"** అని తెలుపబడినది. మొదటి అక్షరమున అగు ప్రణవము, మధ్యాక్షరమగు క్షికారముల పరస్పర వినిమయమువలన **"క్షిప ఓమ్ స్వాహా"** అను నాల్గవమంత్ర ప్రకారము ఏర్పడును.

ఈ నాల్గువిధములైన క్రమములను దేశికులు గరుడదండకములోని నాల్గవ పాదమున **"మను రనుగతపక్షివక్త్రస్ఫురత్తారక స్తావక శ్చిత్రభానుప్రియాశేఖరః"** అనుచు గూఢముగా తెలియజేసిరి. ఇచటి **"అనుగత"** శబ్దమునకు అనులోమమని, **"వక్త్రే"** అనుటకు శిరోభాగము - అనగా తదనంతరమని అర్థమును గ్రహించి, క్షిపశబ్దమును మొదట, మధ్యలో కల్గిన రెండు మంత్రములను వ్యాఖ్యాతలు వివరించిరి. గరుడదండకవ్యాఖ్యాతలగు భారద్వాజ రాజగోపాలాచార్యులవారి **"అత్ర ప్రణవమధ్యక మపి మంత్ర మధీయతే అస్మదాచార్యాః . తదైవమర్థః -అనుగత పక్షీత్యంత మాద్యవికల్పవత్. తస్య వక్త్రే శిరోభాగే -ఉపరీత్యర్థః. అనుగత పక్షిశబ్దానంతరమితి యావత్. సమాన మన్యత్. తథాచ పఠ్యతే - ప్రాఙ్మూల మంత్రమధ్యాద్యవ్యత్యయాత్ విషహా భవేత్, పంచాక్షర ఇతి ఖ్యాతో గారుడో మునిసత్తమాః - ఇత్యన్యత్ర విస్తరః"** అను వివరణము ఇచట స్మరణీయము.

ఇట్టి మంత్రములను, అంగన్యాసాది క్రమములను ఆచార్యముఖముగా గ్రహించుట



మంచిది. లేనిచో ఆశించిన ఫలితములు కలుగవు సరికదా, ప్రత్యవాయములును ఏర్పడవచ్చును. త్వరగా ఫలమును పొందుటకు ఒక్కొక్క మంత్రముతో చేర్చి జపించునట్టి మాలామంత్రములు కలవు. గరుడమంత్రమునకును అట్టి మాలామంత్రము కలదనుట ప్రస్తుతశ్లోకములోని మొదటిపాదమునందుగల **"దండక"** మను పదము సూచించుచున్నది.

దేశికులు ఈ స్తోత్రమును రచించుటకు గల కారణమును సంస్కృతవ్యాఖ్యాత ఈ క్రింది విధముగా వివరించెను. ఒకనాడు దేశికులు నిద్రించు సందర్భమున స్వప్నములో గరుడభగవానుడు సాక్షాత్కరించి, తనను స్తుతించుచు ఒక స్తోత్రమును రచింపవలసినదిగా వారిని ఆజ్ఞాపించెను. వెంటనే నిదురలేచిన దేశికులు మరునాటి ఉదయమున అహీంద్రపురక్షేత్రమునకు సమీపమునకుగల గరుడనదియందు నిత్యకర్మానుష్ఠానమును పూర్తిచేసికొని, గరుడపంచాక్షరిని అనుసంధించుచు తనకు సాక్షాత్కరించిన గరుడునియొక్క ఆజ్ఞను శిరసావహించి, గరుడపంచాక్షరీ సంఖ్యయగు 5 అను సంఖ్యలో పర, వ్యూహ, అమృతాహరణ, నాగమర్దన, పరిష్కారములను అయిదు వర్ణములతో కూడినది, సకలబాధలను తీర్చునదిఅగు గరుడపంచాశత్ అనబడు ప్రస్తుతస్తుతిని రచించిరి.

**మంత్రం గారుత్మతం తం హుతవహదయితాశేఖరం శీలయామః**

**గరుడమంత్రమహిమ**

**2.** **వేద స్స్వార్థాధిరూఢో బహి రబహి రభివ్యక్తి మభ్యేతి యస్యాం**
**సిద్ధిః సాంకర్షణీ సా పరిణమతి యయా సాపవర్గత్రివర్గా ।**
**ప్రాణస్య ప్రాణ మన్యం ప్రణిహితమనసో యత్ర నిర్ధారయంతి**
**ప్రాచీ సా బ్రహ్మవిద్యా పరిచితగహనా పాతు గారుత్మతీ నః ॥**

యస్యామ్ =ఏ గరుడమంత్రమునందు, వేదః = వేదస్వరూపుడగు గరుడమూర్తి, స్వ+ అర్థ + అధిరూఢః = తనకు అర్థమగు భగవానునిచే అధిరోహింపబడినవాడై, బహిః = బయట, అబహిః = లోపల, అభివ్యక్తిమ్= ప్రకాశమును, అభ్యేతి =పొందుచున్నాడో, యయా = ఏ మంత్రముచే, సా+ అప వర్గత్రివర్గా =మోక్షముతో కూడిన త్రివర్గములను (ధర్మార్థకామములను) అనుగ్రహించుట అను, సాంకర్షణీ = సంకర్షణమూర్తికి చెందిన, సా =ఆ, సిద్ధిః = సిద్ధి, పరిణమతి = పరిణామమును (పక్వతను) పొందుచున్నదో, యత్ర = ఏ మంత్రమునందు, ప్రణిహితమనసః = లగ్నముచేయబడిన మనస్సులనుకలవారు (యోగులు), ప్రాణస్య = ప్రాణవాయువునకు, అన్యమ్ = వేరొక, ప్రాణమ్ = ప్రాణముగా, నిర్ధారయంతి =నిర్ణయించుచున్నారో, ప్రాచీ = పురాతనమైనది, పరిచితగహనా = పరిచితమైనట్లున్నను తెలిసికొనుటకు మిక్కిలి కష్టమైన, సా = ఆ, గారుత్మతీ =గరుత్మంతునకు సంబంధించిన, బ్రహ్మవిద్యా =మంత్రము, నః = మనలను , పాతు, = రక్షించునుగాక,

వేదములు అన్నియు గరుడునకు శరీరమని ఆ వేదములే తెలుపుచున్నవి. **"వేదాత్మా విహగేశ్వరః"** కదా మరియు వేదములు భగవానుని స్తుతించుటచే అతడు వేదముల తాత్పర్యముగా వెలుగొందుచున్నాడు. ఆభగవానుడు గరుడుని అధిరోహించి యున్నాడు. ఇట్లు ఈ గరుడుని మంత్రముయొక్క అర్థమును అపాతతః పైపైకి గమనించినను, నిశితముగా లోపల పరిశీలించి చూచినచో గరుడుని మహిమ స్పష్టముగ కనపడును. శాస్త్రములు భగవానుని రెండవ వ్యూహమూర్తి యగు సంకర్షణ మూర్తిగా గరుడుని పేర్కొన్నది. ఇట్లు సంకర్షణుని రూపమగు గరుడుని యొక్క మంత్రమును జపించినచో ధర్మార్థకామములనబడు త్రివర్గము సిద్ధించుటయేకాక, అపవర్గమగు మోక్షమును సిద్ధించును. మఱియు, గరుడమంత్రమున మనస్సును నిలిపిన విజ్ఞులు గరుడుని ప్రాణవాయువు కంటెను మేలైన, విలక్షణమైన ప్రాణవాయువుగా నిశ్చయించిరి. ఈ మంత్రమును ఎన్ని మార్లు జపించి, అభ్యసించినను దాని అర్థములను పూర్తిగా గ్రహించుటకు సాధ్యముకాదు. మిక్కిలి ప్రాచీనమైన ఈ గరుడమంత్రము మనలను కాపాడునుగాక.

ఈ శ్లోకమున దేశికులు గరుడమంత్ర ప్రభావమును వర్ణించుచు, ఆ మంత్రము మనలను రక్షించుగాక అని ప్రార్థించుచున్నారు. **"మంతారం త్రాయతే ఇతి మంత్రః"** - (అనుసంధించువానిని రక్షించునది మంత్రము) అను వ్యుత్పత్తినికల మంత్రమును రక్షింపవలెనని ప్రార్థించుట సముచితమే కదా !

**(వేదః)** - గరుడుని వేదమయత్వము శ్రుతిప్రసిద్ధము. **"సుపర్ణోఽసి గరుత్మాన్, త్రివృత్తే శిరో గాయత్రం చక్షుః, తస్య గాయత్రీ చ జగతీ చ పక్షా వభవతామ్ ..."** ఇత్యాది శ్రుతులు, "వేదాత్మా **విహగేశ్వరః"** వంటి ఆచార్యసూక్తులును స్మరణీయములు. **"నేత్రం గాయత్ర మూచే"** ఇత్యాది శ్లోకమున (ఈస్తోత్రమునందలి 3వ శ్లోకమున) కవి ఈ అంశమును విస్తరించి పల్కుటయు అనుసంధేయము.

**(స్వార్థాధిరూఢః)** - వేదమయుడగు గరుత్మంతునిచే ప్రతిపాద్యమైన అర్థము లక్ష్మీనారాయణుడే. ఆ స్వామిచే గరుడుడు అధిరోహింపబడియున్నాడు. విష్ణురథుడను పేరు గరుడ స్వామికి ప్రసిద్ధమేకదా !

**(సాంకర్షణీ)** - గరుడుడు సంకర్షణాంశ అనుటకు గరుడదండకములోని - **"సంకర్షణాత్మన్ గరుత్మన్"** అను సూక్తి అనుసంధేయము. భారద్వాజ శ్రీనివాసాచార్యులవారు ఈ గరుడదండక ప్రయోగమును - **"సంకర్షణజాతత్వాత్ కార్యకారణయోః భేదోపచారః, ఉక్తం తు సాత్త్వతే - విష్ణోః సంకర్షణాఖ్యస్య విజ్ఞానబలశాలినః, మూర్తిం జ్ఞానబలాఖ్యాయాః సర్వాధారస్వరూపిణీ, మహిమేతి జగద్ధాతు ర్విజ్ఞేయో విహగేశ్వరః- ఇతి, స్వానందధామనిష్ఠస్య దేహస్య చతురాత్మనః, సంకర్షణాంశాత్ సంపూర్ణః విజ్ఞానబలసంకులాత్, అవతార్యామృతైః భోగైః - ఇతి చ"** - అని వ్యాఖ్యానించుటను ఇచట గమనింపనగును.



**(ప్రాణస్య అన్యం ప్రాణమ్)** ప్రాణశబ్దము అపానాది మిగిలిన నాల్గింటికిని ఉపలక్షణము. ఇచట **" స ప్రాణస్య ప్రాణః"** వంటి శ్రుతులు స్మరణీయములు. గరుడదండకమునందును - **"మరుత్పంచకాధీశసత్యాదిమూర్తే"** అని దేశికులు స్తుతించుట, దానిని వ్యాఖ్యానించుచు శ్రీనివాసాచార్యులవారు - **"ప్రాణాపానసమానోదానవ్యానాఖ్యస్య వాయోః క్రమాత్ సత్యసుపర్ణ గరుడతార్క్ష్యవిహగేశ్వరరూపః గరుడః అధిదైవత మితి తథోక్తిః. తథాచోక్తం శ్రీసాత్త్వతే - ప్రాణాపానసమానోదానవ్యానప్రాణరూపిణః, మధ్యస్థస్య ఖగేశస్య బహిః ప్రాగాదితః క్రమాత్, సత్య స్సుపర్ణో గరుడః తార్క్ష్య శ్చ విహగేశ్వరః" - ఇతి, "నమః ప్రాణాదివాయూనా మీశానాయ గరుత్మతే - ఇతి చ"** అని పల్కుట గమనార్హములు.

**(పరిచితగహనా)** - భట్టరు శ్రీ గుణరత్నకోశ ప్రారంభమున - **"పరిచిత మివాథాపి గహనమ్"** అను సూక్తిని ఈ ప్రయోగము తలపింపచేయుచున్నది. దేశికులపై భట్టరు సూక్తియొక్క ప్రభావమునకు ఇది ఒక చిన్న తార్కాణము.

**(సా)** - ఈ సర్వనామశబ్దము ప్రసిద్ధిద్యోతకము. కావున పాద్మసంహితాదులలో ప్రసిద్ధమగు గరుత్మంతుని మంత్రమని అర్థము. పాద్మసంహితలో - **"సిద్ధయ శ్చ యథాపూర్వం భవంతి జపతోఽఖిలాః, వశ్యాకర్షణవిద్వేషమారణోచ్చాటనాదిషు, శోషణస్తంభనావేశనర్వాకర్షణకర్మసు, నభోలంఘనవాయ్వగ్నిజలభూమిప్రవేశనే, ఇంద్రజాలాదివిద్యాసు ఋషీణాం విజయే తథా, దేవతాసన్నిధానాదౌ స్ఫోటముష్ట్యాదికర్మణి, ఏవమాదిషు సాధ్యేషు తథాన్యేష్వపి చ కర్మసు, ఇతి మంత్రం ప్రయుంజీత గరుత్మంత మనుస్మరన్"** అను వచనములు స్మరణీయములు

**(సాంకర్షణీ సా సిద్ధిః)** - గరుడమంత్రోపాసనచే గరుడాభిమానిదేవతయగు సంకర్షణునకు సంబంధించిన సిద్ధియు కల్గుననియు చెప్పవచ్చును. **"ఫలాని పూర్వ ముక్తాని వాక్సిద్ధిః మహతీ భవేత్, జ్ఞానం చ మహ దాప్నోతి యచ్చాన్య దపి కాంక్షితమ్"** అని, **"బహునా కిం ప్రలాసేన ద్విషట్కా క్షరవత్ ఫలమ్, సర్వ మాప్నోతి మనునా"** అనియు తెలుపబడిన సంకర్షణసంబంధమైన ఫలము లన్నియు గరుడమంత్రోపాసనచే సిద్ధించునని అర్థము.

**"బహి రభివ్యక్తిమ్"** అనుటకు దర్శనసమానాకారమైన మానసానుభవము అనియు అర్థమును చెప్పవచ్చును. ఇదియే కదా పరజ్ఞానము. ఈ శ్లోకమున **"బ్రహ్మవిద్యా"** అను ప్రయోగముచే భగవదుపాసనము ప్రతీతమగు చున్నది, తదనుగుణముగా శ్లోకమును ఈ క్రిందివిధముగా అన్వయింపనగును అని సంస్కృతవ్యాఖ్యాత వివరించిరి.

యస్యామ్ = ఏ బ్రహ్మవిద్యయందు, వేదః = వేదస్వరూపుడైన భగవానుడు, **(వేదో వేదవిదవ్యంగో** - అని విష్ణుసహస్రనామమున కలదు కదా), స్వార్థాధిరూఢః = తనయొక్క అర్థమగు (సొత్తు అగు ) వాహనరూపమైన గరుడుని అధిరోహించినవాడై, బహిరభివ్యక్తిమ్ = బయట, లోపల ప్రకాశమును,

అభ్యేతి = పొందుచున్నాడో, యయా = ఏ బ్రహ్మవిద్యచే, సాపవర్గత్రివర్గా సాంకర్షణీ సిద్ధిః = మోక్షముతో కూడిన త్రివర్గముల సాంకర్షణి సిద్ధి - అనగా వైష్ణవీసిద్ధి, పరిణమతి = ఫలించునో, యత్ర = ఏ బ్రహ్మవిద్యయందు, ప్రణిహితమనసః = నిలిపిన మనస్సునుకలవారగు యోగులు, ప్రాణస్య ప్రాణమ్ అన్యమ్ = ప్రాణమునకు వేరొక ప్రాణముగా - పరదైవతముగా, నిర్ధారయంతి = నిశ్చయించుచున్నారో, ప్రాచీ పరిచితగహనా = ప్రాచీనమైన, పరిచయమైనట్లున్నను పూర్ణముగా  తెలిసికొనసాధ్యముకాని, సా గారుత్మతీ బ్రహ్మవిద్యా = ఆ గరుడాధిపతి యగు విష్ణువునకు సంబంధించిన బ్రహ్మవిద్య, నః పాతు - మనలను రక్షించుగాక.

ఇచట ప్రకృతమగు గరుత్మంతుని పంచాక్షరీమంత్ర మహిమ, అట్లే అప్రకృతమగు బ్రహ్మవిద్య రెండును శ్లేషభంగిమలో వర్ణింపబడినవి కావున  - ప్రకృతాప్రకృత శ్లేషాలంకారముకలదు. గరుడపంచాక్షరికి బ్రహ్మవిద్యాత్వము కలదనుటను గరుడోపనిషత్తులోని ప్రారంభములోని - **"గరుడబ్రహ్మవిద్యాం ప్రవక్ష్యామి"** అను వాక్యము తెలుపుచున్నది.

**ప్రాచీ సా బ్రహ్మవిద్యా పరిచితగహనా పాతు గారుత్మతీ నః**

### వేదభాగములు గరుడునకు అంగములు

**3. నేత్రం గాయత్ర మూచే త్రివృ దితి చ శిరో నామధేయం యజూంషి**
**ఛ్ఛందాంస్యంగాని ధిష్ణ్యాత్మభి రజని శఫై ర్విగ్రహో వామదేవ్యమ్ ।**
**యస్య స్తోమాత్మనోఽసౌ బృహ దితరగరు త్తాదృశామ్నాతపుచ్ఛః**
**స్వాచ్ఛంద్యం నః ప్రసూతాం శ్రుతిశతశిఖరాభిష్టుతాత్మా గరుత్మాన్ ॥**

స్తోమ + ఆత్మనః = స్తోమమను సామవేదభాగమును ఆత్మగా కల్గినవాడగు, యస్య = ఏ గరుడునకు, గాయత్రమ్ =గాయత్రమను సామమును, నేత్రమ్ = నేత్రముగా, త్రివృత్ = త్రివృత్ అను సామమును, శిరః ఇతి చ = శిరస్సు అనియును, యజూంషి = యజుర్వేద మంత్రములను, నామధేయమ్ =  (గరుడుని) పేరుగను, ఛందాంసి= చందస్సులను, అంగాని = అవయవములుగా, ఊచే = (వేదము) పల్కినదో, శఫైః = గిట్టలతో, ధిష్ణ్య - ఆత్మభిః  = (అట్టి) ధిష్ణ్య అను స్థానములుగా, అజని = అగుటయో, వామదేవ్యమ్= వామదేవ్యమను సామము, విగ్రహః = శరీరమో, బృహత్= బృహత్ సామమును, ఇతర =వేరొక (రథంతరమను) సామమును, గరుత్ = ఱెక్కలుగాకల్గినవాడై, తాదృశ + ఆమ్నాత = ఇట్టి ఒక సామముగా చెప్పబడిన, పుచ్ఛః = పుచ్ఛభాగమును కల్గినవాడై, శ్రుతిశత = వందలకొలది వేదముల, శిఖర =అగ్ర భాగములగు వేదాంతములచే, అభిష్టుత =పొగడబడిన, ఆత్మా = స్వరూపమును కల్గిన వాడైయున్న, అసౌ = ఈ, గరుత్మాన్ =గరుడుడు, నః = మనకు, స్వాచ్ఛంద్యమ్ = స్వతంత్ర స్థితిని, ప్రసూతామ్ = అనుగ్రహించుగాక !



గరుడభగవానుని శరీరమందలి ప్రతిఒక్క అవయవము వేదభాగమై యున్నది అని సంస్కృతవ్యాఖ్య. స్తోమమను సామవేదభాగమే గరుడుని ఆత్మ. గాయత్ర మను సామము నేత్రము. త్రివృత్ అను సామము శిరస్సు. యజుర్వేదములోని మంత్రములు పేర్లు. వైదిక ఛందస్సులు చేతులు మొదలగు అంగములు. ధిష్ణ్యము అనునది (యజ్ఞములో కొందఱు ఋత్విక్కులు ఉండు స్థలములకు ఎదురుగా కట్టబడిన ఎత్తైన స్థలము) గరుడుని గిట్టలు. వామదేవ్యమను సామము విగ్రహము. బృహత్, రథంతరము అను సామములు ఱెక్కలు. యజ్ఞాయజ్ఞీయము అను సామము పుచ్ఛభాగము. ఈ వేదభాగములన్నియు ఇట్లు గరుడుని అవయవభాగము లనుటను వేదమే పల్కినది. వేదముల శిఖరభాగములగు వేదాంతములచే స్తుతింపబడిన కీర్తినికల గరుడుడు మనలను కర్మమునకు వశులమైన స్థితినుండి రక్షించి, ముక్తినిపొందు మార్గమును అనుగ్రహించునుగాక !

**(శ్రుతిశిఖరాభిష్టుతాత్మా)** - గరుడుడు అనేకములైన వేదాంతవాక్యములచే, పాంచరాత్రాది ఆగమవాక్యములచే పొగడబడిన స్వరూపమును కలవాడు. వాణీపాంచరాత్రములోని - **"మహోదార! మహబాహో ! వైనతేయ ! వయోధిప ! సన్నిధత్స్వ పటే తుభ్యం నమః ప్రణవమూర్తయే, యదాధారం జగత్సర్వం తదాధారాయ తే నమః. పక్షౌ యస్య బృహత్సామ రథంతర మపి ద్వయమ్, అక్షిణీ చాపి గాయత్రం త్రివృత్ సామ శిరః స్మృతమ్, స్తోమ ఆత్మా నమ స్తస్మై వామదేవ్యంగసంపదే, ఛందోమయయజుర్నామ్నే ధిష్ణ్యాత్మకపదే పదే, భూయో భూయో నమ స్తుభ్యం వేదానాం నిధయే పరమ్"** అనుసూక్తులు, తైత్తిరీయములోని - **యశ్ఛందసా మృషభో విశ్వరూపః, ఛందోభ్యోఽధ్యమృతా త్సంబభూవ, స మేంద్రో మేధయా స్పృణోతు, అమృతస్య దేవ ధారణో భూయాసమ్"** అను వాక్యములును స్మరణీయములు.

**'స్తోమ'** మనగా స్తుతిరూపమైన సామము. **"స్వాచ్ఛంద్యం ప్రసూతామ్"** అనుటకు వేదాత్మకుడగు గరుడభగవానుడు స్వపదవాసిత్వమును అనుగ్రహించునుగాక అనియు, అకర్మవశ్యత్వమును అనుగ్రహించునుగాక అనియు అర్థములను చెప్పవచ్చును. ముందు శ్లోకమున **"వేదః"** అని ప్రస్తావింపబడిన గరుడుని వేదస్వరూపత్వము ఇందు విస్తరముగా నిరూపింపబడుట విశేషము.

**స్వాచ్ఛంద్యం నః ప్రసూతామ్ శ్రుతిశతశిఖరాభిష్టుతాత్మా గరుత్మాన్**

### భగవానునకు గరుడునకు అభేదము

**4. యో యం ధత్తే స్వనిష్ఠం వహన మపి వరః స్పర్శితో యేన యస్మై**
**యస్మా ద్యస్యాహవశ్రీః విదధతి భజనం యత్ర యత్రేతి సంతః ।**

**ప్రాయో దేవ స్స ఇత్థం హరిగరుడభిదా కల్పితారోహవాహ-**
**స్వాభావ్యః స్వాత్మభవ్యః ప్రదిశతు శకునిః బ్రహ్మసబ్రహ్మతాం నః ॥**

గరుడుని పక్షమున అర్థము -

యః = ఏ గరుడుడు, యమ్ = ఏ భగవానుని, ధత్తే = ధరించుచున్నాడో, యేన = ఏ గరుడునిచే, యస్మై = ఏ భగవానునికొఱకు, స్వనిష్ఠమ్= తనయందున్న, వహనమ్= మోయుట అను, వరః అపి =వరమును కూడా, స్పర్శితః =ఇవ్వబడినదో, యస్మాత్ = ఏ గరుడునివలన, యస్య = ఏ భగవానునకు, ఆహవశ్రీః = యుద్ధమునందు జయలక్ష్మి (కల్గుచున్నదో),

భగవానుని పక్షమున అర్థము -

యః = ఏభగవానుడు, యమ్ = ఏ గరుడుని, ధత్తే =(ధ్వజముగా) ధరించుచున్నాడో, యేన = ఏ భగవానునిచే, యస్మై = ఏ గరుడుని కొఱకు, స్వనిష్ఠమ్ = తనకుచెందిన, వహనమ్ = మోయుట అను, వరః అపి = వరముకూడ, స్పర్శితః = అనుగ్రహింపబడినదో, యస్మాత్ = ఏ భగవానునివలన, యస్య = ఏ గరుడునకు, ఆహవశ్రీః = యుద్ధమునందు జయలక్ష్మి (కలుగుచున్నదో)

ఇరువురి పక్షమున (శ్లోకములోని మిగిలిన భాగము)

సంతః = సత్పురుషులు, యత్ర = ఏ గరుడుని యందు, యత్ర =ఏ భగవానుని యందు, భజనమ్ = భక్తిని, విదధతి = చేయుచున్నారో, ప్రాయః =తఱచుగా, ఇతి = ఈ కారణముచే, ఇత్థమ్ = ఇట్లు, హరిగరుడభిదా = భగవానుడు- గరుడుడు అను భేదముతో, కల్పిత =కల్పింపబడిన, ఆరోహ= అధిరోహించుట, వాహ =మోయుట అను, స్వాభావ్యః = స్వభావమును కల్గినవాడై, స్వ+ఆత్మభవ్యః = తానుగానేయున్న భగవానునకు లోబడియున్నవాడై (భవ్యుడై), శకునిః = పక్షిరూపములోనున్న, సః =ఆ, దేవః = గరుడదేవుడు, నః= మనకు, బ్రహ్మసబ్రహ్మతామ్ = బ్రహ్మసామీప్యమును, ప్రదిశతు = అనుగ్రహించుగాక !

ఈ శ్లోకమున దేశికులు భగవానునకు, గరుడునకును అభేదమును తెలుపుచున్నారు. గరుడుడు పూర్వము అమృతమును భూమికి తీసికొనివచ్చునపుడు భగవానునకు గరుడునకు మధ్య పోరాటము జరిగెను. అందు గరుడుడు విజయుడయ్యెను. గరుడుని గొప్పశక్తిని చూచిన స్వామి అతనిని మెచ్చి, అతనిని ఏదైన వరమును కోరుకొనమనెను. గరుడుడు స్వామితో "నీవే నా వలన ఏదైన వరమును గ్రహింపుము'' అని పలుకగా, భగవానుడు "నీవు నాకు వాహన మగుదువు గాక !'' అని పల్కెను. గరుడుడును అందులకు అంగీకరించి, అప్పటినుండి భగవానునకు వాహన మయ్యెను. వేరొక సమయమున భగవానుడు గరుడుని తనధ్వజముగా పరిగ్రహించిన వరమును అతనికి అనుగ్రహించెను. ఇట్లు భగవానునకును గరుడుడు వాహనముగా, ధ్వజముగా నుండుటచే, భగవానుడు



ఎవరితో పోరాడినను జయము అతనికే సిద్ధించుచున్నది. భగవానుడు గరుడుని వాహనముగా, ధ్వజముగా గ్రహించి, అతనిని సహాయకునిగా గొనుటచే స్వామికి ఏ యుద్ధమందైనను జయలక్ష్మి కల్గుచున్నది. ఇట్లు భగవానుడు స్వామియై, గరుడుడు దాసుడై యుండి, ఒకరు అధిరోహించినను ఇంకొకరు మోయుచున్నను, విజ్ఞులైన పెద్దలు ఈ ఇద్దఱిని వేరుగా తలపక, ఎట్టి హెచ్చుతగ్గులును వారిమధ్య లేవని, వాహ్య-వాహకరూపమైన భేదము వారిచే కల్పితమని భావించి, ఇద్దఱిని సమముగా తలచి ఆశ్రయించుచున్నారు. మఱియు, భగవానుడే గరుడునిగా అవతరించినట్లు, విష్ణువు-గరుడుడను వేరొక నామమును కల్గి, తనకు తానే అణగియున్నట్లును భారతమున కలదు. పరబ్రహ్మమును చేరి, నిత్యము కైంకర్యమును చేయుట అను మోక్షము పొందుటకు ఇట్టి పక్షిప్రభువు దారిచూపును గాక !

శ్లోకమున పూర్వార్ధములోని **"యత్ర యత్ర"** అను రెండు యచ్ఛబ్దములు ఉత్తరార్ధమున గల **"సః"** అను ఒకే తచ్ఛబ్దముతో సమన్వయించుటచే భగవానునకు గరుడునకు మధ్య అభేదము సిద్ధించుచున్నది. పూర్వశ్లోకములోవలె ఇందును శ్లేషాలంకారము కలదు. గరుడుడు భగవానునకు వాహనమగు వృత్తాంతము భారతమున ఆదిపర్వములో కలదు. **"ప్రతిగృహ్య వరౌ తౌ చ గరుడో విష్ణు మబ్రవీత్, భవతేఽపి వరం దద్యాం వృణీతాం భగవా నపి, తం వవ్రే వాహనం విష్ణుః గరుత్మంతం మహాబలమ్ . . .స తథేత్యబ్రవీత్ పక్షీః భగవంతం సనాతనమ్"** అను అచటి శ్లోకములు ఈ వృత్తాంతమును తెలుపుచున్నవి. ఈ వృత్తాంతమే శాంతిపర్వమునను, ఆనుశాసనికపర్వమునను కలదు. శాంతిపర్వమునగల **"అద్య పశ్యతి పక్షీంద్ర వాహనం భవ మే సదా, వృణేఽహం వర మేత ద్ధి, త్వత్తోఽద్య పతగేశ్వర, తథేతి తం వీక్ష్య"** - ఇత్యాదివాక్యములు, ఆనుశాసనిక పర్వములోని - **"ఏవ మేత న్మహాబాహో సర్వ మేతత్ భవిష్యతి, వాహనం తే భవిష్యామి యథా వదతి మాం భవాన్"** అను వాక్యములును ఈ వృత్తాంతమును వర్ణించుచున్నవి.

భగవానునకు గరుడునివలన జయలక్ష్మి ప్రాప్తించిన వృత్తాంతములు అనేకములు. భగవానుడు మాల్యవంతునితో పోరాడినపుడు, గరుడుడు తనఱెక్కలగాలితో అతనిని దూరముగా కొట్టుకొను పోవునట్లు చేసెనని ఉత్తరరామాయణమున కలదు. **"ఆహత్య రాక్షసో విష్ణుం గరుడం చాప్యతాడయత్, వైనతేయ స్తతః క్రుద్ధః పక్షవాతేన రాక్షసమ్, వ్యపోహత్ బలవాన్ వాయుః శుష్కపర్ణచయం యథా, ద్విజేంద్రపక్షవాతేన ద్రావితం దృశ్యపూర్వజమ్, సమాలీ స్వబలై స్సార్ధం లంకా మభిముఖో యయౌ, పక్షవాతబలోద్ధూతో మాల్యవా నపి రాక్షసః, స్వబలేన సమాగమ్య యయౌ లంకాం హ్రియా వృతః"** అను అచటి శ్లోకములు ఈ కథను తెలుపుచున్నవి. అట్లే, రామలక్ష్మణులు ఇంద్రజిత్తుతో యుద్ధము చేయునపుడు నాగపాశములతో బంధింపబడగా, గరుడుడు యుద్ధరంగమునకు వచ్చి, తన చేతులతో వారిని స్పృశించి, సేదదీర్చి, నాగపాశముల నుండి విముక్తులను చేసెను అను వృత్తాంతము యుద్ధకాండములోని **"తత్ ముహూర్తాత్ గరుడం వైనతేయం మహాబలమ్, వానరా**

**దదృశు స్సర్వే జ్వలంతమివ పావకమ్, త మాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః, యై స్తౌ సత్పురుషౌ బద్ధౌ శరభూతై ర్మహాబలౌ, తత స్సుపర్ణః కాకుత్స్థౌ దృష్ట్వా ప్రత్యభినందితః, విమృశ్య చ పాణిభ్యాం ముఖే చంద్ర సమప్రభే, వైనతేయేన సంస్పృష్టౌ తయోః సంరురుహుః వ్రణాః, సువర్ణే చ తనూస్నిగ్ధే తయో రాశు బభూవతుః, తేజో వీర్యం బలం చోజో ఉత్సాహ శ్చ మహాగుణః, ప్రదర్శనం చ బుద్ధి శ్చ స్మృతి శ్చ ద్విగుణం తయోః"** ఇత్యాదిగా కల శ్లోకములు తెలుపుచున్నవి.

భగవానుడు గరుడుని తన ధ్వజముగా స్వీకరించు వరమును ఇచ్చిన వృత్తాంతము మహాభారతమున ఆదిపర్వమున, శాంతిపర్వమున, ఆనుశాసనికపర్వమునను కలదు. ఆదిపర్వములో- **"విష్ణునా తు తదాకాశే వైనతేయ స్సమేయివాన్, తస్య నారాయణ స్తుష్టః తదా తుల్యేన కర్మణా, త మువాచావ్యయో దేవో వరదోఽస్మీతి ఖేచరమ్, స వవ్రే తవ తిష్ఠేయ ముపరీత్యంతరిక్షతః . . .ఏవ మస్త్వితి తం విష్ణు రువాచ వినతాసుతమ్"** ఇత్యాదిగా ఈ కథ ప్రస్తావించబడినది. శాంతిపర్వమునందు, ఆనుశాసనికపర్వమందును గల శ్లోకవివరములు సంస్కృతటిప్పణిలో ఇట్లు చూపబడినవి. **"త్వత్తోఽప్యహం వృణే త్వద్య వరమ్ ఋషివరోత్తమ, తవోపరిష్టాత్ స్థాస్యామి వర మేతత్ ప్రయచ్ఛ మే, తథేతి చ హసమ్ ప్రాహః హరిః నారాయణః ప్రభుః, ధ్వజం చ మే భవ సదా త్వ మేవ విహగేశ్వర, ఉపరిష్టాత్ స్థితి స్తేఽస్తు మమ పక్షీంద్ర సర్వదా, ఇత్యుక్త్వా భగవాన్ దేవః శంఖచక్రగదాధరః", "ధ్వజ స్తేఽహం భవిష్యామి రథస్థస్య న సంశయః, తథాఽస్త్వితి స మా ముక్తః".**

గరుడునకు భగవానునకుమధ్యగల అభేదము మహాభారతములో ఆనుశాసనిక పర్వమున తెలుపబడినది. **"త్వం హి శౌరే మహాబాహో సుపర్ణః ప్రోచ్యసే పురా, అనాదినిధనే కాలే గరుడ శ్చాసి కేశవ", "జనిష్యతి హృషీకేశః స్వయ మేవైష పక్షిరాట్, కేశవః పుండరీకాక్షః శూరపుత్రస్య వేశ్మని, స్వయం ధర్మస్య రక్షార్థం విభజ్య భుజగాశనః"** అను అచటి శ్లోకములు ఈ అంశమును తెలుపుచున్నది. శ్లోకమున **"స్వాత్మభవ్యః"** అనుటకు తనయందు ఆత్మభరన్యాసమును చేసిన - అనగా ప్రపన్నులైన వారికి భవ్యుడనియు అర్థమును చెప్పవచ్చును అని టిప్పణీలోని వివరణము.

**స్వాభావ్యః స్వాత్మభవ్యః ప్రదిశతు శకునిః బ్రహ్మసబ్రహ్మతాం నః**

**భగవానుడు - గరుడభగవానుల మధ్య సామ్యము**

**5.** **ఏకో విష్ణోః ద్వితీయ స్త్రిచతురవిదితం పంచవర్ణీరహస్యం**
**షాడ్గుణ్యస్మేరసప్తస్వరగతి రణిమాద్యష్టసంపన్నవాత్మా ।**
**దేవో దర్వీకరారి ర్దశశతనయనారాతిసాహస్రలక్షే**
**విక్రీడత్పక్షకోటి ర్విఘటయతు భయం వీతసంఖ్యోదయో నః ॥**

ఏకః = అద్వితీయుడై,(ముఖ్యుడై) విష్ణోః = విష్ణువుయొక్క, ద్వితీయః =రెండవమూర్తియై, త్రిచతుర



= నారదుడు మొదలగు ముగ్గురు, లేక నల్గురిచేతనే, విదితమ్ = తెలిసినకొన బడినదగు, పంచవర్ణీ = అయిదువర్ణములను కల్గిన, గరుడమంత్రముయొక్క, రహస్యమ్ = రహస్యార్థమై, షాడ్గుణ్య = జ్ఞానాది ఆఱు గుణములచే, స్మేర = ప్రకాశించువాడై, సప్తస్వర = ఏడుస్వరములను కల్గిన సామవేదమునకు, గతిః = గతియై, (నిలయమై), అణిమా + ఆది = అణిమ మొదలగు, అష్టసంపత్ = అష్టైశ్వర్యములనుకలవాడై, నవ + ఆత్మా = ఎల్లప్పుడు నూతనముగాతోచు విగ్రహమును కలవాడై, దశశతనయన = వేయినేత్రములను కల్గిన ఇంద్రునియొక్క, అరాతిసాహస్ర = వేలాది శత్రువులగు, లక్షే = లక్ష్యమందు, విక్రీడత్ = విశేషముగా క్రీడించునట్టి, పక్షకోటిః = ఱెక్కల మొనలను కల్గినవాడై, వీతసంఖ్యా + ఉదయః = లెక్కలేని అవతారములను కలవాడై, దర్వీకర + అరిః = సర్పములకు శత్రువైన, దేవః = గరుడదేవుడు, నః = మనయొక్క, భయమ్ = భయమును, విఘటయతు = నశింపచేయును గాక!

గరుడభగవానుడు అద్వితీయవైభవమును కలవాడు. ఇతడు భగవానుని రెండవ వ్యూహరూపమగు సంకర్షణమూర్తియొక్క అంశ. అయిదువర్ణములనుకల్గిన గరుడ మంత్రముయొక్క రహస్యమును ఈ ప్రపంచమున ముగ్గురో లేక నలుగురో మాత్రమే తెలియగలరు. ఆ మంత్రముయొక్క ముఖ్యప్రతిపాద్యార్థముగా గరుడభగవానుడు వెలుగుచున్నాడు. అతడు జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అను ఆఱుగుణములను కలవాడు. ఏడు స్వరములనుకల సామవేదమునకు ప్రతిరూపము. అణిమ మొదలగు ఎనిమిది సిద్ధులను కలవాడు. **"క్షణే క్షణే యన్నవతా ముపైతి తదేవ రూపం రమణీయతాయాః"** అనునట్లు ఎప్పటికప్పుడు నిత్యనూతనముగా తోచు రమణీయమైన దివ్యరూపమును కలవాడు. ఇంద్రుడు మొదలగు దేవతలకు శత్రువులగు వేలాదిరాక్షసులను తన ఱెక్కల మొనలతో అవలీలగా జయించువాడు. భక్తులను కాపాడుటకై అపుడపుడు గరుడుడు ఎత్తిన అవతారములు లెక్కలేనివి. సర్పములకు సహజశత్రువైన ఈ గరుడ భగవానుడు మనకు సంసారబంధమువలన కల్గు భయమును తీర్చును గాక !

పూర్వశ్లోకమున గరుడునకు భగవానునకు మధ్య అభేదమును ప్రతిపాదించిన దేశికులు ఇందు సామ్యమును తెలుపుచున్నారు.

**(విష్ణోః ద్వితీయః)** - గరుడుడు విష్ణువుయొక్క రెండవమూర్తి. పరత్వాది పంచకములలో వ్యూహము రెండవది. వ్యూహమూర్తులు నాల్గింటిలో సంకర్షణరూపము రెండవది. గరుడుడు సంకర్షణాత్మకుడు అనుట రెండవశ్లోక వ్యాఖ్యలో వివరింపబడినది.

**(త్రిచతురవిదితః)** - నారదాదిమహనీయులు ముగ్గురు నల్గురిచే అని భావము. చతురశబ్దమునకు కుశలుడని అర్థమును చెప్పి, త్రియుగ్మగుణకథన నిపుణులచే తెలియబడిన వాడనియు, లేక బ్రహ్మేచ్యుత శంకరులచే తెలియబడినవాడనియు చెప్పవచ్చును. **"త్రిభిః మూర్తిభిః**

**చతురైః నారదాది ప్రవీణైః వా విదితం, త్రియుగ్మగుణకథన నిపుణైః విదితం జ్ఞాతం వా, త్రిభిః బ్రహ్మేచ్యుతశంకరైః చతురం ప్రగల్భం యథా తథా విదితం వా"** అని సంస్కృతవ్యాఖ్య.

**(షాడ్గుణ్యస్మేరసప్తస్వరగతిః)** - షాడ్గుణ్యవికాసమునకు, సప్తస్వరములకును గతి, అనగా రీతి అని సంస్కృతవ్యాఖ్య. నిషాదము, ఋషభము, గాంధారము, షడ్జము, మధ్యమము, దైవతము, పంచమము అని రాగములు ఏడు. ఈ రాగముల స్వరూపమును తెలుపు అమరకోశసుధవ్యాఖ్యలో ఉట్టంకింపబడిన నారదుని వచనములు ఇట్లున్నవి - **"షడ్జం రౌతి మయూర స్తు గావో నర్దంతి చార్షభమ్, అజావికౌ చ గాంధారం క్రౌంచో నదతి మధ్యమమ్, పుష్పసాధారణే కాలే కోకిలో రౌతి పంచమమ్, అశ్వ స్తు దైవతం రౌతి నిషాదం రౌతి కుంజరః"**

**(పంచవర్ణీరహస్యమ్)** - **"ఓం క్షిప స్వాహా"** ఇత్యాదిగా గల పంచవర్ణాత్మకమంత్ర ప్రతిపాద్యుడు గరుడుడు.

**(అణిమాద్యష్టసంపత్)** - అణిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి అష్టసంపదలు. అణిమ అనగా అణువంత చిన్నగా మారుట. మహిమ అనగా చాలపెద్దగా అగుట. లఘిమ అనగా తేలికగా అగుట, గరిమ అనగా చాలా బరువుగా అగుట. ప్రాప్తి అనగా తలచినది పొందగల్గుట. ప్రాకామ్యమనగా తలచిన చోటికి చేరగల్గుట. ఈశిత్వము అనగా అందరిని ఏల గల్గుట. వశిత్వము అనగా అందఱిని లోబరుచుకొనగల్గుట. వీనికే అష్టసిద్ధులనియుపేరు.

**(నవాత్మా)** - **"అప్పొళుదైక్కప్పొళుదు ఎన్నారా వముదమే"** అనునట్లు ఎప్పటికప్పుడు కొత్తగాతోచు రమణీయ రూపమును కలవాడు. గరుడ దండకములోని అక్షరముల, గణముల సంఖ్య తొమ్మిదిగా అమరుట, గరుడ గాయత్రీవర్ణములకు నవసంఖ్యతో సంబంధముండుట (**"ఓమ్ తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి తన్నో గరుడః ప్రచోదయాత్"** అను గరుడ గాయత్రిలోని వర్ణముల సంఖ్య 27. ఈ సంఖ్యలోని అంకెలను కలుపగా వచ్చు అంకె 9.) ఇత్యాది విశేషము లిచట స్మరణీయములు. **"నవాత్మా"** అనుటకు **"సుపర్ణోఽసి గరుత్మాన్"** అను శ్రుతి యందుతెలుపబడిన తొమ్మిది అవయవములను కలవాడు అనియు అర్థమును చెప్పవచ్చును అని టిప్పణీ వివరణము. **"అరాతిసాహస్రలక్ష్మే"** అనునపుడు శత్రువుల సహస్రములు అనబడు లక్ష్యములో అని, శత్రువుల వేలయొక్క లక్షలలో, అనగా అసంఖ్యాకులైన శత్రువులలో అనియు అర్థము. **"దశశతనయనః ఇంద్రః, అరాతిసాహస్రం - తదితరదేవాదిశత్రుసమూహః, తావేవ లక్ష్మే శరవ్యే, దశశతనయనస్య అరాతీనాం దైత్యదానవాదీనాం సాహస్ర ఏవ లక్ష్మే వా"** అని టిప్పణీ వివరణము. **"సాహస్రలక్ష్మః"** అని పాఠాంతరము కలదు.

ఈ శ్లోకమున ఒకటి మొదలు పదివరకు గల సంఖ్యలపేర్లు, అట్లే శత, సహస్ర, లక్ష, కోటి సంఖ్యలపేర్లు, చివరగా వీతసంఖ్య మనుచు అసంఖ్యాత్వమును వచ్చునట్లు రచించుట కవియొక్క అనితరసాధారణమైన రచనా ప్రాగల్భ్యమును చాటుచున్నది. **"ఏకం లోకస్య చక్షుః"** ఇత్యాది శ్రీసుదర్శన



శతక శ్లోకమును, **"ఏకం జ్యోతిః దృశౌ ద్వే"** ఇత్యాది సూర్యశతకశ్లోకమును అనుసరించి కవి ఈ శ్లోకమును రచించిరనుట స్పష్టము. ఈ శ్లోకమునందలి భావము రాబోవు **"రుంధ్యాత్సంవర్తసంధ్యాఘనపటకనత్పక్షవిక్షేపహేలావాతూలాస్ఫాలతూలాంచలనిచయతులాధేయ దైతేయలోకః"** అను శ్లోకములో అనుసంధింపబడినది. మహాభారతము ఉద్యోగపర్వములో కూడ (89వ అధ్యాయములో) ఈ అంశము **"మయాపి సుమహత్కర్మ కృతం దైతేయ విగ్రహే, శ్రుతశ్రీః శ్రుతసేనశ్చ వివస్వాన్ రోచనముఖః, ప్రసహ్య కాలకేయా శ్చ మయాపి దితిజా హతాః"** అని తెలుపబడుటను గమనింపవచ్చును.

ఈ శ్లోకమును విష్ణుపరముగాకూడ ఇట్లు అన్వయింపనగును.

ఏకః = లోకైకనాథుడు, విష్ణోః = విష్ణుశబ్దమువలన, ద్వితీయః = రెండవపేరును కలవాడు (విష్ణుసహస్రనామములో విశ్వశబ్దమునకు పిమ్మట విష్ణుః అని కలదు కదా !), త్రిచతురవిదితః = త్రిగుణాతీతులగు చతురులచే తెలియబడినవాడు. (లేక) మూడిటియందు - అనగా అకార ఉకార మకారములను అక్షరములందు - అనగా - ప్రణవమందు చతురులగు వారిచే తెలిసికొనబడిన వాడు, లేక, (**"మూన్ఱెళుత్తుడైయ పేరాల్"** అనునట్లు) అచ్యుతాది త్రివర్ణయుక్తభగవన్నామస్మరణ నిపుణులచే తెలియబడినవాడు, పంచవర్ణీరహస్యమ్ = పర -వ్యూహ విభవ- అంతర్యామి - అర్చారూపములను అయిదు రూపముల రహస్యార్థమైన వాడు, షాడ్గుణ్యస్మేర = షాడ్గుణ్యముచే ప్రకాశించువాడు, సప్తస్వరగతిః = ఏడుస్వరములకు గతి, అణిమాద్యష్టసంపత్ = అణిమాది ఎనిమిది సంపదలను కలవాడు, నవాత్మా = నిత్యనూతనమైనరూపమును కలవాడు, దర్వీకరారిః = సర్పమగు కాళియునకు శత్రువు, దశశతనయనారాతిసాహస్రలక్ష్మే విక్రీడత్పక్షకోటిః = ఇంద్రుని శత్రువులగు అసురుల సహస్రములను లక్ష్యములందు క్రీడించునట్టి తన పక్షములోని- అనగా సహాయముగానున్న బలములోని ఏకదేశమును కలవాడు, వీతసంఖ్యోదయః = లెక్కకు మించిన గుణముల ఉదయమును కలవాడు, అగు దేవః = నారాయణుడు, నః భయమ్ విఘటయతు = మన భయమును పోగొట్టుగాక!

ఇట్లు శ్లేషాలంకార పద్ధతిలో గరుడునకు, భగవానునకుమధ్య సామ్యము ఇందు నిర్వహింపబడినది. **"సుపర్ణోఽసీతి శ్రుత్యుక్తనవావయవశరీరః"** అని అచటి వాక్యము.

**దేవో దర్వీకరారిః విక్రీడత్పక్షకోటి ర్విఘటయతు భయం వీతసంఖ్యోదయో నః**

## గరుడుని అవతారములు - నామములు

6. **సత్యాద్యైః సాత్త్వతాదిప్రథితమహిమభిః పంచభిః వ్యూహభేదైః**
**పంచాభిఖ్యో నిరుంధన్ భవగరళభవం ప్రాణినాం పంచభావమ్ ।**
**ప్రాణాపానాదిభేదాత్ ప్రతితనుమరుతో దైవతం పంచవృత్తేః**
**పంచాత్మా పంచధాఽసౌ పురుష ఉపనిషద్ఘోషిత స్తోషయే న్నః ॥**

సాత్త్వత + ఆది = సాత్త్వతసంహిత మొదలగు వానియందు, ప్రథిత = పొగడబడిన, మహిమభిః = గొప్పతనమును కల్గిన, సత్య+ఆద్యైః = సత్య, సుపర్ణ, గరుడ, తార్క్ష్య, విహగేశ్వరులను, పంచభిః = అయిదు, వ్యూహభేదైః = వ్యూహప్రకారములచే, పంచ+అభిఖ్యః = అయిదు పేర్లను కల్గినవాడై, ప్రాణినామ్ = జీవుల, భవగవరళభవమ్ = సంసారమను విషమువలన పుట్టిన, పంచభావమ్ = మరణమును, నిరుంధన్ =అడ్డగించువాడై, ప్రతితను = ప్రతిదేహమునందు, ప్రాణ+అపానభేదాత్ = ప్రాణము, అపానము మొదలగు రూపమువలన, పంచవృత్తేః = అయిదు విధములైన వృత్తులను కల, మరుతః = వాయువునకు, పంచ + ఆత్మా = అయిదు స్వరూపములను కల, దైవతమ్ =దేవతగా నున్నవాడై, పంచధా= (ఇట్లు) అయిదు ప్రకారములుగా, ఉపనిషత్ ఘోషితః = ఉపనిషత్తులయందు కీర్తింపబడిన, అసౌ = ఈ, పురుషః = పురుషరూపమునుకల గరుడుడు, నః = మనలను, తోషయేత్ = సంతోషింపచేయునుగాక !

పాంచరాత్రశాస్త్రము సాత్త్వతసంహిత, పాద్మసంహిత, నారాయణసంహిత, విష్వక్సేనసంహిత అను మొదలగు పలుసంహితల రూపములో నున్నది. అవి అన్నియు గరుడుని అయిదు అవతారములనుగూర్చి తెలిపినవి, సత్య, సుపర్ణ, గరుడ, తార్క్ష్య, విహగేశ్వరులను అయిదు పేర్లను కల్గినవానినిగా పల్కి, ఆమూర్తుల గొప్పతనమును వర్ణించినవి. ప్రతిశరీరమునందు వేర్వేరు పనులను కల్గిన ప్రాణము - అపానము - వ్యానము - ఉదానము - సమానము అను అయిదు వాయువులకును క్రమముగా పైన తెలిసిన మూర్తులను ప్రాణములుగా పైన పేర్కొన్న సంహితలు తెలిపినవి. ఉపనిషత్తులు కూడ గరుడభగవానుని ముందు తెలియజేసిన అయిదుమూర్తులను కల్గినవానినిగా ఘోషించుచున్నవి. ఆ గరుడుడు ప్రాణులకు సంసారబంధమను విషముచే కల్గు మరణ భయమును తీర్చును. ఇట్టి మహిమనుకల గరుడుడు మనలను సంతోషింపచేయునుగాక !

ఈ శ్లోకము శ్లేషభంగిలో రచింపబడుటచే భగవానునికూడ వర్ణించుచున్నదని వ్యాఖ్యాతలు తెలిపిరి. భగవానుని పక్షమున ఇట్లు అర్థమును చెప్పనగును.

సాత్త్వతాదిప్రథితమహిమభిః =సాత్త్వతము మొదలగు పాంచరాత్రసంహితలలో , పురాణ ఇతిహాసములలో పొగడబడిన మహిమనుకల, సత్యాద్యైః = పరమసత్త్వగుణమగు సత్యము మొదలగు గుణములను కల్గిన , పంచభిః వ్యూహభేదైః = (పర-వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చ అను) అయిదు వ్యూహభేదములతో, పంచాభిఖ్యః = పరవ్యూహాది అయిదు పేర్లను కలవాడై, ప్రాణినాం భవగరళభవం పంచభావం నిరుంధన్ - జీవులకు సంసారమను విషమువలన కల్గు మరణమును పోగొట్టువాడై, ప్రతితను ప్రాణాపానాదిభేదాత్ పంచవృత్తేః = ప్రతిశరీరమందు ప్రాణాపానాదిభేదములతో అయిదు వృత్తులనుకల, మరుతః= వాయువునకు, దైవతమ్ = అధిదైవము, పంచ+ఆత్మా = పరవ్యూహాదిరూపములతో అయిదు అవతారములను కలవాడై, పంచధా ఉపనిషత్



ఘోషితః = పరవ్యూహాది, అయిదు భేదములతో ఉపనిషత్తులయందు కీర్తింపబడిన వాడు అగు, అసౌ పురుషః నః తోషయేత్ = ఈ పురుషోత్తముడు మనలను సంతోషింపచేయునుగాక !

**(సత్యాద్యైః)** - గరుడుని పక్షమున సత్య -సుపర్ణ- గరుడ - తార్క్ష్య - విహగేశ్వరులను అర్థము. భగవానుని పక్షమున సత్త్వగుణమును ప్రధానముగా కల్గిన అని అర్థము. వేదమును **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అనుచు సత్యగుణమును ముందుగా పేర్కొనది. ఈ సందర్భమున సాత్త్వత సంహిత ద్వాదశపరిచ్ఛేదములోగల **"సత్య స్సుపర్ణో గరుడః తార్క్ష్యశ్చ విహగేశ్వరః, పంచాత్మకస్య ప్రాణస్య వికార స్తేన పంచధా, ఆచాంఘ్రిగోచరా స్సర్వే యస్య దేహ స్తు పౌరుషః,. ద్విభుజ స్తుహినాభశ్చ స సత్యః ప్రాణదేవతమ్, సుపర్ణః పద్మనాగాభో నిర్మలః స్వర్ణలోచనః, గరుడః కాంచనాభ స్తు కుటిల భ్రూ+అరుణేక్షణః, కేకరాక్ష స్తు తార్క్ష్యో వై ప్రావృట్జలదసన్నిభః, ద్రవత్ కనకనేత్ర స్తు శబళాభశ్చ పంచమః, చతుర్భుజాః సుపర్ణాద్యాః సౌమ్యరూపా స్వనాకులాః, పతత్రిచరణా స్సర్వే పక్షమండలమండితాః, లంబోదరా స్తు పీనాంగాః కుండలాద్యై స్సుభూషితాః, కుటిలభ్రూసువృత్తాక్షాః పత్రతుండా స్సితాననాః, అపానాదిసమీరాణా మాధిపత్యేన సంస్థితాః"** అను శ్లోకములను, ఈశ్వరసంహితలో అష్టామాధ్యాయములోగల **"మహాబలా మహాకాయా రక్తతుండోఽత్ర పంచమః , స్వస్యాంగుష్ఠద్వయస్రోత గణిత్రోభయపాణినా, పుష్పాంజలిధరా స్సర్వే ముఖ్యేన విహగోత్తమాః, సుపర్ణః పశ్చిమాభ్యాం తు పాణిభ్యాం దక్షిణాదితః, . . . నిత్యోదితస్య వ్యూహస్య తదా శాంతోదితస్య చ, ప్రాణాపానాదివాయూనా మీశానాయ గరుత్మతే"** అను శ్లోకములును ఆ సంహితలోనే దశమాధ్యాయములో గల **"నమః ప్రాణాదివాయూనా మీశానాయ గరుత్మతే"** అనుమొదలగు వచనములును, పారమేశ్వరసంహితలో గల ఏతత్ సదృశ వచనములును, పాద్మసంహితలో చర్యాపాదములో నున్న **"నమః ప్రాణాదివాయూనామ్"** ఇత్యాది వచనములును అనుసంధేయములు అని టిప్పణీ వివరణము.

**(పంచధా ఉపనిషత్ఘోషితః)** - ఈ విశేషణమును వివరించుచు సంస్కృతవ్యాఖ్యాత **"శ్రీపాంచరాత్రవేదాంతైః స్తుతః. యథా వా, 'సత్య స్సుపర్ణో గరుడ స్తార్క్ష్య స్తు చతురాత్మకః, పంచరూప స్తు చత్వారో విహగేశ్వర సంయుతాః', 'సత్యమూర్తే నమస్తేఽస్తు జన్మభీతినివారణ, మహాబలాయ దేవానా మధిపాయ ఖగేశ్వర', 'ఓం నమో భగవతే అష్టకులనాగభూషణాయ వైనతేయాయ నాగశోణిత దిగ్ధాంగాయ సుపర్ణాయ సప్తపాతాళవాసినే పక్షిరాజాయ భగవద్వాహనాయ, బ్రహ్మాదివిదితచతురక్షరాయ యోగాంతాయ మాతు శ్శోకనాశాయ, విఘ్ననాశాయ నమోఽస్తు తే', గరుడాయ నమ స్తుభ్యం సర్వసర్పేంద్రమృత్యవే, వాహనాయ మహావిష్ణోః తార్క్ష్యాయామిత తేజసే, నమో నమస్తే పక్షీంద్ర స్వాధ్యాయవపుషే నమః, విహగేంద్ర నమస్తేఽస్తు సముత్పాటితకల్పక', 'కించిదాయతవృత్తాక్షం నీలదీర్ఘాగ్రనాసికమ్, అతీవ శాంతవేషం తు తథా ప్రతిహతాననమ్'"** అని పాంచరాత్రసంహితలలో

మహోపనిషత్తులో, సాత్త్వత పాద్మసంహితాదులలో గల స్తుతివచనములను, **"సత్యం ప్రపద్యే", "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ", "తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి, తన్నో గరుడః ప్రచోదయాత్", "స్వస్త్యయనం తార్క్ష్య మరిష్టనేమిం మహత్ భూతం వాయసం దేవతానామ్, అసురఘ్ను మింద్రసఖం సమత్సుబృహదీశో నావమివారుహే, అంహోముచమాంగిరసంగవం చ స్వస్త్యాత్రేయం మనసా చ తార్క్ష్యం ప్రయతపాణి శ్శరణ మహం ప్రపద్యే, స్వస్తి సంబోధేష్వభయం నో అస్తు, దివ్యం సుపర్ణం వయసా బృహంతమ్"** ఇత్యాది వైదికసూక్తులును అనుసంధేయములని తెలిపెను.

భగవానుని పక్షమున ఋగ్వేదఖిలనుగు జితంతాస్తోత్రములోని **"జితం తే పుండరీకాక్ష నమ స్తే విశ్వభావన, నమస్తేఽస్తు హృషీకేశ మహాపురుష పూర్వజ"** ఇత్యాది వైదిక సూక్తులు, **"నారాయణః పరం బ్రహ్మ, తత్త్వం నారాయణః పరః", "నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్", "త్రీణి పదా విచక్రమే"** ఇత్యాది పలు స్తుతి వచనములును స్మరణీయములు అనియు సంస్కృతవ్యాఖ్యాత పల్కెను.

**పంచాత్మా పంచధాఽసౌ పురుష ఉపనిషద్ఘోషిత స్తోషయే న్నః**
**గరుడుని పరబ్రహ్మస్వరూపత్వకథనము**

7. **శ్లిష్యద్భోగీంద్రభోగే శ్రుతినికరనిధౌ మూర్తిభేదే స్వకీయే**
**వర్ణవ్యక్తీః విచిత్రాః పరికలయతి యో వక్త్రబాహూరుపాద్యైః ।**
**ప్రాణః సర్వస్య జంతోః ప్రకటితపరమబ్రహ్మభావః స ఇత్థం**
**క్లేశం ఛిందన్ ఖగేశః సపది విపది నః సన్నిధిం సన్నిధత్తామ్ ॥**

గరుడుని పక్షమున అర్థము -

యః = ఏ గరుడుడు, శ్లిష్యత్భోగీంద్రభోగే = తనను ఆలింగనము చేసికొను గొప్పదైన సర్పముల శరీరములను కల్గినది, శ్రుతినికరనిధౌ = వేదముల సమూహముయొక్క నిధియైయున్నది (వేదతాత్పర్యమైయున్నది) అగు, స్వకీయే = తనకు చెందిన, మూర్తిభేదే = రూపవిశేషమునందు, వక్త్ర =ముఖము, బాహు = బాహువులు, ఊరు = ఊరువులు (తొడలు), పాద్యైః = పాదములు- అను వీనిచే, విచిత్రాః = ఆశ్చర్యకరములైన (నీలము మెదలగు పలువిధములైన), వర్ణవ్యక్తీః = వర్ణముల అభివ్యక్తిని (జ్యోతిస్సు యొక్క అభివ్యక్తిని), పరికలయతి = ప్రకటించుచున్నాడో, (అట్టి) ఇత్థమ్ = ఇట్లు, ప్రకటిత= ప్రకటింపబడిన, పరమబ్రహ్మభావః = పరమపురుషుని స్వరూపమును కలవాడై, సర్వస్య =సకలములైన, జంతోః = ప్రాణులకు, పాణః = ప్రాణమైయున్నవాడు, అగు, సః = ఆ, ఖగేశః = గరుడుడు, నః = మనయొక్క, క్లేశమ్ = దుఃఖమును, ఛిందన్=ఛేదించుచు, విపది = ఆపదయందు, సపది = వేగముగా, సన్నిధిం = తన సాన్నిధ్యమును, సన్నిధత్తామ్ = అనుగ్రహించునుగాక!



భగవానుని పక్షమున అర్థము -

యః = ఏ భగవానుడు, శ్లిష్యత్ భోగీంద్రభోగే = తనతో కలసియున్న (పడుకగానున్న) భోగీంద్రుడగు ఆదిశేషునియొక్క శరీరమునుకల, శ్రుతినికరనిధౌ =వేదములకు నిలయముగా, స్వకీయే మూర్తిభేదే = తన రూపవిశేషమందు, (విశ్వరూపమందు), వక్త్రబాహూరుపాద్యైః = ముఖము, బాహువులు, ఊరువులు, పాదములతో, విచిత్రాః = నానావిధములైన, వర్ణవ్యక్తీః = బ్రాహ్మణాది వర్ణములకు (జాతులకు) చెందిన వ్యక్తులను, పరికలయతి = వ్యక్తము చేయుచున్నాడో, సర్వస్య జంతోః ప్రాణః = సమస్త జీవులకు ప్రాణమో, ఇత్థమ్ =ఇట్లు, ప్రకటితపరబ్రహ్మభావః = వ్యక్తముచేసిన పరబ్రహ్మస్వరూపమును కల, సః ఖగేశః = గరుడునకు అధిపతియైన ఆ భగవానుడు, క్లేశం ఛిందన్ = క్లేశములను పోగొట్టుచు, విపది సపది నః సన్నిధిం సన్నిధత్తామ్ = ఆపత్సమయములలో వేగముగా మనకు తన సన్నిధిని ప్రసాదించునుగాక !

గరుడభగవానునియందుగల పలు అంశములను గమనింపగా, అతడు భగవానునితో సామ్యమును కలవాడుగా ఏర్పడుచున్నది. భగవానుడు ఆదిశేషుని మేనితో కలసియున్నాడు. అతడు ఆదిశేషునిపై పరుండియుండునుకదా ! గరుడుడును కర్కోటకాదిగొప్పసర్పములను తన దేహమందు అలంకారములుగా ధరించియున్నాడు. వేదములు భగవానుని తాత్పర్యముగా గ్రహించి, కీర్తించుచున్నవి. గరుడుడు వేదస్వరూపుడై వెలుగుచున్నాడు. భగవానుడు తనవిరాట్ స్వరూపమునందలి ముఖము - ఊరువులు - పాదములనుండి వరుసగా బ్రహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులను జాతులను సృజించెను. గరుడుడు తన మూర్తులలోని రూపవిశేషమునందు ముఖము - చేతులు - ఊరువులు - పాదములు - అనువీనియందు క్రమముగా నలుపు -ఎఱుపు - తెలుపు - పసుపు అను వర్ణములును కల్గియున్నాడు. భగవానుడు ప్రాణుల కందఱుకు ప్రాణమైయున్నాడు. గరుడుడు ప్రాణులకందఱకు ప్రాణసమానుడై యున్నాడు. సత్పురుషులు భగవానుని గొప్ప నిధిగా తలచుచున్నారు. గరుడునికూడ ఆవిధముగానే కీర్తించుచున్నారు. ఇట్లు భగవానునితో పోలియున్నాడు- అను మహిమమను కల గరుడుడు మనకు ఆపద కల్గినపుడు శీఘ్రముగా వేంచేసి, మన దుఃఖములను తీర్చుగాక !

**(శ్లిష్యత్భోగీంద్రభోగే)** - గరుడుడు పలువిధములైన సర్పములను ఆభరణములుగా కల్గియుండుటను దేశికులు ఈ స్తోత్రములో **"వామే వైకుంఠశయ్యా"** ఇత్యాది (36) శ్లోకమున వర్ణించిరి. ఈ అంశము పాంచరాత్రాగమములో విస్తృతముగా నిరూపింపబడినది.

**(వక్త్రబాహూరుపాద్యైః వర్ణవ్యక్తీః పరికలయతి)** - దీనిని సంస్కృతవ్యాఖ్యాత వివరించుచు **"విచిత్రాః వర్ణవ్యక్తీః బ్రహ్మక్షత్రవైశ్యశూద్రజాతివ్యక్తీః పరికలయతి ఉత్పాదయతి. తథాచ శ్రుతిః - బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత ఇతి"** అని తెలిపెను.

**(విచిత్రాః వర్ణవ్యక్తీః పరికలయతి)** - **"ఆజానుత స్సువర్ణాభ మాకట్యా స్తుహిన ప్రభమ్, కుంకుమారుణ మాకంఠ మాకేశాంతం సితేతరమ్ "** అను శ్లోకార్థ మిచట గరుడుని పక్షమున స్మరణీయము. భగవానుని పక్షమున వర్ణ మనగా జాతి. **"బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత"** అను వేదవాక్యము అనుసంధేయము.

**(ఖగేశః)** - గరుడుని పక్షీంద్రత్వము భారతము ఆదిపర్వమున తెలుపబడినది. **"ఖగానామ్ ఈశః"** అను విగ్రహము గరుడుని పక్షమున, **"ఖగస్య ఈశః"** అను విగ్రహము భగవానుని పక్షమున వివక్షితము. ఖగరూపుడైన ఈశ్వరుడని భగవత్పక్షమున భావము. **"గరుడస్య పక్షీంద్రత్వం శ్రీమహాభారతే ఆదిపర్వణి ద్వావింశాధ్యాయే ప్రోక్తం- పతత్రీణాంతు గరుడ ఇంద్రత్వేన అభ్యషిచ్యత ఇతి"** అని టిప్పణీ వివరణము. **(విపది)** - మహా భయమును కల్గించు మరణ కాలమున అని అర్థము.

**(సన్నిధిం సన్నిధత్తామ్)** - గొప్పనిధి అగు భగవానుని అనుగ్రహించు గాక ! అనియు అర్థము. మరణ సమయమున గరుడవాహనారూఢుడగు భగవానుని సేవించుట కంటే కోరదగిన దేమున్నది. **"సన్నిధిః సన్నిధత్తామ్"** అను పాఠాంతరమున **"సన్నిధిః"** అనునది గరుడ, భగవానులకు విశేషణముగ అన్వయింపనగును.

**క్లేశం ఛిందన్ ఖగేశః సపది విపది నః సన్నిధిం సన్నిధత్తామ్**

**గరుడుడు ఒక రత్నపుటద్దము**

8. **అగ్రే తిష్ఠ న్నుదగ్రో మణిముకుర ఇవానన్యదృష్టేః మురారేః**
**పాయా న్మాయాభుజంగీవిషమవిషభయా ద్గాఢ మస్మాన్ గరుత్మాన్ ।**
**క్షుభ్యత్క్షీరాబ్ధిపాథఃసహభవగరళస్పర్శశంకీవ శంకే**
**ఛాయాం ధత్తే యదీయాం హృది హరిహృదయారోహధన్యో మణీంద్రః ॥**

అనన్యదృష్టేః = వేరుదేనిని చూడని, మురారేః = భగవానునకు, అగ్రే =ఎదురుగా, ఉదగ్రః = ఉన్నతమైన, మణిముకురః ఇవ= రత్నపుటద్దమువలె, తిష్ఠన్ = నిలుచున్న, గరుత్మాన్ = గరుడుడు, అస్మాన్ = మనలను, మాయాభుజంగీ =సంసారమను ఆడు పాముయొక్క, విషమ = తీవ్రమైన, విషభయాత్ = విషముయొక్క భయము నుండి, గాఢమ్ = నిశ్చయముగా, పాయాత్ = రక్షించునుగాక, హరిహృదయ = భగవానుని వక్షఃస్థలమునందు, ఆరోహధన్యః = ఆరోహించుట అను ధనమును పొందిన, సః = ఆ, మణీంద్రః = కౌస్తుభరత్నము, క్షుభ్యత్ = క్షోభించు, క్షీర+అబ్ధి = పాలసముద్రములోని, పాథః = నీటినుండి, సహభర = తనతో పుట్టిన, గరళ = విషముయొక్క, స్పర్శ = సంబంధమునందు, శంకీ = శంకనుకల్గినదై, హృది = తనమధ్యలో, యదీయామ్ =ఏ



గరుడునకు సంబంధించిన, ఛాయామ్ = ఛాయను, ధత్తే = ధరించుచున్నదా (అని), శంకే = ఉత్ప్రేక్షింతును.

లోకమున రాజులు మొదలగు ధనవంతులు తమ భవనములలో తమకెదురుగా ఒక నిలువుటద్దమును నిలిపి, అందు తమ అందమును చూసి, మురియుదురు. కాని, ఆ అద్దము వారి బాహ్యాంశములను మాత్రమే చూపగల్గును. గరుడుడు వేరొక విషయమందు దృష్టిని నిలువని భగవానునకు ఎదురుగా ఎల్లప్పుడు నిలచి, ఒక గొప్ప రత్నముకురమువలె ప్రకాశించుచున్నాడు, గరుడుడను ఈ అద్దమందు స్వామి తన దివ్యదేహమును మాత్రమే కాక, దివ్యాత్మస్వరూపమును, దివ్యగుణములను, తాను పరిపాలించునట్టి విభూతుల నంతటిని చూడగల్గుచున్నాడు. అపుడు భగవానుని వక్షస్సులో అలంకరింపబడిన భాగ్యమును పొందిన కౌస్తుభమణియందు ఎదురుగా నున్న గరుడుని చాయ చక్కగా ప్రతిఫలించుచున్నది. అట్లు గరుడుని ప్రతి బింబమును కౌస్తుభమణి ధరించి యుండుటకు ఒక కారణము కలదు. అదేమనగా - భగవానుడు పూర్వము పాలసముద్రమును చిలికినపుడు దానినుండి పుట్టినవానిలో కౌస్తుభమణియు, కాలకూట విషమును కలసి పుట్టినవి. ఆ విషముతో కలసిపుట్టుటచే తనకు ఆవిషముయొక్క స్పర్శ అనువర్తించునో ఏమో ? అనుభయము కౌస్తుభరత్నమునకు ఏర్పడినది. అట్లు ఆవిషమువలన తనకు కలుగబోవు కీడును పోగొట్టుకొనుటకై విషమును పోగొట్టు శక్తిని మిక్కిలిగా కల్గిన గరుడుని ఛాయను కౌస్తుభము ధరించి యుండవచ్చును. ఇట్టి గరుడభగవానుడు మనకు సంసారమనెడి ఆడుపాముయొక్క తీవ్రమైన విషమువలన కల్గు భయమును పోగొట్టి, మనలను కాపాడునుగాక !

సమస్తభయనిరాకరణసమర్థుడగు విష్ణువును ఆశ్రయించిన కౌస్తుభమణియు తన రక్షణ కొఱకు గరుడుని ఛాయను ధరించుచున్నదనుటచే గరుడభగవానుని అసమానమైన మహిమాతిశయము ధ్వనించుచున్నది. గరుడుని రత్నముకురముగా వర్ణించు ఈసందర్భమున భట్టరు శ్రీ రంగరాజస్తవపూర్వశతకములోని **"శ్రుతిమయ మతిహర్ష ప్రశ్రయస్మేరనేత్రం మణిముకుర మివాగ్రే మంగళం రంగధామ్నః, శరణ ముప గతాః స్మో యత్ర రూపస్వరూపస్వగుణమహిమదర్శీ మోదతే రంగశాయీ"** అను శ్లోకరత్నము అనుసంధేయము.

**(మాయాభుజంగీ)** - త్రిగుణాత్మకమైన అవిద్యయే మాయ. విచిత్ర సృష్టిని చేయునది అగుటచే దీనికి మాయ అనిపేరు. **"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్"** అనునట్లు వివిధ గుణాత్మకమైన సృష్టిని చేయు ప్రకృతియే మాయ. **"మాయాం తు ప్రకృతిం విద్యాత్"** అని కదా గీతావచనము. **"భుజంగీ"** శబ్దములోని స్త్రీప్రత్యయమువలన విషము యొక్క క్రౌర్యము ద్యోతితమగుచున్నది.

**(ఉదగ్రః)** - ఉత్కృష్టము. అనగా విలక్షణమని అర్థము. లోకములోని దర్పణములలో బాహ్యరూపమును మాత్రమే చూడగలము. కాని గరుడుడను అద్దమున భగవానుడు తన రూప

స్వరూప గుణ - విభూతులను దర్శించుటచే దాని యొక్క వైలక్షణ్యము స్పష్టము. ఈ అంశమును టిప్పణీకారుడు నిరూపించుచు **"ఉదగ్రః - ఉత్కృష్టః విలక్షణ ఇతి యావత్. ప్రాకృతో మణిముకురః దేహనిష్ఠానేవ సౌందర్యాదికాన్ గుణాన్ ప్రకాశయేత్. అయం గరుత్మత్స్వరూపమణిముకుర స్తు . . . దివ్యమంగళవిగ్రహం, దివ్మాత్మానం, దివ్యాత్మనిష్ఠాన్ జ్ఞానశక్త్యాదికాన్ గుణాన్, దివ్యమంగళ విగ్రహస్థితాన్ సౌందర్యలావణ్యయౌవనాదికాన్ సర్వాం శ్చ ప్రకాశయతీత్యతోఽ స్య మణిముకుర స్య విలక్షణత్వ మితి భావః"** అని పల్కెను. శ్లోకమున మొదటి పాదమున ఉపమ, **"మాయాభుజంగీ"** అనుచోట రూపకము, ఉత్తరార్థమున **"శంకే"** అను పదముచే సూచితమైన ఉత్ప్రేక్షయు కలవు.

**భగవానుని పక్షమున అర్థము :**

అనన్యదృష్టేః = తనను జయింపవలెనను దృష్టితప్ప వేరొక దృష్టిలేని, మురారేః = మురుడను పేరుగల శత్రువుయొక్క, అగ్రే = ముందు, మణిముకుర ఇవ తిష్ఠన్ = రత్నపుటద్దమువలె నిలుచున్నవాడైన (హరిః = భగవానుడు), మాయాభుజంగీ విషమభయాత్ = మాయ అనెడి ఆడుసర్పముయొక్క విషమువలన కల్గిన భయమునుండి, గాఢమ్ = బలముగా, పాయాత్ = రక్షించునుగాక ! (ఆ భగవానుడు ఎట్టివాడనగా), క్షుభ్యత్క్షీరాబ్ధి = చిలకబడుచున్న పాలసముద్రము పాలనుండి, భవ= పుట్టిన, గరళ = విషముయొక్క, స్పర్శ = తాకిడిని, శంకీ = శంకించునట్టిదై, హరిహృదయ = భగవానుని వక్షస్సును, అధిరోహ = అధిరోహించుటచే, ధన్య = ధన్యమైన, సః = ఆ, మణీంద్రః = కౌస్తుభమణి, హృది= తన హృదయమందు, యదీయామ్ = ఏ భగవానునకు సంబంధించిన, ఛాయామ్= కాంతిని, ధత్తే ఇతి శంకే = ధరించుచున్నదని శంకింతునో, (అట్టిభగవానుడు మనలను రక్షించుగాక !)

ఈ అన్వయమున భగవానుడే రత్నపుటద్దముగా వర్ణింపబడినాడు. **"కౌస్తుభస్య ఉభయపుటనిర్మలత్వాత్ హరిహృదయచ్ఛాయాధారణం యుక్త మిత్యేవం శ్లేషః"** అని సంస్కృతవ్యాఖ్యాత వివరణము.

**మాయాభుజంగీవిషమభయాత్ అస్మాన్ గరుత్మాన్ పాయాత్**

### (2) అమృతాహరణవర్ణకః

### గరుడుని కన్నతల్లి భాగ్యము

**9.** **ఆహర్తారం సుధాయా దురధిగమమహా చక్రదుర్గస్థితాయాః**
**జేతారం వజ్రపాణేః సహ విబుధగణై రాహవే బాహువేగాత్ ।**
**విష్ణౌ సంప్రీయమాణే వరవినిమయతో విశ్వవిఖ్యాతకీర్తిమ్**
**దేవం యాఽసూత సాఽసౌ దిశతు భగవతీ శర్మ దాక్షాయణీ నః ॥**



దురధిగమ = దాటుటకు సాధ్యముకాని, మహాచక్ర =గొప్ప చక్రమను దుర్గ =దుర్గమందు, స్థితాయాః ఉన్నట్టి, సుధాయాః = అమృతముయొక్క, ఆహర్తారమ్ = కొనివచ్చినవాడు, ఆహవే = యుద్ధమందు, బాహువేగాత్ = బాహువుల వేగమువలన, విబుధగణైః సహ = దేవగణములతో పాటు, వజ్రపాణేః = వజ్రాయుధమును చేతిలో కల ఇంద్రుని, జేతారమ్ = జయించినవాడు, విష్ణౌ = విష్ణువు, సంప్రీయమాణే =మిక్కిలి ఆనందించినవాడుకాగా,వరవినిమయతః = వరములను పరస్పరము ఇచ్చుకొనుటచే, విశ్వవిఖ్యాత = లోకమందు ప్రసిద్ధిపొందిన, కీర్తిమ్ = కీర్తినికలవాడు, అను, దేవమ్ = గరుడదేవుని, యా = ఎవరు, అసూత = ప్రసవించెనో, సా =ఆ, అసౌ = ఈ, భగవతీ = గొప్పతనమునుకల, దాక్షాయణీ = దక్షుని భార్య అగు వినత, నః = మనకు, శర్మ = (సుఖమును), దిశతు = ఇచ్చుగాక !

ఈ శ్లోకము మొదలు 17వశ్లోకమువరకు - అనగా 9 శ్లోకములలో అమృతాహరణ వృత్తాంతము వర్ణింపబడు చున్నది. ఈ ఉపాఖ్యానము మహాభారతము - ఆదిపర్వమున కలదు.

గరుడభగవానుడు స్వర్గము నుండి అమృతమును తీసికొను వచ్చుటకు ప్రయత్నించెను. అమృతము చుట్టు అచట ఒక పెద్ద చక్రము ఎల్లప్పుడు తిరుగుచు ఉండుటచే ఎవరికిని అమృతమును సమీపించుటకు సాధ్యముకాకుండెను. దానిని ఏమాత్రము లక్ష్యము చేయని గరుడుడు మహాధైర్యముతో అచక్రమును సమీపించి, లోనికి పోయి, అమృతమును తీసికొనివచ్చెను. అపుడు ఇంద్రుడు ససైన్యముగా గరుడుని ఎదిర్చి, తన వజ్రాయుధమును అతనిపై ప్రయోగించెను. ఇంద్రునికూడ గరుడుడు తన బాహు బలముతో జయించెను. తన బలమును చూచి సంతోషించిన భగవానుడు తనకు వరమిచ్చినపుడు, తాను కూడ ఆస్వామికి వర మిచ్చెను. అపుడు గరుడునకు కల్గిన కీర్తి లోకమంతయు వ్యాపించినది. ఇట్లు అంతులేని గొప్పతనమును కల్గిన గరుడుని కన్న మహాభాగ్యమునుకల దక్షప్రజాపతి భార్య అగు వినత మనకు క్షేమమును కల్గించునుగాక

**(వరవినిమయతః)** - ఈ అంశము పూర్వము **"యోఽయం ధత్తే"(4)** ఇత్యాదిశ్లోకమున ప్రస్తుతము.

**(విశ్వవిఖ్యాతకీర్తిమ్)** - అందఱికిని వరముల నిచ్చు భగవానునకే గరుడుడు వరము నిచ్చుటచే - కల్గిన కీర్తి లోకమంతయు వ్యాపించినదని భావము.

**(దురధిగమమహాచక్రదుర్గస్థితాయాః)** - భారతము ఆదిపర్వములోని - **"స చక్రం క్షురపర్యంత మపశ్య దమృతాంతికే, పరిభ్రమంత మనిశం తీక్ష్ణధార మయన్మయమ్, జ్వలనార్క ప్రభం ఘోరం ఛేదనం సోమహారిణామ్"** ఇత్యాది వచనములు స్మరణీయములు. **"దుర్గమవిపులాయామవచ్చక్ర పురవర్తిన్యాః"** అని సంస్కృతవ్యాఖ్యానము. దుర్గమమైన, విపులమైన నిడివిని కల్గిన చక్రపురములోనున్న అని దీని అర్థము. **"శక్రదుర్గ"** అని పాఠాంతరము.

**(విష్ణౌ సంప్రీయమాణే) - "అపీత్వైవామృతం పక్షీ పరిగృహ్యాశు వేగతః, అగచ్ఛ దపరిశ్రాంత ఆవార్యార్కప్రభాం ఖగః, విష్ణునా తు తదాఽఽకాశే వైనతేయ స్సమేయివాన్, తస్య నారాయణ స్తుష్టః తదా తుల్యేన కర్మణా త మువాచావ్యయో దేవః** - ఇత్యాదిగా భారతము - ఆది పర్వములో గల వచనములు అనుసంధేయములు. **"శంకీ స శంకే"** అని పాఠాంతరము.

**ఆహర్తారం సుధాయా విశ్వవిఖ్యాతకీర్తిం దేవం యాఽఽసూత**
**సా దిశతు భగవతీ శర్మ దాక్షాయణీ నః**

**గరుడుని తేజస్సును చూచిన దేవతలు భయపడుట**

**10.** **విత్రాసాత్ వీతిహోత్రం ప్రథమ మధిగతై రంతికే మందధామ్నా**
**భూయ స్తేనైవ సార్ధం భయభరతరళై ర్వందితో దేవబృందైః ।**
**కల్పాంతక్షోభదక్షం కథ మపి కృపయా సంక్షిపన్ ధామ చండం**
**భిత్త్వాఽణ్డం నిర్జిహానో భవభయ మిహ నః ఖండయత్వండజేంద్రః ॥**

అండమ్ = గుడ్డును, భిత్త్వా = చీల్చుకొని (బద్దలుచేసికొని), నిర్జిహానః = ఆ సమయమున బయటకువచ్చువాడై, విత్రాసాత్ =మిక్కిలి భయమువలన, ప్రథమమ్ = మొదట, వీతిహోత్రమ్ = అగ్నిని, అధిగతైః = పొందినవారై, అంతికే = సమీపమున, మందధామ్నా = మందగించిన తేజస్సుతో, తేన +ఏవ సార్ధమ్ = ఆ అగ్నితో కూడ, భూయః = తిరిగి, భయభరతరళైః = మిక్కిలి భయమువలన కలతచెందిన మనస్సును కలవారగు, దేవబృందైః, = దేవతల సమూహములచే, వందితః = నమస్కరింపబడినవాడై, కల్ప +అంత = ప్రళయకాలమును, క్షోభదక్షమ్ = కలతచెందునట్లు చేయగల్గినదగు, చండం ధామ =భీకరమైన తేజస్సును, కృపయా = దయతో, కథమ్ అపి = ఏవిధముగానో, సంక్షిపన్ = తగ్గించు వాడైయున్న, అండజ+ఇంద్రః = పక్షులకు ప్రభువగు గరుడుడు, ఇహ =ఇచట, నః =మనయొక్క, భవభయమ్ = సంసారభయమును, ఖండయతు = ఖండించునుగాక !

గరుడుడు తన తల్లియగు వినతయొక్క గర్భమునుండి జనించిన గ్రుడ్డును బ్రద్దలుచేసికొని బయటకు వచ్చెను. వెంటనే ఆకాశమునందు గొప్పరూపముతో ఎగిరెను. అతని తేజస్సు బడబాగ్ని తేజమునకంటె మిక్కిలి భయంకరమై యుండెను. అతని వేగమును సహింపలేక మిక్కిలి భయ పడిన దేవతలు, యథార్థమేమియో తెలిసికొనలేనివారై, అగ్నియే ఇట్లు వృద్ధిచెందినదని తలచి, మొదటగా అగ్నిదేవునివద్దకు శరణువేడపోయిరి. అపుడు గరుడుని తేజస్సుచే తనతేజస్సు మిక్కిలి మందగించిన అగ్ని దేవతలతో ఆ గొప్పతేజము తనదికాదని, గరుడుని తేజమని పల్కెను. దానిని విని దేవతలు మరింత భయపడినవారై అగ్నిని పురస్కరించుకొని, గరుడుని చేరి, దూరముగా నిలచి, అతనిని స్తుతించిరి. అందుచే సంతోషించిన గరుడభగవానుడు దయతో ప్రళయకాలమున



కూడ క్షోభింపచేయగల్గిన తన తేజమును అతికష్టముతో కొంత తగ్గించుకొనెను. ఇట్టి గొప్పతేజస్సును కల గరుడభగవానుడు మన సంసారభయమును పోగొట్టునుగాక !

ఈ శ్లోకమున ప్రస్తావింపబడిన వృత్తాంతమును మహాభారతము ఆదిపర్వము 23వ అధ్యాయములోగల ఈ క్రింది శ్లోకములు తెలుపుచున్నవి. - **"వినా మాత్రా మహాతేజాః విదార్యాండ మజాయత, మహాసత్త్వబలోపేతః సర్వా విద్యోతయన్ దిశః, ఘోరో ఘోరస్వనో రౌద్రో వహ్ని రౌర్వఇవాపరః, తం దృష్ట్వా శరణం జగ్ముః దేవా స్సర్వే విభావసుమ్, ప్రణిపత్యాబ్రువం శ్చైవ మాసీనం విశ్వరూపిణమ్, దేవా: - "అగ్నే మా త్వం ప్రవర్ధిష్ఠా: కచ్చిన్నో న దిధక్షసి, అసౌ హి రాశి స్సుమహాన్ సమిద్ధ స్తవ సర్పతి, అగ్నిః - "నైత దేవం యథా యూయం మన్యధ్వ మసురార్దనాః, గరుడో బలవా నేష మమ తుల్యశ్చ తేజసా, జాతః పరమ తేజస్వీ వినతానందవర్ధనః, తేజోరాశి మిమం దృష్ట్వా యుష్మాన్ మోహ స్సమావిశత్, నాగక్షయకరశ్చైవ కాశ్యపేయో మహాబలః, దేవానాం చ హితేయుక్తః సహితో దైత్యరక్షసామ్, న భీః కార్యా కథం చాత్ర పశ్యధ్వం సహితా మయా, -ఏవ ముక్తాః తదా గత్వా గరుడం వాగ్భి రస్తువన్, తే దూరా దభ్యుపేత్యైనం దేవా స్సర్షిగణా స్తదా, దేవాః త్వ మృషి స్త్వం మహాభాగ త్వం దేవః పతగేశ్వర - ఏవం స్తుత స్సువర్ణ స్తు దేవైస్సర్షిగణై స్తదా, తేజసః ప్రతిసంహార మాత్మనః స చకార హ"**

ముందు శ్లోకమున సంగ్రహముగా ప్రస్తావింపబడిన అమృతాహరణవృత్తాంతము ఇచటి నుంచి క్రమముగా వివరింపబడుచున్నది. ఇందు గరుడుని జన్మవృత్తాంతము వర్ణింపబడినది.

**భవభయ మిహ నః ఖండయత్వండజేంద్రః**

**గరుడుని భయంకరమైన బాల్యక్రీడ**

**11.** **క్షుణ్ణక్షోణీధరాణి క్షుభితచతురకూపారతిమ్యద్గరుంతి**
**త్రుట్యత్తారాసరాణి స్థపుటితవిబుధస్థానకాని క్షిపేయుః ।**
**పాతాళబ్రహ్మసౌధావధివిహితముధావర్తనా న్యస్మదార్తిం**
**బ్రహ్మాండస్యాంతరాళే బృహతి ఖగపతే రర్భకక్రీడితాని ॥**

బ్రహ్మాండస్య = బ్రహ్మాండముయొక్క, బృహతి = గొప్పదైన, అంతరాళే = మధ్యభాగమునందు, క్షుణ్ణ = చూర్ణము చేయబడిన, క్షోణీధరాణి = పర్వతములను కల్గినవి, క్షుభిత = కలతచెందునట్లు చేయబడిన, చతుః + ఆకూపార = నాల్గు సముద్రములలో, తిమ్యక్ = నానిన, గరుంతి = ఱెక్కలను కల్గినవి, త్రుట్యత్ = తెగిన, తారాసరాణి = నక్షత్రముల వరుసలను కల్గినవి, స్థపుటిత = ఎత్తుపల్లములుగా చేయబడిన, విబుధ స్థానకాని =దేవతల నివాసములను కల్గినవి, పాతాళ బ్రహ్మసౌధ + అవధి = పాతాళము మొదలు బ్రహ్మలోకము వరకు, విహిత ముధా + ఆవర్తనాని = చేయబడిన

ఫలరహితములైన గమనా గమనములను కల్గినవి, అగు, ఖగపతేః = గరుడునియొక్క, అర్భక క్రీడితాని = బాల్యచేష్టలు, అస్మత్ + ఆర్తిమ్ = మన దుఃఖమును, క్షిపేయుః = పోగొట్టునుగాక !

గరుడ భగవానుడు గొప్పదైన బ్రహ్మాండమధ్య భాగమున చేసిన బాల్యక్రీడలు లెక్కలేనివి. పాతాళలోకము మొదలు బ్రహ్మలోకము వరకు ఏ కార్యములేని ముధావర్తనములను క్రీడార్థము అతడు తన బాల్యమున చేసెను. అపుడు గరుడుని వేగమును తాళలేని పర్వతములు పొడి అయ్యెను. నాల్గు సముద్రములందు ప్రవేశించి, అతడు వానిని క్షోభిల్లచేయునపుడు అతని ఱెక్కలు సముద్రము నీటిలో తడసినవి. ఆకాశమునను్న నక్షత్రమాలికలు అన్నియు ఖండఖండములుగా తెగిపడినవి. దేవతల నివాసములు ఎత్తుపల్లములుగా అయ్యెను.ఇట్లు గరుడుని అత్యద్భుతములైన బాల్యక్రీడలు మన దుఃఖములను అన్నిటిని పోగొట్టును గాక !

గరుడుని జన్మవృత్తాంతమునకు పిదప, అతని బాల్య క్రీడా వైభవము ఇందు ప్రస్తుతము. **"క్షుణ్ణక్షోణీధరాణి"** ఇత్యాది ప్రయోగములందు అతిశయోక్త్యలంకారము కలదు అని సంస్కృతవ్యాఖ్య.

గరుడుని వేగమునకు పర్వతములు చూర్ణము లయ్యెనను టకు టిప్పణీకారులు ఒక వృత్తాంతమును ఉదహరించిరి. గరుడుడు రోహిణీవృక్షముయొక్క నూఱు యోజనముల నిడివినికల శాఖను తండ్రి ఆజ్ఞపై కొనిపోయి ఒకానొక పర్వతముపై విడచెను. అపుడు అతని ఱెక్కల గాలివేగమునకు ఆపర్వతము బ్రద్దలయ్యెను. ఈ కథ మహాభారతము - ఆదిపర్వములోని, - **"స గత్వా తత్క్షణేనైవ పర్వతం వచనాత్ పితుః, అముంచత్ మహతీం శాఖాం సస్వనం తత్ర ఖేచరః, పక్షానిలహతశ్చాస్య ప్రాకంపత స శైలరాట్, మామోచ పుష్పవర్షం చ సమాగళితపాదపః, శృంగాణి చ వ్యశీర్యంత పర్వతస్య సమంతతః, మణికాంచనచిత్రాణి శోభయంతి మహాగిరిమ్"** - అను శ్లోకములలో తెలుపబడినది. కావున స్వభావోక్తిగా కూడ గ్రహింపనగును. కాని, **"అర్భకక్రీడితాని"** అను విశేష్య స్వారస్యమునుబట్టి, తరువాతి శ్లోకములో తల్లివద్ద గరుడుడు అమృతమును తెచ్చుటకు అనుమతిని పొందెనను కథనమును బట్టి పూర్వయోజనయే సరసతరమని తోచును.

**ఖగపతేః అర్భకక్రీడితాని అస్మదార్తిం క్షిపేయుః**

**వినత గరుడుని అమృతమును తెమ్మని పల్కుట**

**12.** **సంవిచ్ఛస్త్రం దిశంత్యా సహ విజయ చమూరాశిషః ప్రేషయంత్యా**
**సంబధ్న్యంత్యా తనుత్రం సుచరిత మశనం పక్కణం నిర్దిశంత్యా ।**
**ఏనోఽస్మ ద్వైనతేయో నుదతు వినతయా క్లృప్తరక్షావిశేషః**
**కద్రూసంకేతదాస్యక్షపణపణసుధాలక్షభైక్షం జిఘృక్షుః ॥**

సంవిత్ = జ్ఞానమను, శస్త్రమ్= ఆయుధమును, దిశంత్యా = ఇచ్చునది, సహ= దానితో, ఆశిషః



=ఆశీర్వాదములనెడి, విజయచమూః = జయమును కల్గించు సేనను, ప్రేషయంత్యా = పంపునదియు, సుచరితమ్ = నీతిమార్గమనెడి, తనుత్రమ్ = కవచమును, సంబధ్నంత్యా= చక్కగా బంధించునదియు, పక్కణమ్ = శబరుల నిలయమును అశనమ్ = ఆహారముగా, నిర్దిశంత్యా = నిర్దేశించునది అగు, వినతయా = వినతచే, క్లృప్త = చేయబడిన, రక్షావిశేషః = విశేషమైన రక్షనుకలవాడు, కద్రూ = కద్రువతో చేసికొనిన, సంకేత = ఒప్పందముచే ఏర్పడిన, దాస్య = దాసీతనముయొక్క, క్షపణ = తీర్చుటకు, పణ = పణము అగు, సుధా = అమృతమను, లక్ష = లక్ష్యము అనేడి, భైక్ష్యమ్ = గొప్పభిక్షను, జిఘృక్షుః = పొందగోరినవాడును అగు, వైనతేయః = గరుడుడు, అస్మత్ = మన, ఏనః = పాపమును, నుదతు = పోగొట్టునుగాక !

గరుడభగవానునకు తల్లి అగు వినత ఒకానొక సమయమున కద్రువకు దాసి అగుట సంభవించెను. ఆ దాస్యమును తీర్చుకొనుటకు పణముగా దేవతలనుండి అమృతమును తెచ్చి ఇవ్వవలసినదిగా కద్రువ అమెకు తెలిపెను. తనతల్లి దాసీతనమును తీర్చుటకు గరుడుడు దేవతల వద్దకు పోయి, అమృతమును తెచ్చుటకు పోగోరి, అందులకు తన తల్లి వద్ద అనుమతిని పొందెను.

లోకమున యుద్ధమునకు పోవు వీరునకు తల్లి మొదలగు పెద్దలు ఆయుధముల నిచ్చి , సహాయముగా సేనను పంపి, శత్రువులు ప్రయోగించు ఆయుధమునుండి తనను రక్షించుకొనుటకు కవచమును తొడిగించి, దారిలో ఆకలి తీర్చుకొనుటకు ఆహారమునిచ్చి, ఇట్లు పలు రక్షావ్యాపారములను చేసి, అనుమతినిచ్చి పంపుట లోక రీతి. అట్లే వినత తన కుమారుడు స్వర్గమునుండి అమృతమును తీసికొనివచ్చు ప్రయత్నమున యుద్ధము జరుగవచ్చునని తలచి, గరుడునకు పలు రక్షలను చేసినది. అతనికి మంచి జ్ఞానమును ఉపదేశించినది. ఆ జ్ఞానమే ఆయుధమయ్యెను. ఆమె తన పుత్రునకు పలు ఆశీస్సులను పల్కెను. ఆ ఆశీస్సులే సేనవలె తోడుగా నిలచి, అతని విజయమునందించెను. యుద్ధమున ధర్మమార్గమునే అనుసరించునట్లు ఆమె ఉపదేశమును చేసెను. ఆ ధర్మపథమే ఆమె అతనికి తొడిగిన కవచమయ్యెను. ఎట్టి ఆపద కలుగ కుండ కాపాడెను. అతనికి ఆహారముగా దుష్టులు నివసించు ఒక శబరపట్టణమును చూపెను. ఇవి వినత తన పుత్రుడగు గరుడునకు చేసిన రక్షణ వ్యాపారములు. ఇట్లు శత్రువులతో చేసికొనిన ఒప్పందము ప్రకారము వినతకు కల్గిన దాస్య దుఃఖమును తీర్చుటకు పణముగా కద్రువకు ఇవ్వవలసిన అమృతమను భిక్షను సంపాదింపనెంచి బయలుదేరిన గరుడుడు మన పాపములను పోగొట్టునుగాక !

**వినత కద్రువకు దాసి అయిన వృత్తాంతము :** కశ్యపప్రజాపతికి కద్రువ, వినత అను ఇద్దఱు భార్యలు కలరు. కద్రువయు, వినతయు తమ తమ అందములను గూర్చి వాదులాడుకొనెడివారు. కద్రువకు సర్పములు పుట్టెను. వినతకు గరుడుడు జనించెను. ఇంద్రుని గుఱ్ఱమగు ఉచ్చైః శ్రవము తెల్లనిది. దాని వర్ణమును గూర్చి ఒకప్పుడు వారిద్దఱు వివాదపడిరి. కద్రువ ఆ గుఱ్ఱము తోక నల్లనిది అనెను. వినత కాదనెను. మరునాడు నేరుగా గుఱ్ఱమును చూచి, యధార్థమును తెలిసికొనవలయునని

ఇద్దఱును తీర్మానించుకొనిరి. మఱియు ఆ పందెములో ఎవరు గెలుతురో వారికి రెండవ వారు దాస్యము చేయవలయుననియు ఒప్పందము చేసికొనిరి. వంచనాబుద్దిని కల కద్రువ రహస్యముగా తన పుత్రులతో తమ ఒప్పందమును గూర్చి తెలిపి, ఆ గుఱ్ఱము తోకను చుట్టికొని యుండి, దానిని నల్లగా కన్పించునట్లు చేయుడని పల్కెను. కర్కోటకుడను సర్పరాజు ఆమె మాటలకు తలొగ్గి ఉచ్చైః శ్రవము తోకకు చుట్టుకొనగా, ఆతోక నల్లగా కన్పించెను. మరునాడు కద్రువ, వినతయు ప్రత్యక్షముగా ఉచ్చైః శ్రవమును చూడగా, దానితోక నల్లగా తోచెను. జరిగిన మోసమును వినత గ్రహింపలేక పోయెను. ఆమె తన ఓటమిని అంగీకరించి కద్రువకు దాస్యమును చేయుచుండెను. పిమ్మట ఒకానొక సమయమున కద్రువ పుత్రులవలన గరుడుడు తాను దేవతలవద్దగల అమృతమును తెచ్చి ఇచ్చినచో తన తల్లి దాసీతనము తీరునని విని, దేవలోకమునకు పోయి, అమృతమును తెచ్చి తనతల్లిని దాస్యము నుండి విముక్తురాలిని చేసెను.

ఈ వృత్తాంతమును శ్రుతియు తెలుపుచున్నది. ఆ శ్రుతి వాక్యము లివి - **"కద్రూశ్చ వై సుపర్ణీ చాత్మరూపయో రస్పర్ధేతాగ్ం సా కద్రూః సుపర్ణీ మజయత్యాబ్రవీత్ తదీయ స్యా మితోదివి సోమత్వమాహరతేనాత్మానం నిష్క్రీణీష్వ".**

**(విజయచమూ రాశిషః) - పునః ప్రోవాచ వినతా పుత్రహార్దా దిదం వచః, జానంత్యప్యతులం వీర్య మాశీర్వాదసమన్వితమ్"** ఇత్యాదిగా వినత పల్కిన ఆశీర్వాదములే సైన్యముగా రూపితములు.

**(అశనం పక్ష్మణం నిర్దిశంత్యా) - "సముద్ర మక్షా వేకాంతే నిషాదాలయ ముత్తమమ్, భవనాని నిషాదానాం తత్ర సంతి ద్విజోత్తమ, పాపినాం నష్టలోకానాం నిర్ఘృణానాం దురాత్మనామ్, సహస్రాణా మనేకానాం తాన్ భుక్త్వామృత మాహర"** అను భారతశ్లోకములు అనుసంధేయములు.

**(క్లిప్తరక్షావిశేషః) - "పక్షౌ తే మారుతః పాతు చంద్రః పృష్ఠం చ పుత్రక, శిర స్తు పాతు తే వహ్నిః భాస్కరః సర్వ మేవ తు, విష్ణుః సర్వగత స్సర్వ మంగాని తవ చైవ హ"** అనుచు వినతచేసిన మంగళాశాసనము ఇచట అనుసంధింపతగినది. దీనిని వాల్మీకి భగవానులును శ్రీరామాయణమున -**"యన్మంగళం సుపర్ణస్య వినతాఽ కల్పయత్ పురా, అమృతం ప్రార్థయానస్య"** -అనుచు కౌసల్యావచనముల ద్వారా తెలియజేసిరి.

**ఏనోఽ స్మ ద్వైనతేయో నుదతు**

**గరుడుడు స్వర్గముపై దండెత్తుట**

**13.** **విక్షేపైః పక్షతీనా మనిభృతగతిభిః వాదితవ్యోమతూర్యో-**
**వాచాలాంభోధినీచీవలయవిరచితాలోకశబ్దానుబంధః ।**
**దిక్కన్యాకీర్యమాణక్షురదుడునికరవ్యాజలాజాభిషేకో**
**నాకోన్మాథాయ గచ్ఛన్ నరక మపి స మే నాగహంతా నిహంతు ॥**



పక్షతీనామ్ = ఱెక్కలయొక్క, అనిభృతగతిభిః = ఎడతెగని చలనములనుకల, విక్షేపైః = వీవనలచే, వాదితవ్యోమతూర్యః = ఆకాశమునందు మ్రోగించబడిన తూర్యవాద్యములను కలవాడు, వాచాల = మిక్కిలి ధ్వనించునట్టి, అంబుధి = సముద్రముయొక్క, వీచీ = కెరటముల, వలయ = సమూహముచే, విరచిత = చక్కగా చేయబడిన, అలోకశబ్దానుకారః = జయ శబ్దముల, అనుకరణముయొక్క, అనుబంధః = నిరంతరానువర్తిని కలవాడు, దిక్కన్యా = దిక్కులను కన్యలచే, కీర్యమాణ = వెదజల్ల బడుచున్న, క్షురత్= చిందుచున్న, ఉడునికరవ్యాజ = నక్షత్రముల సమూహము అను వ్యాజముచే (రూపముతో), లాజ + అభిషేకః = లాజల అభిషేకమును కలవాడు, నాక+ ఉన్మాథాయ = స్వర్గమును క్షోభిల్లచేయుటకు , గచ్ఛన్ = వెడలువాడును , సః = ఆ, నాగహంతా = సర్పములను చంపువాడును అగు గరుడుడు, మే =నాయొక్క, నరకమ్+ అపి = నరకమును, నిహంతు= నశింపచేయునుగాక !

లోకమున రాజపుత్రుడు శత్రువులను జయించి యుద్ధరంగము నుండి వచ్చునపుడు అతని విజయసూచకముగా నగరమున తూర్యవాద్యము మ్రోగింపబడును. వందిమాగధులు **"జయ జయ"** శబ్దములను చేయుదురు. కన్యకలు మంగళాత్మకమైన లాజవర్షమును రాజుపై కురిపింతురు. అట్లే, గరుడుడు అమృతమును తెచ్చుటకు పోవునపుడు అతని ఱెక్కలు వేగముగా నిరంతరము కొట్టుకొనుటచే పుట్టిన ధ్వని అతని విజయమును సూచించు మంగళతూర్యనాదమై తోచెను. సముద్రమున పుట్టిన కెరటముల సమూహము గొప్ప సవ్వడిని చేయుట జయ జయ శబ్దములను చేసినట్లుండెను. గరుడుడు ఎగిరినపుడు చెదఱి రాలిన నక్షత్ర సమూహములు కన్యలు కురిపించు లాజవర్షమై కనుపించెను. ఇట్లు దేవలోకముపై దండెత్తి పోవు గరుడభగవానుడు మన నరకము కూడ నశింపచేయునుగాక. శ్లోకమున **"వ్యోమతూర్య,దిక్కన్యా"** ఇత్యాది ప్రయోగములలో రూపకము కలదు. ఈ శ్లోకభావమును వివరించుచు సంస్కృతవ్యాఖ్యాత **"యుద్ధార్థం ప్రస్థితస్య రాజకుమారస్య యథా వా పటహాదివాద్యరవ స్తుతి పాఠకజయకథనాని, కుమారీభిః క్లిప్తలాజనికరపతనాదీని మంగళార్థం దృశ్యంతే, తథాఽస్యాపి సంభవతీతి భావః."**

**నాగహంతా మే నరకం నిహంతు**

**గరుడుని ఱెక్కల గాలిచేయు భయంకరమైన నృత్యము**

**14.** **ఋక్షాక్షక్షోదదక్షో మిహిరహిమకరోత్తాలతాలాభిఘాతీ**
**వేలావాఃకేళిలోలో వివిధఘనఘటాకందుకాఘాతశీలః ।**
**పాయా న్నః పాతకేభ్యః పతగకులపతేః పక్షవిక్షేపజాతో**
**వాతః పాతాళహేలాపటహపటురవారంభసంరంభధీరః ॥**

ఋక్ష = నక్షత్రములనెడి, అక్ష=పాచికలను, క్షోభ = క్షోభపెట్టుటలో, దక్షః = సమర్థమైనది, మిహిర =

సూర్యుడు, హిమకర = చంద్రుడు అను, ఉత్తాల = ఉన్నతమైన, తాళ = తాళములను అభిఘాతీ = కొట్టునది, వేలా = సముద్రతీరమునందు చేయు, వాఃకేళి = జలక్రీడలో, లోలః = చాపల్యమును కల్గిన, వివిధ = అనేకములైన, ఘనఘటా = మేఘముల సమూహమనెడి, కందుక = బంతిని, ఆఘాతశీలః = కొట్టునట్టి స్వభావమును కల్గినది, పాతాళ = పాతాళలోకమున, హేలా = విలాసముగా మ్రోగించు, పటహ = పటహమను (డప్పు) వాద్యము యొక్క , పటురవ = గొప్పశబ్దమను, ఆరంభ = ప్రారంభించుటలో, సంరంభధీరః = సంరంభమును (ఉత్సాహమును) కల్గినది అగు, పతగకులపతేః = గరుత్మంతునియొక్క, పక్ష = తెక్కల, విక్షేప = చలనములచే, జాతః = పుట్టిన, వాతః = గాలి నః = మనలను, పాతకేభ్యః = పాపములనుండి, పాయాత్ = రక్షించునుగాక !

గరుడుడు అమృతమును తెచ్చుటకు అకాశమున ఎగిరి పోవునపుడు అతడు తెక్కలను వేగముగా కదలుచు పయనించెను. అందువలన గొప్పగాలి పుట్టెను. ఆ గాలి నక్షత్రములను అన్నింటిని జూదములోని పాచికలనువలె చెల్లా చెదఱు చేసెను. ఆకాశమున వేర్వేరు స్థలములలోనున్న సూర్యుని, చంద్రుని ఒక చోట చేర్చి, తాళము వేసినగది. సముద్రమువైపు ఆగాలి పోవునపుడు పలు విధములైన జల క్రీడావిన్యాసములను చేసినది. మేఘముల సమూహమును బంతివలె దూరముగా విసరికొట్టినది. పాతాళలోకమున పటహమను వాద్యము మ్రోగునట్లు గొప్ప శబ్దమును చేసినది. ఇట్టి విన్యాసములనుచేయు గరుడభగవానుని తెక్కల గాలి మన పాపములను పోగొట్టునుగాక

చతురుడైనవాడు ఒకప్పుడు పాచికల ప్రక్షేపణమును, తాళములను మ్రోగించుటను, సముద్రజలములను, కలుషితములుగా చేయుటను, బంతిని ఆడుటను, పటహమును మోగించుటను చేయునో, అట్లే గరుడుని తెక్కలవలన పుట్టిన గొప్ప గాలి నక్షత్రములను చెల్లా చెదఱు చేయుటను, సూర్యచంద్రులను తాళములవలె మ్రోగించుటను, సముద్రమును కలియ బెట్టుటను, మేఘములను బంతిగా ఆడుటను, పాతాళమున పటహధ్వనివలె శబ్దమును చేయుటయును నిర్వహించెనని తాత్పర్యము. నిజమునకు వీనినన్నిటిని ఏకకాలమున నిర్వహించుట ఎవ్వరికిని సాధ్యము కాదు, కావున అతిశయోక్తి అలంకారము కలదు. **'మిహిరహిమకరోత్తాల...., వివిధఘనఘటాకందుక"** ఇత్యాది ప్రయోగములలో రూపకమును కలదు. ఈ శ్లోకసారము సంస్కృతవ్యాఖ్యానమున ఇట్లు వివరింపబడినది. **"అంతరిక్షే గరుత్మతి ఉడ్డీనాదిగతిం తన్వతి సతి, తత్పక్షప్రచలనసంజాతః ప్రభంజనః, చతురః యథా క్వచిత్ క్వచిత్ సమయే శారఫల(క) ప్రక్షేపణం, తాళసంఘట్టనం, జలకేళీం, కంతుకాహతిం, పటహతాడనాదికంచ కరోతి, తథైకదైవ అక్షవత్ నక్షత్రవిక్షేపణం, తాళయుగవత్ చంద్రసూర్యసంఘట్టనం, సముద్రజలకాలుష్యం, కంతుకవత్ స్థూలసూక్ష్మమేఘజాలాహతిం, పటహవత్ పాతాళలోకధ్వనిరూపణం చ తనోతీతి భావః"**. మొదటి పాదమున **"క్షేపదక్షః"** అనుపాఠాంతరము సంస్కృతవ్యాఖ్యలో చూపబడినది.

**పాయా న్నః పాతకేభ్యః పతగకులపతేః పక్షవిక్షేపజాతః వాతః**



## శబరుల కులమును గరుడుడు భక్షించుట

**15.** **కిం నిర్ఘాతః కి మర్కః పరిపతతి దివః కిం సమిద్ధోఽయ మౌర్వః**
**కింస్విత్ కార్తస్వరాద్రిః నను విదిత మిదం వ్యోమవర్త్మా గరుత్మాన్ ।**
**ఆసీదత్యాజిహీర్షత్యభిపతతి హరత్యత్తి హా తాత హాఽంబే-**
**త్యాలాపోద్యుక్తభిల్లాకులజఠరపుటః పాతు నః పత్త్రినాథః ॥**

అయమ్ = ఇది, దివః= ఆకాశమునుండి, పరిపతతి = క్రిందకు పడుచున్నది, నిర్ఘాతః కిమ్ =పిడుగా ఏమి, అర్కః కిమ్ = సూర్యుడా ఏమి ? సమిద్ధః = మిక్కిలి జ్వలించు, ఔర్వః కిమ్ = బడబానలమా ఏమి ? కింస్విత్ =ఒకవేళ, కార్తస్వర + అద్రిః = మేరుపర్వతమా ? (కాదు, కాదు) ఇదమ్ = ఈవస్తువు, వ్యోమవర్త్మా = ఆకాశమును మార్గముగా కల, గరుత్మాన్ నను = గరుడుడుకదా ! విదితమ్ = తెలసినది. ఆసీదతి = (ఇదిగో) దగ్గఱకువచ్చుచున్నాడు, ఆజిహీర్షతి = తనవద్దకు తీసికొనగోరుచున్నాడు. అభిపతతి = పైనపడుచున్నాడు. హరతి =తీసికొనిపోవుచున్నాడు, అత్తి = తినుచున్నాడు, హ ! తాత = అయ్యో ! తండ్రీ !, హా ! అంబ = అయ్యో ! తల్లీ, ఇతి = అని, ఆలాప+ ఉద్యుక్త = పలుకుట ప్రారంభించిన, భిల్ల +ఆకుల = భిల్లులతో నిండిన, జఠరపుటః = ఉదరపుటమునుకల, పత్త్రినాథః=గరుడుడు, నః = మనలను , పాతు = రక్షించునుగాక

గరుడుడు తన తల్లి మాటపై మొదట దుష్టకులమును ఆహారముగా గొనుటకు ఆకాశమున ఎగిరి పోయెను. అపుడు శబరకులములోనున్న జనులు తమవైపు ఎగురుచూవచ్చు చున్న ఒక పెద్ద వస్తువును (గరుడుని) చూచి అది ఏమని తెలియని వారై, దిగ్భ్రమను పొందిరి. వారు ఆ ఆకారమును ఆకాశమునుండి క్రిందికి పడు పిడుగా? ఏమి ? అని మొదట అనుకొనిరి. పిమ్మట సూర్యుడే వేగముగా వచ్చుచున్నాడనుకొనిరి. అనంతరము సముద్రమునుండి బడబాగ్నియే ఒకవేళ ఎగసి వచ్చురున్నదని తలచిరి. పిమ్మట మేరుపర్వతమే ఎగిరివచ్చున్నదని భావించిరి. పిమ్మట అతి సమీపమునకు వచ్చిన గరుడుని చూచి, "సరి ! సరి ! నిజము తెలిసినది. ఇతడు గరుడుడు కదా ! ఆకాశమునఎగురుచు వచ్చుచున్నాడు, అయ్యో ! ఇదిగో ఇతడు మిక్కిలి సమీపమునకు వచ్చెను. మనలకు పట్టుగొనగోరుచున్నడే ! ఔను. ఇదిగో ! మనపై పడుచున్నాడే ! ఇదిగో జనమును గొని పోవుచున్నాడే! ఇదిగో తన నోటిలో వేసికొని మింగుచున్నాడే ! అయ్యో ! తండ్రీ ! తల్లీ !" అని ఇట్లు భిల్లకులములోని జనులు ఆక్రోశింపగా, వారిని తన ఉదరమున గ్రహించి, జీర్ణము చేసికొనిన గరుడభగవానుడు మనలను రక్షించుగాక !

**"కిం నిర్ఘాతః"** - పిడుగా ఏమి - అని మొదలుగాగల సందేహము లన్నియు - గరుడుడనెడి నిశ్చయమందు పర్యవసించుటచే నిశ్చయాంతమైన సందేహాలంకారము ఇందు కలదు.

**పాతు నః పత్త్రినాథః**

### గరుడుడు భిల్లకులమును పారణచేయుట

**16.** **ఆస్రృక్క్యాప్తై రసృగ్భిః దురుపశమతృషాశాతనీ శాతదంష్ట్రా-**
**కోటీలోటత్కరోటీవికటకటకటారావఘోరావతారా ।**
**భింద్యాత్ సార్ధం పుళింద్యా సపది పరిహృతబ్రహ్మగా జిహ్మగారేః**
**ఉద్వేల్లద్భిల్లపల్లీనిగరణకరణా పారణా కారణాం నః ॥**

ఆసృక్వి = నోటిచివరవరకు, ఆప్తైః = వ్యాపించిన, అసృగ్భిః = రక్తములచే, దురుపశమ = (వేరుదేనివలనను) తగ్గింపసాధ్యము కాని, తృషా = దాహమును. శాతనీ = అణచునది, శాత = పదునైన, దంష్ట్రా = కోఱలయొక్క, కోటీ = అగ్రభాగములచే, లోటత్ = బ్రద్ధలుచేయుబడుచున్న కరోటీ = పుఱ్ఱెల ముక్కలయొక్క, వికట = భీకరమైన, కటకట+ఆరావ = కటకటమను శబ్దముచే, ఘోర + అవతారా = భయంకరమైన ఉపక్రమమును కల్గినది, ఉద్వేల్లత్ = మిక్కిలి పొంగి పొర్లు చున్న, భిల్ల = భిల్లుల, పల్లీ = గ్రామమును, నిగరణకరణా = గ్రహించుటను సాధనముగా గల్గినదగు, పుళింద్యాసార్ధం=శబర స్త్రీతో పాటు, సపది=వేగముగా, పరిహృతబ్రహ్మగా=విడిచిన బ్రాహ్మణుని కల్గినది, జిహ్మగ + అరేః = పాములకు శత్రువగు గరుడునియొక్క, పారణా = పారణము, నః కారణామ్=మన తీవ్ర దుఃఖమును, భింద్యాత్ = పోగోట్టునుగాక !

గరుడుడు శబరకులమును ప్రవేశించి, వారిని భుజించి రక్తము తాగినపుడు వారి రక్తము గరుడుని ఉదరమున నిండి, ఆకంఠము వచ్చెను. వేరు దేనివలనను శాంతింపని గరుడుని ధాహము అట్టి రక్తముచే ఉపశమించెను. గరుడుని పదునైన కోఱపళ్లయొక్క మొనలలో భిల్లుల పుఱ్ఱెలు పగిలి ముక్కలు ముక్కలుగా అయినవి. అవి పగులునపుడు కటకటమను కఠోరమైన శబ్దమువచ్చెను. ఇట్లు గరుడుని పారణము మిక్కిలి భయంకరమై కన్పడినది.

భిల్లులను గరుడుడు తినునపుడు ఒక బ్రాహ్మణుడు, అతని భార్య అగు భిల్లమహిళయు గరుడుని నోటిలోనికి పోయిరి. అపుడు గరుడుడు ఆ బ్రాహ్మణుని అతని భార్యతోపాటు బయటకు విడచెను. గరుడుడు తన ముక్కుతో భిల్లులను గుచ్చి గ్రహించునపుడు వారు విలవిలలాడిరి. ఇట్లు వారిని అందఱను మింగి ,తన పారణను గరుడుడు పూర్తిచేసెను. అట్టి పారణ మన దుఃఖమును తీర్చునుగాక।

గరుడుడు తన తల్లి ఆజ్ఞ చొప్పున శబరకులమును భుజించుటకు పోవునపుడు, వినత అతనిచో "భిల్లుతో పాటు ఎవరైన బ్రాహ్మణుడు ఉన్నచో, అతనిని మాత్రము భుజింపవల''దని పల్కెను. ''శబరకులములోని బ్రాహ్మణుని గుర్తించుట ఎట్లు?'' అని గరుడుడు తల్లిని ప్రశ్నించెను. భుజించునపుడు కంఠమునందు బాధకల్గినచో, అపుడు బ్రాహ్మణుని మింగినట్లు గుర్తింపుమని ఆమె



బదులు పల్కెను. అట్లే గరుడుడు తన గొంతు మండుటచే గొంతులో బ్రాహ్మణుడు ప్రవేశించెనని గుర్తించి, అతనిని తన కంఠమునుండి బయటకు విడచెను. కాని, ఆ బ్రాహ్మణుడు మాత్రము తన భార్య అగు భిల్లస్త్రీని వదలి బయటకు రాకుండెను. అపుడు గరుడుడు వారిద్దరిని బయటకు విడచెను. మిగిలిన శబరకులమును భక్షించెను - అను కథ మహాభారతములో సుపర్ణోపాఖ్యానమున కలదు. ఈకథయే ప్రస్తుత శ్లోకమున ప్రస్తావింపబడినది. **"తృషాశాతనీ"** ఇత్యాది ప్రయోగములలో రూపకము కలదు. రెండవపాదమున, నాల్గవపాదమున శబ్దాలంకారము స్పష్టము. **"కారణా"** అనగా తీవ్రవేదన అని అర్థము. **"కారణా తీవ్రవేదనా"** అని అమరము. **"దురుపరమ"** అని వేరొక పాఠము.

### జిహ్మగారేః పారణా నః కారణాం భింద్యాత్

### గరుడుని సంతోషాతిశయము

**17.** **స్వచ్ఛందస్వర్గిబృందప్రథమతమమహోత్పాతనిర్ఘాతఘోరః**
**స్వాంత ధ్వాంతం నిరుంధ్యా ద్ద్రుతధరణిపయోరాశి రాశీవిషారేః ।**
**ప్రత్యుద్యద్భిల్లపల్లీభటరుధిరసరిల్లోలకల్లోలమాలా -**
**హాలానిర్వేశహేలాహలహలబహుళో హర్షకోలాహలో నః ॥**

స్వచ్ఛంద = స్వతంత్రులైయున్నవారగు, స్వర్గిబృంద = దేవసమూహములకు, ప్రథమతమ = మొట్టమొదటగా రాబోవు, మహా + ఉత్పాత = గొప్ప కీడును సూచించు, నిర్ఘాత = పిడుగు వలె, ఘోరః = భయంకరమైనది, ద్రుత = చెల్లాచెదఱు చేయబడిన, ధరణి = భూమిని, పయోరాశిః = సముద్రమును కల్గినది, ప్రత్యుద్యత్ = ఎదురుగావచ్చుచున్న, భిల్లపల్లీభట = భిల్లవీరులయొక్క రుధిరసరిత్ = రక్తనదినందు, లోల = కదలాడు, కల్లోల = కెరటముల, మాలా = వరుసలు అను హాలా = మధువును, నిర్వేశ = త్రాగుటచే కల్గిన, హేలాహలహలబహుళః = హలహలమను విలాస ధ్వనినిండినవాడగు, ఆశీవిష+అరేః = సర్పములకు శత్రువగు గరుడుని యొక్క, హర్ష కోలాహలః = ఆనంద సంరంభము, నః = మనయొక్క, స్వాంత ధ్వాంతమ్ = మనస్సులోనున్న అజ్ఞానమును. నిరుంధ్యాత్ = నశింపచేయుగాక !

గరుడుడు శబరకులమును ప్రవేశించి దానిని భక్షించి కోలాహలమును చేసెను. అతడు విలాసముగా చేసిన ఆ ధ్వని దేవలోకమునందు అంతట ప్రతిధ్వనించినది. ఆ ధ్వని అంతవరకు స్వతంత్రులైయున్న దేవలోకవాసులకు రాబోవు ప్రమాదయును సూచించు అపశకునమగు పిడుగువలె భయంకరమైయుండెను. త్వరలో గరుడుడు అచటకు వచ్చి భయంకరమైన యుద్ధమును చేసి, జయమును పొంది అమృతమును గైకొని పోగలడు కదా ! అది దేవలోకమునకు సంభవింపబోవు ప్రమాదమే కదా ! గరుడుని ఆ కోలాహల ధ్వని భూమిని, సముద్రమును కదల్చివేసినది.

శబరకులములోని వీరులందఱు తనను ఎదిరింప వచ్చినపుడు వారిని నలిపివేయుటచే కారిన రక్తము వరదలై పాఱినది. దానిని గరుడుడు పానము చేయునపుడు మధువును త్రాగినట్లు హలహలమను శబ్దమును చేసెను. గొప్ప ఆనందమువలన అతడు చేసిన ఆ భయంకరమైన కోలాహలధ్వని మన మనస్సులోనున్న అజ్ఞానమును అంతటిని పారదోలును గాక !

**"స్వచ్ఛందః"** అనునంతవరకు ప్రత్యేకమైన పదముగా గ్రహించి, దానిని హర్ష కోలాహలమునకు విశేషణముగా చేసి, అర్థమును చెప్పవచ్చును అని సంస్కృతవ్యాఖ్య. **"నిర్ఘాతఘోర"** అనుచోట **'ఇవాది'** ఉపమావాచకము ప్రయోగింపబడకపోవుటచే లుప్తోపమాలంకారము **"కల్లోలమాలా"** అనునపుడు రూపకము కలదని చెప్పవచ్చును. సంస్కృతవ్యాఖ్యానములో ఈ శ్లోకభావము ఈ విధముగా తెలుపబడినది. **"అయం భావః- యథా వా సురాపానహర్షాత్ హలహలశబ్దం కరోతి, తథా పుళిందభటరక్తపాయినా గరుత్మతా హృష్టేన తృప్తేన కలితోఽతిప్రభూతః క్రూరః సురహృదయధైర్యభేదకలీలాకోలాహలో విలువితభువనత్రయో మమ పుత్రాదివిషయమోహాంధకారం దూరీకరోత్వితి.**

**ఆశీవిషారేః హర్షకోలాహలః నః స్వాంతధ్వాంతం నిరుంధ్యాత్**

**గరుడుడు తాబేలును, ఏనుగును భక్షించుట**

18. **పాంద్రక్రోధానుబంధాత్ సరసి నఖముఖే పాదపే గండశైలే**
**తుండాగ్రే కంఠరంధ్రే తదను చ జఠరే నిర్విశేషం యుయుత్సూ ।**
**అవ్యా దస్మా నభవ్యా దవిదితనఖరశ్రేణిదంష్ట్రాభిఘాతౌ**
**జీవగ్రాహం గృహీత్వా కమఠకరటినౌ భక్షయన్ పక్షిమల్లః ॥**

సాంద్ర = అధికమైన, క్రోధ = కోపముయొక్క, అనుబంధాత్= అనువృత్తివలన, సరసి = చెఱువులో, నఖముఖే = నఖముల మొనలయందును, పాదపే = వృక్షమునందు, గండశైలే = పెద్ద రాతిపలకలపైనను, తుండ + అగ్రే = (గరుడుని) ముక్కుచివరలో, కంఠరంధ్రే = (గరుడుని) గొంతు ద్వారములో, తదను చ = అనంతరము, జఠరే = ఉదరమున, నిర్విశేషమ్ = ఎట్టిభేదములేక, యుయుత్సూ = పోరాడ గోరినవి, అవిదిత = తెలియబడని, నఖరశ్రేణి, = గోళ్లవరుస, దంష్ట్రా = కోఱలు అనువీనియొక్క, అభిఘాతౌ = ప్రహారములనుకల్గినవి అగు, కమఠ కరటినౌ = తాబేలును, ఏనుగును, జీవగ్రాహమ్ = బ్రతికియుండగానే, గృహీత్వా = గ్రహించి, భక్షయన్ = భక్షించు, పక్షిమల్లః = పక్షిరాజు, అస్మాన్ = మనలను, అభవ్యాత్ = అమంగళము నుండి, అవ్యాత్ = రక్షించునుగాక !

పూర్వము ఒకానొక సమయమున విభావసు - సుప్రతీకులను ఇద్దరు మునిసోదరులు తమ సంపదను పంచుకొనుటలో తగవులాడుకొనిరి, ఇద్దఱును కొపముతో ఒకరిని ఇంకొకరు శపించుకొనిరి. ఆ శాపవశముచే విభావసు కూర్మముగను, సుప్రతీకుడు ఏనుగుగను మారెను. అట్లు



రూపములు మారినను పూర్వపు క్రోధము విడువక, వారు పోరాడసాగిరి. ఈ సమయమున గరుడుడు శబరకులమును పూర్తిగా భక్షించినను అతని ఆకలి తీరకుండుటచే, తల్లిని ఆహారము కొఱకు మరల అడుగగా, ఆమె కూర్మగజరుపములలో నున్న విభావను, సుప్రతీకులను భక్షింపుమనెను. గరుడుడు ఆరెండిటిని జీవించియుండగానే పట్టుకొని, అచటకు దగ్గఱలోనున్న సరస్సువద్దకు పోయెను. అచట కూడ వారిరువురు పోరాడసాగిరి. వెంటనే గరుడుడు ఆరెండిటిని తన గోళ్లతో గీఱి, పట్టుకొని మఱ్ఱిచెట్టుకు, పిమ్మట ఒకపెద్ద రాతిబండకును, తన ముక్కు అగ్రభాగమునకును పెట్టి రాచి, పిమ్మట, తన గొంతులోనికి మింగెను. వానిని ఎక్కడకు తీసికొని పోయినను, ఏమిచేసినను అవి తగవులాడుట మానలేదు. పోరాడుటలోనే అసక్తులైయున్న ఆరెండిటిని గరుడుడు తన గోళ్ళతో, ముక్కుతో, పళ్లతో బాధించినను ఆబాధను అవి గ్రహించలేదు. ఇట్లు ఆరెండిటిని గరుడుడు జీవగ్రాహముగా పట్టుకొని ,చివరగా తన ఉదరమున గ్రహించెను. అంతటితో అతనికి తృప్తి కల్గెను. ఇట్టి గరుడభగవానుడు మనకు అమంగళము రాకుండునట్లు కాపాడునుగాక.

పక్షులు తమకు లభించిన ఆహారమును సరస్సువద్దకాని, చెట్టుపైకాని, గండశిలలపైకాని పెట్టుకొని తినుట అలవాటు. గరుడుడు గజకచ్ఛపములను అట్లే భక్షించెను. గజకచ్ఛపములను రెండిటిని పట్టుకొనిన గరుడుడు వానిని ఒక పెద్దమఱ్ఱి చెట్టు కొమ్మపై పెట్టి తినబోయెను. కాని, ఆ కొమ్మ అతని బరువుకు విరిగిపోయెను. ఆ కొమ్మను ఆశ్రయించి వాలఖిల్యమునులు తపస్సును చేసికొనుచుండిరి. వారితపస్సును భంగముకల్గును భయముతో గరుడుడు ఆకొమ్మను పుళింద దేశమున విడచి, పిమ్మట గజ కచ్ఛపములను గండశిలపై భక్షించెను. ఈవృత్తాంతము భారతములో కలదు. **"ద్రంష్టానివేశే"** అని పాఠాంతరము. కోఱపళ్ళమధ్యపెట్టబడినవని అర్థము.

**పక్షిమల్లః అస్మాన్ అభవ్యాత్ అవ్యాత్**

**నాగముల పరిహాసమునకు గరుడుని సమాధానము**

19. **అల్పః కల్పాంతలీలానటముకుటసుధాసూతిఖండో బహూనాం**
**నిస్సార స్త్వద్భుజాద్రే రనుభవతు ముధా మంథనం త్వేష సింధుః ।**
**రాకాచంద్ర స్తు రాహోః స్వ మితి కథయతః ప్రేక్ష్య కద్రూకుమారాన్**
**పాంతర్హాసం ఖగేంద్రః సపది హృతసుధ స్త్రాయతా మాయతా న్నః ॥**

కల్ప + అంత = ప్రళయకాలమున, లీలానట = విలాసముగా నర్తించు శివుని యొక్క, ముకుట = శిరస్సులోనున్న, సుధాసూతిఖండః = చంద్రఖండము, బహూనామ్ = అనేకులమగు మాకు, అల్పః = అల్పమైనది, నిస్సారః = సారములేనిది అగు, ఏష సింధుః = ఈ సముద్రము, త్వత్ భుజాద్రేః = కొండవంటి నీ భుజము చే, ముధా= వ్యర్థముగా చేయబడు, మంధనం తు = మథనమును, అనుభవతు = అనుభవించుగాక, రాకాచంద్రః +తు = పూర్ణిమాచంద్రుడును, రాహోః స్వమ్ = రాహువు సొత్తు,

ఇతి = అని, కథయతః = పల్కుచున్నట్టి, కద్రూకుమారాన్ = కద్రువకుమారులగు సర్పములను, ప్రేక్ష్య = చూచి, స్వాంతర్హాసమ్ = లోపలనే నవ్వుకొనుచు, సపది = వెంటనే , హృత - సుధః = అపహరించిన అమృతమునుకల, ఖగ+ఇంద్రః = గరుడుడు, నః = మనలను, ఆయతాత్ = చాలకాలము , త్రాయతామ్ = రక్షించుగాక !

గరుడుడు అమృతమును కొనివచ్చుటకు పోవునపుడు అతని సవతి తల్లి పుత్రులగు నాగములు అతనిని చూచి పరిహాసముగా ఇట్లు పల్కుచుండిరి. "నీవు ఎక్కడ నుండి అమృతమును తీసికొనిరాగలవు ? శివుడు ప్రళయకాలమున విలాసముగా నాట్యమును చేయును. అతని శిరస్సు పై చంద్రుని ఖండము కలదుకదా ! దానినుండి అమృతమును తీసికొనివచ్చెదవా ? అట్లయినచో ఆ ఖండమునుండి అమృతము కొంచెముగానే లభించును. అచట నున్నది చంద్రఖండమే కదా ! అది మాకు ఎట్లు సరిపోవును ? మేము అనేకులము కదా ! కావున అట్లు చేయుట నిష్ఫలము. ఒకవేళ పాల సముద్రము నుండి అమృతమును తెచ్చెదనని తలంచుచుంటివా ? అదియు వ్యర్థమే. ఇంతకుముందే భగవానుడు సముద్రమును చిలికి, అందలి సారమగు అమృతమును గ్రహించుటచే , సముద్రము నిస్సారమై యున్నది. పర్వతమువంటి నీ భుజములతో నీవు మరల చిలుకుటవలన నీవు పడు వ్యర్థశ్రమను సముద్రమును అనుభవింపవలసివచ్చును . అంతియే తప్ప ఫలము లేదు. ఆకాశములో నున్న పూర్ణచంద్రుని వద్దనుండి అమృతమును తీసికొనివత్తువా ? అదియును సాధ్యముకాదు. ఆ అమృతము రాహువునకు స్వంతము. దానిని తీసికొనుటకు అతడు అంగీకరింపడు. మఱియు ఆ అమృతము రాహువుయొక్క ఎంగిలి. కావున దానిని మేము గ్రహింపము. అందుచే నీవు ఎట్లు అమృతమును తీసికొనిరాగలవు ? ఎట్లు నీ తల్లిని దాస్యమునుండి విడపింపగలవు'' ? -అనుచు ఇట్లు వేళాకోళమును చేయుచు పల్కుచున్న సర్పములను చూచి గరుడుడు తనలో నవ్వుకొనుచు, వెంటనే అమృతమును తెచ్చి వారికిచ్చెను. అట్టి గరుడభగవానుడు మనలను రక్షించునుగాక !

నాగములు గరుడుని పరిహాసము చేయుట, వారి అట్టిమాటలను విన్నను గరుడుడు కోపగింపక, మనస్సులోనే నవ్వుకొనుటయు - నాగముల తమోగుణ ప్రకృతిని, గరుడుని సత్త్వగుణాత్మకతను తెలుపును. **"భుజాద్రి"** అను ప్రయోగమున రూపకాలంకారము కలదు. ఈ శ్లోకతాత్పర్యము సంస్కృతవ్యాఖ్యానములో క్రిందివిధముగా తెలుపబడినది. **"అయం భావః - రుద్రమౌళిభూషణామృత - ఖండ శ్చేదస్మాక మతృప్తికరః. పున రపి స్వభుజబలేన క్షీరసముద్రమథనం గతసారత్వాత్ వ్యర్థ మేవ. పర్వచంద్రబింబం పరద్రవ్యం విధుంతుదోచ్ఛిష్టం చాగ్రాహ్యం, కుత్రాప్యనేన మాతృదాస్య నిరాసార్థమమృతం న లభ్యత ఇతి హసతాం శాత్రవాణాం అగ్రత ఏవ తస్మి న్నేవ క్షణే స్వర్గలోకా దమృత మాహృత్య సమాగచ్ఛ దితి".**

**హృతసుధః ఖగేంద్రః నః ఆయతాత్ త్రాయతాత్**



## దేవలోకమున గరుడుని కోలాహలము

**20. ఆరా దభ్యుత్థితైరావత మమితజవోదంచదుచ్చైఃశ్రవస్కం**
**జాతక్షోభం విమథ్నన్ దిశిదిశి దివిషద్వాహినీశం క్షణేన ।**
**భ్రామ్యన్ సవ్యాపసవ్యం సుమహతి మిషతి స్వర్గిసార్థే సుధార్థం**
**ప్రేంఖన్నేత్రః శ్రియం వః ప్రకటయతు చిరం పక్షవాన్ మంథశైలః ॥**

సుమహతి = మిక్కిలి పెద్దదైన , స్వర్గిసార్థే = దేవతల సమూహము, మిషతి = చూచుచుండగా , సవ్య + అపసవ్యమ్ = కుడి ఎడమలుగా, భ్రామ్యన్ = తిరుగునది , ఆరాత్ = దగ్గరలో, అభ్యుత్థిత = పైకి లేచిన , ఐరావత = ఐరావతమను ఏనుగును కల్గినది, అమితజవ = అంతులేని వేగముతో, ఉదంచత్ = ఉదయించిన, ఉచ్చైః శ్రవస్కమ్ = ఉచ్చైః శ్రవమును కల్గినది, దిశిదిశి = ప్రతిదిక్కులో, జాతక్షోభమ్ = క్షోభను పొందినది, దివిషత్ వాహినీ + ఈశమ్ = దేవసేనకు నాయకుడగు ఇంద్రుని (దేవనదికి నాయకుడగు సముద్రుని), సుధార్థమ్ = అమృతముకొఱకు, క్షణేన = క్షణకాలమున, విమథ్నన్ = మథించునది, ప్రేంఖత్+ నేత్రః = తిరుగునట్టి నేత్రమును కల్గినది (తిరుగునట్టి వాసుకి అను దారమును కల్గినది), పక్షవాన్ = ఱెక్కలను కల్గినది అగు, మంథశైలః = గరుడుడను మందరపర్వతము, నః = మనకు, శ్రియమ్ = సంపదను, చిరమ్ = చిరకాలము, ప్రకటయతు = ప్రకటించునుగాక !

గరుడుడు అమృతమును తీసికొనివచ్చుటకై, దేవలోకమునకు పోవునపుడు దేవతలు గుంపులుగుంపులుగా నిలచి, భయముతో చూచుచుండిరి. గరుడుడు కుడివైపుకు- ఎడమవైపుకు తిరుగుచు నలుప్రక్కల చుట్టుచుండెను. దేవతలును మిక్కిలి జాగరూకులుగానే ఉండిరి. అయినను లాభమేమి ? క్షణమాత్రకాలములో గరుడుడు చేయు ఈ కోలాహలమును చూచి దేవేంద్రుడును మిక్కిలి కలత చెందెను. అతనికి సమీపమున సహాయముగా గజమగు ఐరావతము మిక్కిలి ఉత్సాహముతో పైకి లేచుచుండెను. అతని అశ్వమగు ఉచ్చైః శ్రవము మిక్కిలి వేగముతో పరుగెత్తి వచ్చుచుండెను. అతని అధీనమున అంతులేని దేవసేన ఉండెను. ఇంతటి సహాయసంపద ఉన్నను ఏమి ఫలము ? గరుడుని వీర్యమును చూచిన ఇంద్రుడు ఎటువైపు చూచినను అతని మనస్సున భయమును, ఆందోళయు కలిగెను. మఱియు గరుడుడు కన్నులను తిప్పుచు అమృతము ఉన్నచోటువైపే దృష్టిని సారించుచు, అటు ఇటు తిరుగునపుడు క్షీరాబ్ధిలోని మందరపర్వతమే ఱెక్కలను కల్గినదై ఎగురుచున్నదా ? అనునట్లుండెను. ఇట్టి గరుడభగవానుడు మనకు అన్ని సంపదలను చిరకాలము అనుగ్రహించును గాక !

ఈ శ్లోకమున గరుడుడు మందరపర్వతముగా రూపింపబడినాడు. గరుడునకు గల

విశేషణములన్నియు మందరపర్వతమునకును అన్వయింపనగును. అమృతము కొఱకు మందరపర్వతమును కవ్వముగా చేసి, దేవగంగ కలియుచోటు అగు సముద్రమును చిలికినపుడు దేవతల కూటము చూచుచుండినది. దారమగు వాసుకి అనుపాము తిరుగుచుండగా మందర పర్వతమును కుడిఎడమలకు తిరిగినది. ఐరావతము, ఉచ్చైః శ్రవము సముద్రమునుండి ఉద్భవించినవి. ఇట్లు ఱెక్కలను కల్గిన మందరపర్వతము సముద్రమును చిలుకగా, లక్ష్మీదేవి అవతరించెను - అని మందరపర్వత పక్షమున భావము -

మందర పర్వతమునకు అనుగుణముగా - **"దివిషద్వాహినీ"** అనుటకు దేవనది గంగఅని, దానికి ఈశ్వరుడు అనగా క్షీరసముద్రము అని, **"నేత్రమ్"** అనుటకు రజ్జువు అనియు అర్థము చెప్పనగును. గరుడుని పక్షమున నాల్గవ పాదమున **"ప్రేంఖన్, నేత్రశ్రియః సః"** అని విడదీసి, **"నేత్రశ్రియమ్"** అనుటకు దృష్టిబలమను లక్ష్మిని అని అర్థమును చెప్పనగును. అనగా, ఆఱు ఇంద్రియములకును, భగవానునకు తగిన సేవనుచేయుటకు తగిన బలము, స్థైర్యము అను లక్ష్మి అని తాత్పర్యము. మందరపర్వతపక్షమున **"ప్రేంఖన్నేత్రః"** అని, **"శ్రియం ప్రకటయతు"** అని వ్యస్తముగాగ్రహించి "తిరుగుచున్న దారమునుకల్గినది'' అని, "లక్ష్మిని ప్రకాశించును గాక !'' అని అర్థములను గ్రహింపనగును. ఇట్లు ఇందలి విశేషణములన్నియు మందరపర్వత, గరుడుల పక్షమున శ్లేషించుటచే శ్లేషాలంకారము కలదు. ఈ శ్లోకార్థమునకు అనుగుణముగా దేశిక ప్రణీతమైన గరుడదండకములో ప్రారంభమున గల **"నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే, శ్రుతి - సింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే."** అను శ్లోకముయొక్క భావము అనుసంధేయము. **"పక్షవాన్"** అను విశేషణమును గరుడ - మందరములకు సమానముగా అన్వయింపనగును. పూర్వము పర్వతములకు ఱెక్కలు ఉండెడివి కదా !

**పక్షవాన్ మంథశైలః నః శ్రియం చిరం ప్రకటయతు**

**గరుడుని ఱెక్కల వేగము**

21. **అస్థానేషు గ్రహాణా మనియతవిహితానంతవక్రాతిచారాః**
**విశ్వోపాధివ్యవస్థావిగమవిలువితప్రాగవాగాదిభేదాః ।**
**ద్విత్రాః సుత్రామభక్తగ్రహకలహవిధా వండజేంద్రస్య చండాః**
**పక్షోత్క్షేపా విపక్షక్షపణసరభసాః శర్మ మే నిర్మిమీరన్ ॥**

సుత్రామ = ఇంద్రుని, భక్త = ఆహారమగు అమృతమును, గ్రహకలహవిధౌ = గ్రహించుటలో ఏర్పడిన తగవులో, అస్థానేషు = తగనిస్థలములలో, గ్రహాణామ్ = గ్రహములకు, అనియత = కట్టుబాటులేనట్లు, విహిత = చేయబడిన, అనంత = అంతులేని, వక్ర+అతిచారాః = వక్రచారము, అతిచారము అను వీనిని కల్గినవి, విశ్వ = సకలమైన, ఉపాధి = వస్తువులయొక్క, వ్యవస్థావిగమ = స్థితి నశించుటవలన,



విలువిత = లోపించిన, ప్రాక్+అవాక్+ఆదిభేదాః = తూర్పు, పడమర మొదలగు దిక్కుల వ్యత్యాసమునుకల్గినది, విపక్ష = శత్రువులను, క్షపణ = నశింపచేయుటలో, సరభసాః = సంరంభముతో కూడినవి, చండాః = కఠినములైనవి, అగు, ద్విత్రాః = రెండుమూడు, అండజ +ఇంద్రస్య = పక్షిరాజగు గరుడుని యొక్క, పక్ష+ఉత్క్షేపాః = ఱెక్కల కదలికలు, మే = నాకు, శర్మ = సుఖమును, నిర్మిమీరన్ = కల్గించునుగాక !

గరుడుడు దేవలోకమునుండి అమృతమును కొనివచ్చుటకై ప్రయత్నించునపుడు దేవతలు అతనిని ఎదిరించిరి. ఇంద్రునకు ఆహారమగు అమృతమును విడుచుటకు దేవతలు అంగీకరింపరు కదా ! అపుడు గరుడునకు, దేవతలకు మధ్య పోరాటము జరిగెను. ఆ యుద్ధములో మిక్కిలి కోపించిన గరుడుడు రెండు, మూడు సార్లు తన ఱెక్కలను విసరెను. ఆ ఱెక్కలనుండి పుట్టిన గాలి వలన కల్గిన బాధలు వర్ణనాతీతములు. తొమ్మిది గ్రహములు ఒక్కొక్కరాశిలో నుండవలసిన కాలమునకు నియమముకలదు. ఆ నియమమును గరుడుని ఱెక్కలగాలి భంగపరచెను. కొన్ని గ్రహములను అవిముందున్న రాశిలోనికి మరల తోసివేసెను. మరికొన్నిటిని అవి ప్రవేశింపవలసిన కాలమునకు ముందే తరువాతి రాశిలోనికి గెంటివేసెను. ఇట్టి గరుడుని ఱెక్కల గాలి చేసిన చేష్టలు అంతులేనివి. ఇంతియే కాదు. ఈ దిక్కులో ఈ గ్రహమునకు ఉదయము, ఈగ్రహమునకు అస్తమయము అనుటను బట్టిగదా దిక్కుల నిర్ణయము. గరుడుని ఱెక్కలగాలి ఆక్రమమును శిథిలము చేసెను. చంద్రుని, సూర్యుని వేర్వేరు దిక్కులకు తోసివేయుటచే దిక్కులలోని తూర్పు, పడమర మొదలగు భేదములు అన్నియు నశించెను. ఈ విధముగా లోకములోనున్న సకల వస్తువుల స్థితిని భంగపఱచి, శత్రువుల నశింపచేయుటలోనే ఆసక్తిని కల్గినవగు గరుడుని ఱెక్కల భయంకరమైన చలనములు నాకు క్షేమమును కల్గించునుగాక !

ఈ శ్లోకమున వక్రచార, అతిచార శబ్దప్రయోగములు దేశికుల జ్యోతిశ్శాస్త్ర వైదుష్యమును ఋజువు చేయుచున్నవి. వక్రచారమనగా ఒకరాశిలోనున్న గ్రహము అచట తాను ఉండవలసిన సమయము పూర్తిఅయిన పిదప, తరువాతి రాశిలోనికి ప్రవేశింపక, మరల పూర్వరాశిలోనే ప్రవేశించుట. అతిచారమనగా ఒకరాశినుండి వేరొక రాశిలోనికి గ్రహముప్రవేశించుటకు నిర్ణీతమైన సమయము కంటె ముందుగానే ప్రవేశించుట. వేరొకరాశిలో ప్రవేశింపవలసిన గ్రహము అట్లుకాక, పూర్వరాశిలోనే ఉండుట వక్రచారమని, ఒకరాశిలో ప్రవేశింపవలసిన సమయమునకు ముందుగానే ఆరాశిలో ప్రవేశించుట అతిచారమని తాత్పర్యము. గ్రహములకు ఇట్టి స్థితి గరుడుని ఱెక్కల వీవనలవలన పుట్టిన భయంకరమైన గాలిచే కల్గినది. అశ్విని మొదలు రేవతివరకుగల ఒక్కొక్క నక్షత్రమును నాల్గుపాదములుగా విభజించినచో మొత్తము 108 పాదములగును. ప్రతితొమ్మిది పాదములు ఒక్కొక్కరాశిగా పరిగణింపబడును. అనగా అశ్విని నాల్గుపాదములు, భరణి నాల్గుపాదములు, కృత్తికలోని 1 పాదము, కలిపి 9 పాదములు మొదటిదగు మేషరాశి అగును. ఇట్లే వృషభాది రాశుల నిర్ణయము. ఇట్లు గ్రహముల వక్రచార, అతిచారములను, పూర్వ, పశ్చిమాది దిక్కుల స్థితికి భంగమును కల్గినదని వర్ణించుటచే ఇందు అతిశయోక్తి అలంకారముకలదు.

**“భక్తమంధోఽన్న”** మను అమరనిఘంటు వచనము ప్రకారము భక్తశబ్దమునకు అన్నమని అర్థము. తెలుగు భారతములోని **“ఆతతపక్షమారుతరయః ప్రవికంపిత ఘూర్ణితచలవ్రాత మహార్ణవుండు”** ఇత్యాది పద్యభావము ఈశ్లోకభావమునకు అనుగుణముగా అనుసంధేయము.

**ద్విత్రాః అండజేంద్రస్య పక్షోత్క్షేపాత్ మే శర్మ నిర్మిమీరన్**

**గరుడుని అంగముల ఉత్సాహాతిశయము**

22. **తత్తత్ప్రత్యర్థిసారావధివిహితమృషారోషగంధో రుషాంధైః**
**ఏకః క్రీడన్ననేకైః సురపతిసుభటై రక్షతో రక్షతాన్నః ।**
**అన్యోన్యాబద్ధలక్ష్యాపహరణవిహితామందమాత్సర్యతుంగైః**
**అంగై రేవ స్వకీయై రహమహమికయా మానితో వైనతేయః ॥**

తత్ తత్ప్రత్యర్థి = ఆయా శత్రువుల, సార+అవధి= బలిమిఅవధికి తగినట్లు, విహితమృషారోషగంధః = కొంచెము కొంచెముగా అసత్యమైన కోపమును కల్గినవాడై, రుషా = కోపముచే, అంధైః = మతిచెడినవారగు, సురపతిసుభటైః = ఇంద్రుని గొప్పభటులతో, ఏకః = ఒకడై, క్రీడన్ = క్రీడించువాడై, అక్షతః = గాయమును పొందనివాడై, అహమహమికయా= నేనుముందు, నేనుముందు అనుచు, అన్యోన్య = ఒకదానితో వేరొకటి, ఆబద్ధలక్ష = నిశ్చయించుకొనిన లక్ష్యము అగు అమృతమును, అపహరణ= దొంగిలించుటలో, విహిత = చేయింపబడిన, అమంద= గొప్ప, మాత్సర్య= అసూయచే, తుంగైః  = నిండినవగు, స్వకీయైః = తనకు చెందినవగు, అంగైః ఏవ = అవయవముల చేతనే, మానితః = గౌరవింపబడిన వాడగు, వైనతేయః = గరుడుడు, నః = మనలను, రక్షతాత్ = రక్షించునుగాక !

అమృతమును తీసికొనువచ్చుటకై గరుడుడు వచ్చునపుడు ప్రత్యర్థులగు దేవతలు అతనిని ఎదిరించిరి. గరుడుడు తనను ఎదిరించు ప్రత్యర్థుల బలమునకు తగినట్లు కొంచెము కొంచెముగా కోపగించెను. అదియును నిజమైన కోపముకాదు. తనతో సమానులగువారిపట్ల కోపమును కల్గియుండుట కదా గొప్పవారి లక్షణము ! మఱియు దేవతలు భగవానునకు అనుకూలురు కదా ! ఇంద్రునకు అధీనులగు ఆదేవతలు అమృతమును గరుడుడు తీసికొనిపోవుటను సహింపలేక పోవుటచే వారి మనస్సులు కోపముతో కలత చెందినవి. గరుడునితో వారు పోరాడుటకు సిద్ధపడిరి. లెక్కలేనంతమంది దేవభటులతో గరుడుడు ఏకాకిగా పోరాడుట అతనికి విలాసముగానే తోచెను. అతనికి యుద్ధమున కొంచమైనను శరీరమున గాయమే ఏర్పడలేదు. అతని అంగములన్నిటిలో ప్రతిఒక్కటియు వేరొక అంగము అమృతమును తెచ్చుటను సహింపలేక, నేనే ముందు తీసికొనివచ్చెదనని ఉత్సాహపడినవి. ఒకదానితో వేరొకటి అట్లు స్పర్థించినవి. గరుడుని ఇట్టి అంగములు అన్నియు అతనితో - “నీకు అంగములగు మేము ఉండగా మాకు నాయకుడవగు నీవు అమృతమును



తెచ్చుటలో ప్రయాసపడనేల ? మేమే ఆకార్యమును నిర్వహింతుము’’ అనుచు గొప్ప ఉత్సాహమును, గౌరవమునుచూపి, ఒక దానితో వేరొకటి పోటీ పడినవి. ఇట్టి గొప్పతనమును కల గరుడుడు మనలను రక్షించునుగాక !

మొదటిపాదమును **“తత్తత్ప్రత్యర్థిసారావధి”**, **“విహితమృషారోషగంధః”** అని వ్యస్త పదములుగా కూడ అన్వయింపవచ్చును. అపుడు **“తత్తత్ప్రత్యర్థిసారావధి”** అను పదము క్రియావిశేషణము. ఆయా సమయములలో ఎదురైన ప్రత్యర్థిభటుల బలమునకు తగిన విధముగా అని భావము. అవయవములు, అవయవికంటె వేరు కాకున్నను, అవయవములను వర్ణించుట కవియొక్క భావనాపటిమను, చమత్కార నిర్వహణ కౌశలమును చాటును.

**స్వకీయైః అంగై రేవ మానితః వైనతేయః నః రక్షతాత్**

**గరుడుని వేగాతిశయము**

23. **అస్తవ్యోమాంత మంతర్హితనిఖిలహరిన్మండలం చండభానోః**
**లుంతాకై ర్యై రకాండే జగదఖిల మిదం శర్వరీ పర్వరీతి ।**
**ప్రేంఖోలత్స్వర్గగోళః స్ఖలదుడునికరస్కంధబంధాన్ నిరుంధన్**
**రంహోభి స్స్వైః మదంహో హరతు తరళితబ్రహ్మసద్మా గరుత్మాన్ ॥**

అకాండే = అకాలమున, అస్తవ్యోమాంతమ్ = ఆకాశము అంతయు వ్యాపించునట్లు, అంతర్హిత నిఖిలహరిన్మండలమ్ = అన్ని దిక్కులును అదృశ్యములగునట్లు, చండభానోః = సూర్యుని (యొక్క), లుంతాకైః = దొంగలించునట్టి, యైః = ఏలోకములచే, శర్వరీ = రాత్రి, ఇదమ్ = ఈ, జగత్ +అఖిలమ్ = లోకమునందు అంతయు, పర్వరీతి= వ్యాపించుచున్నదో, స్వైః =తనయొక్క, రంహోభిః = వేగములచే, ప్రేంఖోలత్ = ఊయలలూగుచున్న, స్వర్గగోళః= స్వర్గలోకమును కల్గినవాడు, స్ఖలత్ = తొట్రుపాటు పడుచున్న, ఉడునికర = నక్షత్రసమూహములకు, స్కంధబంధాన్ = ఆధారములగు వాయుపాశములను, నిరుంధన్ = తెంపువాడై, తరళిత = ఆడునట్లుచేయబడిన, బ్రహ్మసద్మా = బ్రహ్మయొక్క లోకమును కలిగినవాడును అగు, గరుత్మాన్ = గరుడుడు, మత్+అంహః = నాపాపమును, హరతు = పోగొట్టును గాక !

దేవతలతో గరుడుడు పోరాడునపుడు ఒక్కొక్క విన్యాసములో అతనికి కల వేగము పలు భీకరములైన కృత్యములను చేసినది. ఆ వేగము ఆకాశమంతయు వ్యాపించినది. అన్నిదిక్కులను అంతరింపచేసినది. మధ్యాహ్నకాలముననే సూర్యుడుండుచోటు తెలియకుండచేసినది. లోకమంతయు రాత్రిమయముగా కాగా, అంతట చీకటి వ్యాపించినది. ఆ సమయమున దేవలోకమే ఊగిసలాడినది. గరుడుని వేగమునకు నక్షత్రములకు ఆధారమగు వాయుపాశములు అతనిపై పడగా, వాటిని అతడు ముక్కలు ముక్కలు తెంపివేసెను. అతని వేగమునకు బ్రహ్మలోకమునకు కూడ స్థానభ్రంశము కల్గెను.

ఇట్టి అద్భుతములైన కృత్యములను చేసిన గరుడుడు నా పాపమును నశింపచేయును గాక !

ఇందు బ్రహ్మలోకమునకు స్థానభ్రంశము కల్గినదని, నక్షత్రములకు ఆధారములగు వాయుపాశములను గరుడుడు తెంపెనని ఇత్యాదిగా వర్ణింప బడుటచే అతిశయోక్తి అలంకారము కలదు.

**తరళితబ్రహ్మసద్మా గరుత్మాన్ మదంహః హరతు**

**గరుడునితో ఇంద్రుడు స్నేహము చేయుట**

**24. యః స్వాంగే సంగరాంతః గరుదనిలలవస్తంభితే జంభశత్రౌ**
**కుంతాస్త్రే సన్నకంఠం ప్రణయతి పవయే పక్షలేశం దిదేశ ।**
**సోఽస్మాకం సంవిధత్తాం సురపతిపృతనాద్వంద్వయుద్ధైకమల్లః**
**మాంగల్యం వాలఖిల్యద్విజవరతపసాం కోఽపి మూర్తో వివర్తః ॥**

యః = ఏగరుడుడు, సంగర+అంతః = యుద్ధముమధ్యలో, గరుత్ = ఱెక్కలయొక్క, అనిలలవ = చిఱుగాలిచే, స్తంభితే = స్తంభమును పొందినవాడై, కుంఠ+అస్త్రే = శక్తిహీనమైన వజ్రాయుధమును ఆయుధమును కలవాడైన, జంభశత్రౌ = ఇంద్రుడు, సన్నకంఠమ్ = హీనస్వరముతో, ప్రణయతి = స్నేహముచేసికొనినవాడుకాగా, స్వ+అంగే = తన అవయవమందు, పక్షలేశమ్ = ఱెక్కలోని చిన్నభాగమును (ఈకను), పవయే = వజ్రాయుధమునకు, దిదేశ = ఇచ్చెనో, సురపతిపృతనా = ఇంద్రుని సేనతో సంభవించిన, ద్వంద్వయుద్ధ = ద్వంద్వయుద్ధమున, ఏకమల్లః = అద్వితీయుడైన వీరుడును, వాలఖిల్య = వాలఖిల్యులను, ద్విజవర = గొప్పమునుల, తపసామ్ = తపస్సులయొక్క, కః+అపి = విలక్షణమై, మూర్తః = రూపమును పొందిన, వివర్తః = ప్రకారమగు, సః = ఆగరుడుడు, అస్మాకమ్ = మనకు, మాంగల్యమ్ = మంగళమును, సంవిధత్తామ్ = కల్గించునుగాక !

పూర్వము ఒకానొక సమయమున కశ్యపుడను ముని చేసిన యాగమునకు పలువురు మునులు సహాయపడిరి. వారిలో వాలఖిల్యులును కలరు. ఈ మునులు గొప్ప తపశ్శక్తిని కలవారు. రూపమున చాలచిన్నవారు. వీరు కశ్యపముని చేయు యాగముకొఱకు తమశక్తికి తగినట్లు ఒకచిన్న సమిధను తీసికొని వచ్చునపుడు దారిలో గోష్పాదమంత నీటిమడుగును చూచి, ఆ సమిధను తీసికొని దానిని దాటలేక పోయిరి. అపుడు ఆదారిలో ఐరావతమును ఎక్కివచ్చుచున్న ఇంద్రుడు వారిని చూచి పరిహసించెను. అందులకు వాలఖిల్యమునులు కోపించి, అతని గర్వమును అణచగల్గిన ఒక మహాశక్తి శాలి జన్మించి, అతనిని ఓడించునని శపించిరి. ఆ శాపము సిద్ధించుటకై తీవ్రతపముచేసిరి. ఆ తపస్సు ఫలించి, రూపు దిద్దుకొన్న విధముగా గరుడుడు వినతకు కుమారుడై జన్మించెను.

గరుడుడు అమృతమును తీసికొనిపోవుటను చూచి, అతనిని ఎదిర్చిన ఇంద్రుని సేనతో యుద్ధము చేయునపుడు ఆతడు అసమానశౌర్యశాలిగా ప్రకాశించెను. అతని బలిమిచే తనసేన పరాజిత మగుటను చూచిన ఇంద్రుడు తానే స్వయముగా యుద్ధము చేయవచ్చెను. అపుడు గరుడుడు



తనఱెక్కలతో వీచిన చిన్నగాలికే ఇంద్రుడు స్తంభీభూతుడయ్యెను. ఇంద్రుడు తన ఆయుధమగు వజ్రమును ప్రయోగింపగా అది గరుడుని ఏమియు చేయలేక పోయెను.వెంటనే ఇంద్రుడు భయపడి, హీనస్వరముతో గరుడునితో స్నేహముకొఱకు ప్రార్థించెను. గరుడుడును అందులకు సమ్మతించెను. అపుడు ఇంద్రుని వజ్రాయుధముయొక్క గౌరవము తగ్గకుండుటకై తన ఱెక్కలో ఒక ఈకను మాత్రము గరుడుడు వదలిపెట్టెను. ఇట్టి గొప్పతనమునుకల గరుడుడు మనకు మంగళమును కల్గించుగాక !

**(ఏకమల్లః)** ప్రధానభటుడని అర్థము. ఇందులకు, **"శ్రేష్ఠో దేవానాం పృతనాసు జిష్ణుః"** అను శ్రుతివాక్యము స్మరణీయము అని సంస్కృతవ్యాఖ్య.

**వాలఖిల్యద్విజవరతపసాం కోఽపి మూర్తో వివర్తః**

**సోఽస్మాకం మాంగల్యం సంవిధత్తామ్**

**గరుడుడు అమృతమును తీసికొనివచ్చుట**

**25. రుద్రాన్ విద్రావ్య సేంద్రాన్ హుతవహసహితం గంధవాహం గృహీత్వా**
**కాలం నిష్కాల్య ధూత్వా నిఋతిధనపతీ పాశినం క్లేశయిత్వా ।**
**సర్పాణాం ఛాద్మికానా మమృతమయపణప్రాపణప్రాప్తదర్పః**
**నిర్బాధం క్వాఽపి సర్ప న్నపహరతు హరే రౌపవాహ్యో మదంహః ॥**

స+ఇంద్రాన్ = ఇంద్రునితో కూడిన, రుద్రాన్ = రుద్రులను, విద్రావ్య = తఱిమికొట్టి, హుతవహ సహితమ్ = అగ్నితో కూడిన, గంధవాహమ్ = వాయుదేవుని, గృహీత్వా = గైకొని, కాలమ్ = యముని, నిష్కాల్య = తఱిమి, నిఋతిధనపతీ = నిఋతిని, కుబేరుని, ధూత్వా= ఎగురగొట్టి, పాశినమ్ = వరుణుని, క్లేశయిత్వా = బాధించి, ఛాద్మికానామ్ =వంచనను కల్గిన, సర్పాణామ్ = సర్పములయొక్క, అమృతమయ = అమృతరూపములోని, పణ = పణమును, ప్రాపణ = పొందించుటచే, ప్రాప్తదర్పః = గర్వమును పొందినవాడై, క్వాపి = అంతటను, నిర్బాధమ్= అడ్డములేక, సర్పన్ = తిరుగుచున్నవాడైన, హరేః = విష్ణువుయొక్క, ఔపవాహ్యః = సమరోచితమైన గొప్పవాహనమగు గరుడుడు, మదంహః = నాపాపములను, అపహరతు = పోగొట్టునుగాక!

అమృతము దేవతల కందఱకును చెందినది. గరుడుడు దానిని అపహరించునపుడు అష్టదిక్పాలకులు అతని సమీపమునకు వచ్చి, అడ్డుకొనిరి. గరుడుడు తన బలముతో ఇంద్రుని, రుద్రులను, తఱిమికొట్టెను. అగ్నిని, వాయుదేవుని గ్రహించి, విసరివేసెను. యముని చావగొట్టెను. నిఋతి, కుబేరులను పక్కకు గెంటివేసెను. వరుణుని బాధించెను. ఇట్లు అడ్డువచ్చినవారి నందఱను ఎదుర్కొని అమృతమును కొనివచ్చెను. తన తల్లికి ఈ విధముగా దాస్యమును తీర్చుటకై వంచకబుద్ధిని కల సర్పములకు పణముగా వారు అడిగిన అమృతమును తీసికొని వచ్చి, వారికి ఇచ్చి, మిక్కిలి

గర్వముతో ఎట్టి అడ్డమునులేక సంచరించు గరుడుడు భగవానునకు గొప్ప యుద్ధవాహనము. అతడు నా పాపములను నశింపచేయునుగాక !

**నిర్బాధం క్వాఽపి సర్ప న్నపహరతు హరే రాపవాహ్యో మదంహః**

**(3) నాగదమనవర్ణకః**

**గరుడుడు సర్పములపట్ల కోపించుట**

**26.** **భగ్నభ్రూ ర్భ్రూకుటీభృ ద్భ్రమదమితగరుత్క్షోభితక్ష్మాంతరిక్షః**
**చక్రాక్షో వక్రతుండః ఖరతరనఖరః క్రూరదంష్ట్రాకరాళః ।**
**పాయా దస్మా నపాయా ద్భయభరవిగళద్దందశూకేంద్రశూకః**
**శౌరేః సంక్రందనాదిప్రతిభటపృతనాక్రందనః స్యందనేంద్రః ॥**

భుగ్నభ్రూః = వంగిన కనుబొమలను కలవాడు, భ్రూకుటీభృత్= కోపముతో (మరింత) వంచిన కనుబొమలను కల్గివవాడు, భ్రమత్ = పరిభ్రమించు, అమిత = అంతులేని, గరుత్ = ఱెక్కలను కలవాడై (వానితో), క్షోభిత = క్షోభిల్లచేసిన, క్ష్మా+అంతరిక్షః = భూమ్యాకాశములను కలవాడు, చక్ర = గుండ్రని, అక్షః = కళ్లను కలవాడు, వక్ర = వంగిన, తుండః = ముక్కును కలవాడు, ఖరతర = మిక్కిలి కఠినమైన, నఖరః = గోళ్లను కలవాడు, క్రూర = క్రూరమైన, దంష్ట్రా = కోఱలచే, కరాళః = భయంకరమైనవాడు, భయభర = మిక్కిలి భయముచే, విగళత్ = విసర్జించుచున్న (సడలుచున్న), దందశూక+ఇంద్ర = గొప్పసర్పముల, శూకః = క్రౌర్యమును కలవాడు, సంక్రందన+ఆది = ఇంద్రుడు మొదలగు, ప్రతిభట = ప్రత్యర్థుల, పృతనా = సేనను, ఆక్రందనః = ఆక్రోశించునట్లుచేసినవాడును అగు, శౌరేః = విష్ణువుయొక్క, స్యందన+ఇంద్రః = గొప్పవాహనమగు గరుడుడు, అస్మాన్ = మనలను, అపాయాత్ = అపాయమునుండి, పాయాత్ = రక్షించునుగాక !

ఈ శ్లోకముమొదలు 29వ శ్లోకము వరకు గరుడుడు సర్పములను అణచిన ప్రకారము వర్ణింపబడుచున్నది.

తల్లి దాస్యమును పోగొట్టుటకై అమృతమును తీసికొని వచ్చిన గరుడుడు తన సవతితల్లి కుమారులగు సర్పములు వంచనతో తనతల్లికి దాస్యము కల్గునట్లు చేసిన వృత్తాంతమును స్మరించెను. వెంటనే అతనికి వానిపై అంతులేని కోపము వచ్చెను. అపుడు సహజముగానే వంగియుండు అతని కనుబొమలు మరింత వక్రములయ్యెను. అతని ఱెక్కలు మిక్కిలిగా పరిభ్రమించెను. దానితో భూమియు, ఆకాశము కలత చెందెను. అతని కన్నులు గుండ్రముగా అయ్యెను. ముక్కు వంగినదయ్యెను. గోళ్లు చూచుటకు మిక్కిలి భయంకరముగా నుండెను. అతని క్రూరములైన కోఱపళ్లు చూచువారికి భయమును గొల్పుచుండెను. గరుడుని ఇట్టి స్థితిని చూచి ఇంద్రుడు మొదలగు ప్రత్యర్థుల సేన భయకంపిత మయ్యెను. అతనిని చూచిన గొప్పసర్పములన్నియు తమ క్రౌర్యమును విడనాడినవి.



భగవానునకు గొప్ప వాహనమై, ఇట్టి శత్రుభీకరమైన రూపమును కల్గిన గరుడుడు మనకు ఆపదలు కలుగకుండ కాపాడునుగాక !

**శౌరేః స్యందనేంద్రః అస్మాన్ అపాయాత్ పాయాత్**

**సూర్యుడు మొదలగువారు గరుడునకు భయపడుట**

**27.** **అర్యమ్ణా ధుర్యయోక్త్రగ్రసనభయభృతా సాంత్వితోఽనూరుబంధాత్**
**కోదండజ్యాం జిఘృక్షే దితి చకితధియా శంకితః శంకరేణ ।**
**తల్పే కల్పేత మా తే మతి రితి హరిణాఽప్యాదరేణానునీతః**
**పక్షీంద్ర స్త్రాయతాం నః ఫణధరమహిషీపత్రభంగాపహారీ ॥**

ధుర్య = తన రథముయొక్క అశ్వముల, యోక్త్ర = దారములగు సర్పములను, గ్రసన = గ్రసించుటలో, భయభృతా = భయమును పొందిన, అర్యమ్ణా = సూర్యునిచే, అనూరుబంధాత్ = అరుణుని సంబంధమువలన, సాంత్వితః = సముదాయింపబడినవాడు, కోదండజ్యామ్ = (తన) వింటియొక్క నారి అను సర్పమును, జిఘృక్షేత్ ఇతి= గ్రహింపగోరునేమో ! అని, చకితధియా = భయమును పొందిన మనస్సునుకల, శంకరేణ = శివునిచే, శంకితః = సందేహింపబడినవాడు, తల్పే = పడుక అను ఆదిశేషునియందు, తే = నీకు, మతిః = మనస్సు, మా కల్పేత = కలుగకుండుగాక, ఇతి = అని, ఆదరేణ = ఆదరముతో, హరిణా అపి = భగవానునిచే కూడ, అనునీతః = సమాధానపఱుపబడినవాడు, ఫణధర = సర్పముల, మహిషీ = స్త్రీలయొక్క, పత్రభంగ = పత్రభంగములను మంగళకరములైన, అలంకారములను, అపహారీ = అపహరించువాడును (పోగొట్టువాడును)అగు, పక్షి+ఇంద్ర = గరుడుడు, నః = మనలను, త్రాయాతామ్ = రక్షించునుగాక !

గరుడుడు కోపముతో సర్పముల నన్నిటిని భక్షింపప్రారంభించెను. అపుడు సూర్యుడు, శివుడు, హరియు ఆందోళననుపొందిరి. సూర్యుని రథమునకు సర్పములే రజ్జువులు. వానిని గరుడుడు తినివేసినచో తనరథము ఎట్లు సాగును ? అని సూర్యుడు భయపడెను. వినతకు గరుడుడు జన్మించుటకుముందు అనూరుడు కుమారుడుగా జన్మించెను. అతడు ఊరువులు లేకుండ జన్మించెను. అతనిని సూర్యుడు సారథిగా చేసికొనెను. అందువలన గరుడుడు సూర్యుని రథములకు పగ్గములుగానున్న సర్పములను భక్షించుట మానెను. సూర్యుని భయముతీరెను. శివుని వింటికి గల నారి (దారము) సర్పమే. దానిని గరుడుడు భక్షించునో ఏమో ! అని శివుడు భయపడెను. భగవానుడు తనకు పడుకగా నున్న ఆదిశేషుని గరుడుడు మింగివేయునేమో ! అని తలచి, మిక్కిలి ఆతురతతో గరుడునితో - "నీవు నీ మనస్సును నాపడుకగా నున్న ఆదిశేషునిపై పోనీకుము సుమా !" అని సముదాయించెను. దీనితో కొన్నిటిని మాత్రము విడచి, మిగిలిన సర్పములనన్నిటిని గరుడుడు భక్షించి, వారిభార్యలు ఇకపై పత్త్రభంగములను అలంకరించు కొనకుండచేసెను. ఇట్టి పక్షీంద్రుడు మనలను రక్షించునుగాక !

పత్త్రభంగము లనగా - స్త్రీలు సువాసనద్రవ్యములతో చేసిన చిక్కని రసమును ఉపయోగించి తమ అంగములందు చేపలు, లతలు మొదలగు చిత్రవిచిత్రములైన ఆకారములలో చిత్రించి అలంకరించుకొందురు. వానికి పత్రభంగములని పేరు. ఈ అలంకరణలను వారు భర్త జీవించి యున్నప్పుడే చేసికొందురు. ఇవి మంగళకరములైన చిహ్నములు. గరుడుడు సర్పములను భక్షించుటచే వారి భార్యలు పత్త్రభంగములను అలంకరించు కొనుట మానిరి అని చివరిపాదములోని తాత్పర్యము.

**పక్షీంద్ర స్త్రాయతాం నః ఫణధరమహిషీపత్రభంగాపహారీ**

**గరుడుడు సర్పకులమును నాశనముచేయుట**

**28. ఛాయాతార్క్ష్యా నహీనాం ఫణమణిముకురశ్రేణివిస్పష్టబింబాన్**
**త్రాణాపేక్షాధృతస్వప్రతికృతిమనసా వీక్ష్య జాతానుకంపః ।**
**తేషాం దృష్ట్వాఽథ చేష్టాః ప్రతిగరుడగణాశంకయా తుంగరోషః**
**సర్పన్ దర్పోద్ధతో నః శమయతు దురితం సర్పసంతానహంతా ॥**

అహీనామ్ = సర్పములయొక్క, ఫణమణి = పడగలలోనున్న రత్నములనెడి, ముకుర = అద్దముల, శ్రేణి = వరుసలలో, విస్పష్ట = మిక్కిలి స్పష్టముగా తోచుచున్న, బింబాన్ = రూపములనుకల, ఛాయాతార్క్ష్యాన్ = ఛాయాగరుడులను, వీక్ష్య = చూచి, త్రాణ+అపేక్షా = తమను రక్షించుకొను ఆశతో, ధృతస్వప్రతికృతి = తమఛాయలను ధరించుచున్నవి అను, మనసా = అభిప్రాయముతో, జాత+అనుకంపః = కరుణనుకలవాడై, అథ = పిమ్మట, తేషామ్ = ఆ ఛాయాగరుడులయొక్క, చేష్టాః = చేష్టలను, దృష్ట్వా = చూచి, ప్రతిగరుడగణ+ఆశంకయా = ప్రత్యర్థులైన గరుడుల సమూహములనెడి అనుమానముతో, తుంగరోషః = గొప్పకోపమును కల్గినవాడు, దర్ప+ఉద్ధతః = మిక్కిలి దర్పమునుకలవాడు (కావుననే), సర్పన్ = సంచరించుచు, సర్పసంతానహంతా = సర్పముల కులములను సంహరించిన వాడును అగు గరుడుడు, నః = మనయొక్క, దురితమ్ = పాపమును, శమయతు = ఉపశమింపచేయును గాక !

గరుడుడు నాగలోకమునకు చేరి సర్పములను సంహరించిన వృత్తాంతము ఇందు ప్రస్తుతము. గరుడుడు సర్పములతో యుద్ధము చేయునపుడు పాముల తలలపైగల రత్నములందు అతని రూపము అద్దములోవలె ప్రతిఫలించినది. వానిని చూచిన గరుడుడు- "ఈసర్పములు తమను నాబారినుండి రక్షించుకొనుటకై నన్ను సంతోషింపచేయగోరి, నా రూపమును ధరించుచున్నవి'' అని మొదట తలచి, వానిపై దయను కల్గినవాడయ్యెను. పిమ్మట పాములు అటు ఇటు సంచరించునపుడు పడగలలోని రత్నములలోనున్న తనప్రతిరూపములు కదలాడుటను అతడు చూచెను. "నన్ను ఎదిరించుటకై పలుగరుడులను తమకు సహాయముగా ఈసర్పములు తీసికొనివచ్చినవి'' అని మరల



తలచి, అందువలన నాగములపై అంతులేని కోపమును కలవాడై, మిక్కిలి దర్పముతో సంచరించుచు, నాగకులమును నాశనముచేసెను. ఇట్టి గరుడుడు మన పాపములను పోగొట్టునుగాక !

శ్లోకమున **"ఫణిమణిముకుర"** అను ప్రయోగమున రూపకము కలదు. దీనివలన గరుడుడు రత్నములందు ప్రతిఫలించిన తన రూపములను చూచి, వేరు గరుడులుగా భ్రమించెనను భ్రాంతి మదలంకారము సిద్ధించుటచే ఇందు రూపకానుప్రాణితమైన భ్రాంతిమదలంకారము కలదు.

**దర్పోద్ధతో నః శమయతు దురితం సర్పసంతానహంతా**

**గరుడుడు పాతాళమును ప్రవేశించుట**

**29. ఉచ్ఛ్వాసాకృష్టతారాగణఘటితమృషామౌక్తికాకల్పశిల్పః**
**పక్షవ్యాధూతపాథోనిధికుహరగుహాగర్భదత్తావకాశః ।**
**దృష్టిం దంష్ట్రాగ్రదూతీం పృథుషు ఫణభృతాం ప్రేషయ న్నుత్తమాంగే-**
**ష్వంగై రంగాని రుంధ న్నవతు పిపతిషుః పత్త్రిణా మగ్రణీ ర్నః ॥**

ఉచ్ఛ్వాస = ఉచ్ఛ్వాసముచే, ఆకృష్ట = ఆకర్షింపబడిన, తారాగణ = నక్షత్రసమూహముచే, ఘటిత = కల్పింపబడిన, మృషా = అసత్యమైన, మౌక్తిక = ముత్యములను, ఆకల్పశిల్పః = ఆభరణములను నిర్మించినవాడై, పక్ష = ఱెక్కలతో, వ్యాధూత = ఎగురగొట్టబడిన, పాథోనిధి = సముద్రముయొక్క, కుహరగర్భ = రంధ్రముమధ్యభాగమునందు, దత్త+అవకాశః = (పాతాళలోకమునకు పోవుటకు) అవకాశమును ఇవ్వబడినవాడై, ఫణభృతామ్ = పాములయొక్క, పృథుషు = పెద్దవైన, ఉత్తమాంగేషు = తలలయందు, దంష్ట్రా = కోఱపళ్లయొక్క, అగ్ర = ముందుగానే వెడలి (తనరాకను) తెలుపుచున్న, దూతీమ్ = దూతివంటి, దృష్టిమ్ = దృష్టిని, ప్రేషయన్ = పంపువాడై, అంగైః = ఱెక్కలు, ముక్కుమొదలగు అవయవములతో, అంగాని = అంగములను, రుంధన్ = అడ్డుకొనుచున్నవాడై, పిపతిషుః = (సర్పములపై) పడగోరుచున్న వాడైన, పత్త్రిణామ్ అగ్రణీః = పక్షులలో శ్రేష్ఠుడగు గరుడుడు, నః = మనలను, అవతు = రక్షించుగాక !

గరుడుడు పాతాళలోకమునకు సర్పములను వధించుటకై బయలుదేరెను. అపుడు అతని ఉచ్ఛ్వాసమునకు ఆకాశమున నున్న నక్షత్రములు గుంపులుగుంపులుగా క్రిందకు పడుచు, గరుడుని సమీపమున రాలినవి. అపుడు ముత్యములతో చేసిన ఆభరణములను గరుడుడు అలంకరించుకొన్నట్లు తోచెను. గరుడుడు తన ఱెక్కలతో సముద్రమును క్షోభిల్లచేసి, దాని నడుమ గుహవంటి దారిని చేసికొని, పాతాళలోకమునకు చేరుటకు వీలుకల్పించుకొనెను. ఆదారిద్వారా పాతాళమును చేరెను. అచటకు చేరి అచటి సర్పముల పెద్దపెద్ద తలలవైపు (పడగలవైపు) తనదృష్టిని సారించెను. ఆ చూపు- "త్వరలో గరుడుని కోఱపళ్లు మీవద్దకు వచ్చి చేయవలసిన పనిచేసి పోగలవు.'' అని ముందుగానే తెలుపుటకు సర్పమువద్దకు గరుడుడు పంపిన దూతివలె గోచరించెను. గరుడుడు తన ఱెక్కలు,

కోఱపళ్లు, ముక్కు మొదలగు వానిని పెద్దగా చేసికొని, వానితో తనకాళ్లు మొదలగు వానిని మర్దించుకొనుచు సర్పములపై పడుటకు మొదలుపెట్టెను. ఇట్టి గరుడుడు మనలను కాపాడునుగాక ! దృష్టిశబ్దముయొక్క స్త్రీ లింగస్వారస్యమునుబట్టి దూతిగా రూపింపబడినది. గరుడుని ఉచ్ఛ్వాసవాయువుచే ఆకాశములోని నక్షత్రములు గుంపులుగా రాలినవని, అవి ముత్యములతో చేసిన అలంకారమువలె ఉన్నవని పల్కుటచే అతిశయోక్తి అలంకారము ఇందు కలదు.

**పత్త్రిణామ్ అగ్రణీః నః అవతు**

**గరుడుడు పాతాళమునకు దండెత్తుట**

**30. ఆవేధఃసౌధశృంగా దనవరతగతే రాభుజంగేంద్రలోకాత్**
**శ్రేణీబంధం వితన్వన్ క్షణపరిణమితాలాతపాతప్రకారః ।**
**పాయా న్నః పుణ్యపాపప్రచయమయపునర్గర్భకుంభీనిపాతాత్**
**పాతాళస్యాంతరాళే బృహతి ఖగపతేః నిర్వ్యఘాతో నిపాతః ॥**

ఆవేధః సౌధశృంగాత్ = బ్రహ్మలోకముయొక్క అగ్రభాగమునుండి, ఆభుజంగేంద్రలోకాత్ = నాగలోకమువరకు, అనవరత = ఎడతెగని (అడ్డులేని), గతేః = గమనమునుకలవాడగు, ఖగపతేః = గరుడునియొక్క, శ్రేణీబంధమ్ = వరుసల రూపమైన బంధమును, వితన్వన్ = విస్తరింపచేయుచు, క్షణపరిణమిత = క్షణకాలములో పరిణమించిన, అలాతపాతప్రకారః = అలాతము (కొఱివి) యొక్క పతనము రీతిని కల్గినది, నిర్వ్యఘాతః = అడ్డులేని, పాతాళస్య = పాతాళముయొక్క, బృహతి = పెద్దదైన, అంతరాళే = మధ్యభాగమునందు, నిపాతః = పడుట (పతనము) పుణ్యపాప = పుణ్యము, పాపము అనువీని యొక్క, ప్రచయమయ = సమూహమువలెనున్న, పునః+తిరిగి, గర్భ = తల్లి గర్భమను, కుంభీనిపాతాత్ = కుంభీపాకనరకములో పడుటనుండి, నః = మనలను, పాయాత్ = రక్షించునుగాక !

పైనగల బ్రహ్మలోకముయొక్క అగ్రభాగమునుండి క్రింద పాతాళలోకమువరకు గరుడుడు తన ఇష్టము వచ్చినట్లు ఎడతెగక సంచరించుట ఎవరికిని అడ్డుపెట్టుటకు సాధ్యముకానిదై యుండెను. ఇటుల అటు, ఇటు సంచరించుచు, పాతాళములోని విశాలమైన మధ్యభాగమున సర్పములను వధించుటకై వాలుట, తిరిగి పైకి ఎగురుటయును అతడు చేయుచుండెను. అతడు అచటకు వచ్చి వాలునపుడు క్షణకాలములో కొఱివికట్టెలు వచ్చిమీదపడుచున్నట్లు తోచెను. అట్లు అడ్డులేని విధమున సంభవించిన గరుడుని గమనాగమనములు పుణ్యపాపరూప కర్మల పరంపరయొక్క ఫలితముగా వచ్చు పునః గర్భవాసమనెడి కుంభీపాకనరకములో పడకుండ మనలను రక్షించునుగాక !

అలాత చక్రమనగా చుట్టును అగ్నిశిఖలను కల్గి, తిరుగునట్టి చక్రము. **"అలాతపాత ప్రకారః"** అనునపుడు అలాతము యొక్క పతనమువంటి పతనము అని అర్థమును చెప్పనగును.



కావున నిదర్శనాలంకారము కలదు. గరుడుని అలాతచక్రసదృశమైన పతనము మనలను నరకపాతమునుండి రక్షించుననుట చమత్కారోక్తి. **"లోకే పక్షిణః ఉత్పత్యోత్పత్య పునః పునః నిపత్య మత్స్యాద్యాహారం కుర్వంతి, తథైవాయ మపి సత్యలోకాగ్రా దధఃప్రదేశస్థితపాతాళలోకపర్యంత నిరర్గళగతిః నాగలోకే నాగసంహారార్థం పునఃపునః ఉద్గత్యోద్గత్య ఆలాతచక్రవత్ నిరంతర పతనధారాకారీ గరుత్మాన్ సుకృతదుష్కృతకారణజాయమాన పునర్గర్భాదిభీతిం ప్రణుదత్వితి భావః"**. అని ఈ శ్లోకభావము సంస్కృతవ్యాఖ్యలో తెలుపబడినది.

**పాతాళస్యాంతరాళే బృహతి ఖగపతేః నిర్వ్యఘాతో నిపాతః**

**పుణ్యాపాపప్రచయమయపునర్గర్భకుంభీనిపాతాత్ పాయా న్నః**

**గరుడుడు సర్పములను వధించుట**

**31. ప్రత్యగ్రాకీర్ణతత్తత్ఫణమణినికరం శంకులాకోటివక్రం**
**తుండాగ్రం సంక్ష్ణువానః కులగిరికఠినే కర్పరే కూర్మభర్తుః ।**
**పాతాళక్షేత్రపక్వద్విరసనపృతనాశాలివిచ్ఛేదశాలీ**
**శైలీం నః సప్తశైలీలఘిమదరభసః సాతు సాధ్వీం సుపర్ణః ॥**

ప్రత్యగ్ర = నూతనముగా, ఆకీర్ణ = చిందిన, తత్ తత్ = ఆయా సర్పముల, ఫణమణినికరం = పడగలలోగల మణుల సమూహమును కల్గినది, కులగిరికఠినే = కులపర్వతములవలె కఠినమైనది అగు, కూర్మభర్తుః = ఆదికూర్మముయొక్క, కర్పరే = చిప్పయందు, (వీపుయందు) శంకులా = కొడవలియొక్క, కోటి = అగ్రభాగమువలె, వక్రమ్ = వంపుగానున్న, తుండ = ముక్కుయొక్క, అగ్రమ్ = చివరగిభాగమును, సంక్ష్ణువానః = బాగుగా పదునుపెట్టు కొనువాడై, సప్తశైలీ = ఏడుకులపర్వతములకును, లఘిమద = తక్కువతనముఁ కల్గించు, రభసః = వేగమును కల్గినవాడై, పాతాళ = పాతాళలోకమను, క్షేత్రే = క్షేత్రమందు, పక్వ = ముదిరిన, ద్విరసనపృతనా = సర్పముల సేనఅను, శాలి = ధాన్యములను, విచ్ఛేదశాలీ = కోయువాడై యున్న, సుపర్ణః = గరుడుడు, నః = మనకు, సాధ్వీమ్ = గొప్ప(సాత్త్వికమైన), శైలీమ్ = స్వభావమును, సాతు = అనుగ్రహించునుగాక !

లోకమున పైరును కోయువాడు పెద్ద ఱాతిబండపై ఇసుకను జల్లి, అందు కొడవలి వంటి సాధనములకు పదునుపెట్టి, దానితో తన పొలమున పండిన ధాన్యమును కోయును. గరుడుని ముక్కే ఒక కొడవలి. సర్పములు భయముతో తమ పడగలలో నున్న మణులను క్రిందకు రాల్చుచున్నవి. పాతాళములో క్రింద భూమిని ధరించియుండు ఆదికూర్మముయొక్క వీపు కులపర్వతమువలె మిక్కిలి గట్టిది. దానిని రాతిబండగా చేసికొని, రాలియున్న నాగమణులను ఇసుకగా జల్లి గరుడుడు వంగియున్న తన ముక్కుచివరి భాగము అను కొడవలికి పదునుపెట్టెను. పాతాళము ఒక సస్యక్షేత్రము. అందున్న పాముల సేనయే ముదిరిన ధాన్యములు. గరుడుడు తన ముక్కుఅను పదునైన కొడవలితో సర్పసేన అను ధాన్యమును కోసెను. ఆ గరుడుని వేగమును తాళలేక కులపర్వతములు అన్నియు

తేలికయై, తమ స్థానములనుండి కదలుచున్నవి. ఇట్టి మహిమనుకల గరుడభగవానుడు మనకు మంచి స్వభావమును కల్గించునుగాక !

కుల పర్వతములు ఏడు. అవి **"మహేంద్రో మలయస్సహ్యః శక్తిమాన్ ఋషపర్వతః, వింధ్య శ్చ పారియాత్ర శ్చ సప్తైతే కులపర్వతాః"** అనునవి **"శంకులాకోటివక్త్రం, కులగిరికఠినే"** అను ప్రయోగములలో **'ఇవ'** శబ్దప్రయోగములేకుండుటచే లుప్తోమాలంకారము కలదు. **"పాతాళక్షేత్ర పక్వద్విరసనపృతనాశాలి"** అనుపుడు రూపకము. ఈ శ్లోకముయొక్క సారము సంస్కృతవ్యాఖ్యలో ఇట్లు తెలుపబడినది. **"అయం భావః - లోకే యథాఽఽవా కర్షకః పాషాణే నితేజితేన దాత్రేణ స్వక్షేత్రవ్రీహీన్ ఛినత్తి, తథా స్వచంచ్వగ్రం భూమ్యాధారకమఠలోష్ఠే క్ష్ణుతం విధాయ, సప్త కులపర్వతపాటనదక్షరభసో గరుడః పాతాళలోకే సర్పజన మచ్ఛిన దితి"**.

**సుపర్ణః సాధ్వీం శైలీం నః సౌతు**

**జయించిన గరుడుని భుజాస్ఫాలనము**

**32.** **పర్యస్యత్ పన్నగీనాం యుగపదసమయా నర్భకాన్ గర్భశోకాత్**
**బ్రహ్మస్తంబప్రకంపవ్యతిషజదఖిలోదన్వదున్నిద్రఘోషమ్ ।**
**చక్షు శ్చక్షుఃశ్రుతీనాం సపది బధిరయత్ పాతు పక్షీశ్వరస్య**
**క్షిప్రక్షిప్తక్షమాభృత్క్షణఘటితనభఃస్ఫోట మాస్ఫోటితం నః ॥**

పన్నగీనామ్ = సర్పస్త్రీల, గర్భకోశాత్ = గర్భకోశములనుండి, అసమయాన్ = తగిన సమయముకాని, అర్భకాన్ = శిశువులను, యుగపత్ = ఒకేమారు, పర్యస్యత్ = బయటపడునట్లుచేయునది, బ్రహ్మస్తంబ = బ్రహ్మమొదలు గడ్డిపోచవరకుగల ప్రాణుల, ప్రకంప = ప్రకంపనలతో, వ్యతిషజత్ = కలతపెట్టుచున్న, అఖిల = సమస్తమైన, ఉదన్వత్ = సముద్రమును కల్గినది, ఉన్నిద్రఘోషమ్ = మిక్కిలి శబ్దమును చేయునది. చక్షుః శ్రుతీనాం = సర్పముల, చక్షుః = నేత్రరూప శ్రోత్రమును, సపది = వేగముగా, బధిరయత్ = చెవిటిగా చేయుచున్నది, క్షిప్ర = వేగముగా, క్షిపత్ = ఎగుర గొట్టబడిన, క్షమాభృత్ = పర్వతములను కల్గినది, క్షణ = క్షణకాలములోనే, ఘటిత = ఘటింపచేయబడిన (సంభవింపచేయబడిన) నభఃస్ఫోటమ్ = ఆకాశముయొక్క విస్ఫోటమును కల్గినది. అగు, పక్షి+ఈశ్వరస్య = గరుడుని యొక్క ఆస్ఫోటితమ్ = భుజాస్ఫాలనము, నః = మనలను పాతు = రక్షించుగాక

గరుడుడు నాగలోకమును ప్రవేశించి, సర్పములను భక్షించిన పిమ్మట, ఆ విజయ హర్షమువలన తన భుజములు చఱచుకొనెను. ఆ ఆదరుకు సర్పస్త్రీల గర్భములలో నున్న శిశువులు ఇంకను జన్మించు సమయము కాకుండగనే క్రిందపడినవి. బ్రహ్మమొదలు గడ్డిపోచవరకు గల ప్రాణులు అన్నియు భీతిల్లినవి. సముద్రముల నన్నిటిని అది కలతపెట్టినది. అందలి ఘోష మరింత వృద్ధి



అగునట్లు చేసినది. కన్నులనే చెవులుగా గల్గిన, చావగా మిగిలిన సర్పముల చెవులను చెవిటిగా చేసినది. పర్వతము లన్నియు వేగముగా బ్రద్దలై ముక్కలగునట్లు చేసినది. క్షణకాలములోనే ఆకాశము విస్ఫోటనమును పొందినది. ఇట్టి అద్భుతములు ఎన్నియో జరుగునట్లు చేసిన గరుడ భగవానుని భుజాస్ఫాలనము మనలను రక్షించునుగాక.

నాగస్త్రీల గర్భముల నుండి సమయముకాక మందే శిశువుల పతనము సంభవించెనని ఇత్యాదిగా అసాధ్యములైనవి వర్ణింపబడుటచే అతిశయోక్తి కలదు. **"పత్రీశ్వరస్య"** అని పాఠాంతరము.

**పక్షీశ్వరస్య ఆస్ఫోటితం నః పాతు**

**గరుడునిపాతాళయాత్రావేగము**

**33.** **తోయస్కంధో న సింధోః సమఘటత మిథః పక్షవిక్షేపభిన్నః**
**పాతాళం న ప్రవిష్టం పృథుని చ వివరే రశ్మిభి స్తిగ్మరశ్మేః ।**
**తావద్గ్రస్తాహివక్త్రక్షరితవిషమషీపంకకస్తూరికాంకః**
**ప్రత్యాయాత: స్వయూథ్యైః స్థిత ఇతి విదితః పాతు పత్రీశ్వరో నః ॥**

(యావత్ = ఎంతలో) పక్ష = గరుడుడు తనఱెక్కలను, విక్షేప = విసరుటచే, భిన్నః = భగ్నమైన, సింధోః = సముద్రముయొక్క, తోయస్కంధః = నీటి ప్రవాహము, మిథః = ఒకదానితో వేరొకటి, న సమఘటత = ఒకటిగా చేరలేదో, వివరే = రంధ్రము, పృథుని చ = పెద్దగాఉన్నను,, తిగ్మరశ్మేః = సూర్యునియొక్క, రశ్మిభిః = కాంతులచే, పాతాళమ్ = పాతాళలోకము, న ప్రవిష్టమ్ = ప్రవేశించలేదో, తావత్ = అంతలో, గ్రస్త+అహి = మింగిన పాముల, వక్త్రక్షరిత = నోటినుండి స్రవించిన, విషమషీపంక = విషమను మసియొక్క బురదచే, కస్తూరికా +అంకః = కస్తూరిముద్రలను కల్గినవాడై, ప్రత్యాయాతః = తిరిగి వచ్చినవాడై, స్వయూథ్యైః = తమ చుట్టములతో, స్థిత ఇతి = (ఇచటనే) ఉన్నాడని, విదితః = తెలియబడినవాడైన, పత్రీశ్వరః = గరుడుడు, నః = మనలను పాతు = రక్షించునుగాక !

గరుడుడు తన ఱెక్కలను విసరుటచే సముద్రములోని నీటిపరంపర రెండుగా చీలి పోయెను. అదిఇప్పటికిని ఒకటి కాలేదు. మఱియు ఱెక్కలచే కొట్టబడుటచే సముద్రము మధ్యలో ఏర్పడిన పెద్ద గోతిలోపల సూర్యకిరణములు ప్రవేశించుకు ముందే -అనగా అంత వేగముగా - పాతాళమున నున్న సర్పములను అన్నియు గరుడునిచే భక్షింపబడినవి. అంతియేకాదు. వాని నోటినుండి స్రవించిన విషము మసి బురదవలె ఉండుటచే దానిని గరుడుడు తన ఫాలమున కస్తూరీ తిలకమువలె ధరించి, తన బందువులున్న చోటికి తిరిగివచ్చెను. ఆబంధువులకు గరుడుడు అట్లు పాతాళలోకమునకు పోయివచ్చినదియే తెలియదు. అతడు అచటచే ఉన్నట్లు వారు భావించు విధమున అతిశీఘ్రకాలమున గరుడుడు పాతాళలోకమునకు పోయి, సర్పములను భక్షించి, తిరిగి వచ్చెను.

ఇట్టి మహిమనుకల గరుడుడు మనలను కాపాడును గాక. **"తోయస్కంధ"** ఇత్యాది ప్రయోగమున అతిశయోక్తి, **"విషమషీపంకకస్తూరికాంకః"** అనునపుడు రూపకము, ఉపమయు కలవు. సంస్కృతవ్యాఖ్యాత ఈ శ్లోకభావమును ఇట్లు వివరించెను. **"సర్పహననార్థం పాతాళం ప్రవిష్టః స్వపక్షఘాతవిభక్తసముద్రజలసంఘట్టనాత్ పూర్వ మేవ తతః పాతాళే పక్షాఘాతకలిత సముద్రమధ్యబిలద్వారేణ సూర్యకిరణప్రవేశాచ్చ పూర్వమేవ కాద్రవేయాన్ హత్వా, తద్విష మపి ఫాలే తిలకీకృత్య, పునరాగత్య స్వజనై రత్రైవ స్థిత ఇతి నిర్ధారిత స్సుపర్ణః పాయా దస్మా నితి శ్లోకార్థః"**.

**పత్త్రీశ్వరః నః పాతు**

**సర్పముల ప్రార్థనకు గరుడుడు అంగీకరించుట**

34 **బద్ధస్పర్ధై రివ స్వై ర్బహుభి రభిముఖై రేకకంఠం స్తువానే**
**తత్తద్విశ్వోపకారప్రణయిసురగుణప్రార్థితప్రాణరక్షే ।**
**పాయా న్నః ప్రత్యహం తే క మపి విషధరం ప్రేషయామీతి భీతే**
**సంధిత్సౌ సర్పరాజే సకరుణ మరుణానంతరం ధామ దివ్యమ్ ॥**

బద్ధస్పర్ధైః + ఇవ = పోటీపడుచున్నవారివలె, అభిముఖైః = ఒకరికొకరు ఎదురుగొన్నవారైన, బహుభిః = పలువురు, స్వైః = తనవర్గము వారిచే (సర్పములచే ) ఏకకంఠమ్ = ఒకేగొంతుగా, స్తువానే = స్తుతింపబడువాడు, తత్ తత్ = ఆయా, విశ్వ = లోకములకు, ఉపకార = సహాయమును చేయుటయందు, ప్రణయి = ఆదరమును కల, సురగణ = దేవగణములచే, ప్రార్థిత = ప్రార్థింపబడిన, ప్రాణరక్షే = ప్రాణములను కలవాడు, భీతే = భయపడిన వాడును అగు, సర్పరాజే = నాగరాజు, తే = నీకు, ప్రత్యహమ్ = ప్రతిదినము, కమ్ + అపి =ఒక్కొక్క, విషధరమ్ = సర్పమును, ప్రేషయామి ఇతి = పంపగలను, అని, సంధిత్సౌ = సంధిని చేయగోరినవాడు కాగా, సకరుణమ్ = దయతో కూడిన, అరుణ+అనంతరమ్ = అరుణునకు పిమ్మట జనించిన, దివ్యం ధామ = దివ్యమైనతేజస్సు, నః = మనలను, పాయాత్ =కాపాడునుగాక !

గరుడుడు పాతాళలోకముననున్న లెక్కలేని పాములను వధించెను. అయినను ఇంకను కొన్ని సర్పములు మిగిలి ఉండెను. వానిని కూడ గరుడుడు చంపుటకు ప్రయత్నింపగా, అవి తమ ప్రాణములను రక్షింపవలసినదిగా అతనిని వేడుకొనుటకై పోటీపడుచు, గరుడునకు ఎదురుగా నిలచి, ఏకకంఠముగా స్తుతించినవి. వానిలో సమర్థుడైన ఒక సర్ప రాజు భయముతో అతని వద్దకువచ్చి తమను కాపాడుమని వేడినవి. లోకముల రక్షణయందు మిక్కిలి ఆదరమునుకల దేవతలు కూడ పాములకు ప్రాణభిక్ష పెట్టుమని గరుడుని కోరిరి. సర్పముల నాయకుడు గరుడుని వద్దకు సందేశమును పంపుచు "ప్రతిదినము ఒకొక్క సర్పమును నీకు ఆహారముగా పంపెదను. నీవు మమ్ముల నందఱను ఒకేసారి వధింపవలదు." అని ప్రార్థించి, ఒప్పందమును చేసికొనెను. అరుణునకు పిమ్మట జన్మించిన,



దివ్యమైన తేజోరూపమగు గరుడభగవానుడు కరుణతో అందులకు అంగీకరించెను. అట్టి గరుడుడు మనలను కాపాడునుగాక ! శ్లోకమున **"బద్ధస్పర్ధై రివ"** అను ప్రయోగముచే ఉత్ప్రేక్ష కలదు. **"అయ మర్థః - గరుత్మతి నాగలోకం ప్రవిశ్య స్వేచ్ఛయా సర్వాన్ భక్షయతి సతి. తదా - తవ ప్రతిదినం భుక్త్యర్థం కంచిత్ సర్పం దదామ-ఇతి సర్పబృందే స్తుతికథనపూర్వక మేకవాక్యం బ్రహ్మాదిసమస్తదేవజనై స్సహ ప్రార్థయతి, కరుణయా తథా భవత్వితి గరుత్మా నంగీచకారేతి"** అనుచు ఈ శ్లోకభావము సంస్కృతవ్యాఖ్యలో తెలుపబడినది. ఆ వ్యాఖ్యలో **"విశ్వోపకారప్రణధి"** అను పాఠాంతరము కలదు.

**అరుణానంతరం దివ్యం ధామ నః పాయాత్**

**నాగములు తమ ఒప్పందమును అమలుపరుచుట**

35 **కాప్యస్థ్నా శర్కరాఢ్యం క్వచన ఘనతరాసృక్ఛటాశీధుదిగ్ధం**
**నిర్మోకైః క్వాపి కీర్ణం విషయ మపరతో మండితం రత్నఖండైః ।**
**అధ్యారూఢైః స్వవారే స్వహమహమికయా వధ్యవేషం దధానైః**
**కాలే ఖేలన్ భుజంగైః కలయతు కుశలం కాద్రవేయాంతకో నః ॥**

క్వ+అపి = ఒకచోట, అస్థ్నా = ఎముకలచే, శర్కరాఢ్యమ్ = చక్కెరతో నిండినట్లున్నది, క్వచన = వేరొకచోట, ఘనతర = మిక్కిలి గట్టిగా మారినది, అసృక్ ఛటా = రక్తసమూహముతో, శీధుదిగ్ధమ్ = మద్యముతో (తడసినది) పూయబడినది, క్వ+అపి = ఇంకొకచోట , నిర్మోకైః = పాము కుబుసములతో, కీర్ణమ్ = నిండినది, అపరతః = మఱియొకచోట, రత్నఖండైః = రత్నముల ఖండముచే, మండితమ్ = అలంకరింపబడినట్లున్నదగు, విషయమ్ = భోజన స్థలము, స్వవారేషు, = తమ తమ వంతుప్రకారమువచ్చిన సర్పములలో, అహమహమికయా = నేను ముందు-నేను ముందు అనుస్పర్థతో, అధ్యారూఢైః = అధిరోహింపబడినవి, వధ్యవేషమ్ = వధింపబడుటకు తగిన వేషమును, దధానైః = ధరించినవి అగు, భుజంగైః = సర్పములతో, కాలే = భుజించుకాలమున, ఖేలన్ = క్రీడించునట్టి, కాద్రవేయ + అంతకః = పాముల అంతకుడగు గరుడుడు, నః = మనకు, కుశలమ్ = క్షేమమును, కలయతు = కల్గించునుగాక !

నాయకుడగు సర్పము ప్రతిదినము ఒక్కొక్క సర్పమును గరుడునకు ఆహారముగా ఒప్పందము ప్రకారము పంపుచుండెను. గరుడుడు ప్రతిదినము వచ్చు సర్పమును భక్షించుటకు ఒక రాతిబండను తగిన చోటుగా చేసికొనెను. తన వంతు ప్రకారము వచ్చు సర్పము ప్రతిదినము ఆ రాతిబండవద్దకు వచ్చుట, గరుడుడు దానిని భక్షించుటయు జరుగుచుండెను. ఆ రాతిబండకు సమీపమున ఒక వైపు నున్న పాముల ఎముకల పొడి, చక్కెర పొడి రాశివలె ఉన్నది. వేరొక దిశలో మద్యమువలె రక్తము పేరుకొని గట్టిపడియున్నది. ఇంకొక వైపు పాముల కుబుసములు నిండియున్నవి. వేరొక మూల పాముల పడగలపై గల మణులు పడి, ప్రకాశించుచున్నవి. సర్పములు తమతమవంతు

దినములలో గరుడునకు ఆహారమగుటకు తగిన వేషమును దాల్చి వచ్చి, రాతి బండవద్ద యున్నవి. వానికి తమకిట్టి స్థితి ప్రాప్తించెను కదా ! అను దుఃఖము కలుగనేలేదు. తమ తమ ఆత్మీయులను రక్షించుకొనుటలో వానికి గల ఆదరముల వలన "నేను ముందు పోయెదను. నేను ముందు పోయెదను." అనుచు పోటీ పడుచున్నవి వానిని వంతు ప్రకారము భక్షింపభోవుటకుముందు గరుడుడు కాలక్షేపముగా వానితోపాటు క్రీడించి, ఆపిమ్మటనే భక్షించెను. ఇట్టి గరుడభగవానుడు మనకు క్షేమమును కల్గించునుగాక !

ఇచట " **కుశల**"మనగా లౌకికక్షేమము కాదు. విష్ణులోక ప్రాప్తిరూపమైన కుశలమని భావము. **"అస్థ్నా శర్కరాఢ్యం" "అసృక్ ఛటా శీధుదిగ్ధమ్"** ఇత్యాదులలో రూపకాలంకారము కలదు. ఈ శ్లోకతాత్పర్యము **"అయ మర్థః - ఫణినా మస్థిజాలరక్త ప్రవాహకంచుకనికరశిరోరత్నై శ్చ అభిత శ్చ సమాకీర్ణం భుక్తిసంకేతాం కణం స్వస్వగమనదినేషు స్వస్వమాతృభాతృముఖ్యాది జనజీవనార్థం సత్వర మహం పూర్వం గచ్ఛేయ మితి సమాగతాన్ సర్వాన్ భక్ష్యభూతాన్ భక్షయన్ గరుత్మా నస్మాకం విష్ణుపదవాస సంపదం దదాత్వితి"** అని సంస్కృతవ్యాఖ్యలో తెలుపబడినది.

**కాద్రవేయాంతకః నః కుశలం కలయతు**

**(4) పరిష్కారవర్ణకః**

**గరుడుడు సర్పములను ఆభరణములుగా దాల్చుట**

**36.** **వామే వైకుంఠశయ్యా ఫణపతికటకో వాసుకిబ్రహ్మసూత్రః**
**రక్షే న్న స్తక్షకేణ గ్రథితకటితట శ్చారుకార్కోటహారః ।**
**పద్మం కర్ణేఽపసవ్యే ప్రథిమవతి మహాపద్మ మన్యత్ర బిభ్రత్**
**చూడాయాం శంఖపాలం గుళిక మపి భుజే దక్షిణే పక్షిమల్లః ॥**

వామే = ఎడమవైపు, వైకుంఠశయ్యా, = భగవానుని పడుక అగు , ఫణిపతి = ఆదిశేషుని, కటకః = వలయముగా అలంకరించుకొనినవాడు, వాసుకి = వాసుకిని, బ్రహ్మసూత్రః = యజ్ఞోపవీతముగా కలవాడు, తక్షకేణ = తక్షకునిచే , గ్రథితకటితటః = బిగించికట్టుకొనిన కటి ప్రదేశమును కలవాడు (తక్షకుని మొలనూలుగాకలవాడు) చారు. = అందమైన, కార్కోట = కర్కోటకుడను సర్పమును, హారః = హారముగా కల్గినవాడు, ప్రథిమవతి = విశాలమైన, అపసవ్యే కర్ణే = కుడిచేవియందు, పద్మమ్ = పద్మమను సర్పమును అన్యత్ర = వేరొకవైపు (ఎడమచెవియందు) మహాపద్మమ్ = మహాపద్మమను సర్పమును, చూడాయామ్ = శిరస్సులో, శంఖపాలమ్ = శంఖపాలుడను సర్పమును, దక్షిణే భుజే = కుడిభుజమునందు, గుళికమ్ అపి = గుళికుడను సర్పమును, భిభ్రత్= ధరించునట్టి, పక్షిమల్లః = పక్షివీరుడు (గరుడుడు), నః = మనలను, రక్షేత్= రక్షించునుగాక !

గరుడభగవానుడు ఎనిమిదిమంది గొప్ప సర్పములను తన దేహమునందు



అలంకారములుగా ధరించియున్నాడు. అతడు తన ఎడమచేతిలో భగవానునకు పడుక అగు ఆదిశేషుని, కుడివైపు గుళికుడను సర్పమును వలయములుగా అలంకరించుకొనియున్నాడు. వాసుకిని యజ్ఞసూత్రముగా , తక్షకుని మొలనూలుగా కల్గియున్నాడు. కర్కోటకుని తన కంఠమున హారముగా ధరించియున్నాడు.కుడి చెవిలో పద్మడను సర్పమును, ఎడమచెవిలో శంఖపాలుని అలంకారముగా కల్గియున్నాడు. ఇట్లు గొప్ప గొప్ప సర్పములను అభరణములుగా అలంకరించుకొని వెల్గు గరుడ భగవానుడు మనలను రక్షించుగాక !

పాంచరాత్రమున సలు సర్పములు గరుడునకు ఆభరణము లగుట వర్ణింపబడినది. - **"అనంతో వామకటకో, యజ్ఞసూత్రం తు వాసుకిః, తక్షకః కటిసూత్రం తు, హారః కార్కోటక స్తథా పద్మో దక్షిణ కర్ణే తు మహాపద్మ స్తు వామతః, శంఖ శ్శిరఃప్రదేశే తు గుళిక స్తు భుజాంతరే, ఏతై రష్ట విధై ర్నాగైః భూషితం భుజగోత్తమైః"** అను పాంచరాత్ర శ్లోకములను అనుసరించి ప్రస్తుతశ్లోకము రచింపబడినదనుట స్పష్టము. **"ఫణిపతికటకః, వాసుకిబ్రహ్మసూత్రః "** ఇత్యాది ప్రయోగములలో రూపకము కలదు.

**ఫణిపతికటకః పక్షిమల్లః నః రక్షేత్**

**సర్పములు గరుడునకు నీరాజనము నిచ్చుట**

**37.** **వర్త్యాభస్వస్తికాగ్రస్ఫురదరుణశిఖాదీప్రరత్నప్రదీపైః**
**బధ్నద్భి స్తాప మంత ర్బహుళవిషమషీగంధతైలాభిపూర్ణైః ।**
**నిత్యం నీరాజనార్థం నిజఫణపలకైః ఘూర్ణమానాని తూర్ణం**
**భోగై రాపూరయేయు ర్భుజగకులరిపోః భూషణా నీషణాం నః ॥**

వర్తి + ఆభ = వత్తివలె వెల్గునవి అగు, స్వస్తిక +అగ్ర = పడగల అగ్రభాగములందు , స్ఫురత్ = ప్రకాశించుచున్న, అరుణశిఖా = ఎఱ్ఱని శిఖలచే, దీప్ర = ప్రకాశించుచున్న, రత్నప్రదీపైః = రత్నములను గొప్ప దీపములను కల్గినది, అంతః = మధ్యలో, తాపమ్ = వేడిమిని, బధ్నద్భిః = కల్గినది, బహుళ = మిక్కిలిగా, విషమషీ = విషమను మసిని (మసివంటి విషమును), గంధతైల = సుగంధపు నూనెతో, అభిపూర్ణైః = నిండినవైయున్న, నిజఫణ = తమపడగలు అను, ఫలకైః = పలకలతో, నిత్యమ్ = ఎల్లప్పుడు, నీరాజనార్థమ్ = హారతిని ఇచ్చుటకై , తూర్ణమ్ = వేగముగా, ఘూర్ణమానాని = తిరుగుచున్నవి అగు, భుజగకులరిపోః = నాగకుల శత్రువగు గరుడుని యొక్క, భూషణాని = సర్పములు, నః = మన, ఈషణామ్ = కోరికను, భోగైః = అనుభవములతో, అపూరయేయుః = పూరించునుగాక !

లోకమున భగవానునకు, భక్తులకు, మహనీయులగుపెద్దలకును మంగళ నీరాజనములను ఇచ్చుట పరిపాటి. ఒక పాత్రలో సుగంధతైలమును పోసి, అందు వత్తిని వేసి, దీపమును వెలిగించి

ఆదీపజ్వాల ఎట్టిగా, వేడిమి కల్గినదై వెలుగుచుండగా మంగళ హారతిని ఇత్తురు. ఈవిధముగానే గరుడునకు ఆభరణములుగా నున్న సర్పములు అతనికి మంగళహారతిని సమర్పించుచున్నవి. వాని విశాలమైన పడగలే దీప పాత్రలు. పడగలలోనున్న రత్నములే దీపములు. వాని ఎట్టని కాంతి జ్వాలలు వత్తులు. మసివంటి విషముయొక్క వేగముచే పడగలు అన్నియు వేడెక్కినవి. మషీపంకమువలె నున్న విషమే ఆదీపమునకు అవసరమైన సుగంధతైలము. సర్పములు తమపడగలను ఎల్లప్పుడు అటుఇటు వేగముగా త్రిప్పుటయే మంగళహారతిని ఇచ్చుట. ఇట్లు తమ కులమునకు శత్రువగు గరుడునకు అలంకారములుగా నుండుటయేగాక. మంగళహారతిని ఇచ్చు సర్పరాజములు మన కోరికలను భోగములతో పూర్తిచేయునుగాక !

భోగములను (పాముశరీరము) కల్గిన సర్పములు మనకు భోగములను అనుగ్రహించును గాక అనుట చమత్కారోక్తి. **"వర్త్యాభ"** అనుచోట నిదర్శన, **"రత్నప్రదీపైః, విషమషీగంధ"** అనుచోట రూపకము, అట్లే, లుప్తోపమయుకలవు. **"నీరాజనార్తైః"** అని వేరొకపాఠము. సంస్కృతవ్యాఖ్యానములో ఈ శ్లోకభావము ఇట్లు తెలుపబడినది. **"పరిమళతైలసిక్తదశాభోజ్జ్వలదీపైః, నీరాజనోచితపాత్రే యథా వా జనాః భూపతేః నీరాజనమంగళోపచారం విదధతి, తథా పరిష్కారపన్నగాః విషగంధతైలసిక్తైః నిజస్ఫటా నీరాజనార్హపాత్రైః కిరణవర్త్యా లబ్ధరత్నదీపైః గరుత్మతో నీరాజనమంగళం వితన్వంతో మమ నిత్యం బ్రహ్మానుభవం కలయత్వి త్యర్థః".**

**భుజగకులరిపోః భూషణాని నః ఈషణాం భోగైః అపూరయేయుః**

**సర్పములు గరుడుని దేహమునందు గాఢముగా చేరియుండుట**

**38.** **అంగప్రత్యంగలీనామృతరసవిసరస్పర్శలోభా దివాంత-**
**త్త్రాసాత్ హ్రాసానుబంధా దివ సహజమిథోవైరశంకోత్తరంగాత్ ।**
**రుద్రాగాఢోపగూఢోచ్ఛ్వసననిబిడితస్థానయోగా దివాస్మ-**
**ద్భద్రాయ స్యు ర్భజంతో భగవతి గరుడే గాఢతాం గూఢపాదః ॥**

అంగ = అవయవములందు, ప్రత్యంగ = అవయవములలోని, భాగములందు, లీన = కలసియున్న, అమృతరస = అమృతరసముయొక్క, విసర = ప్రసరణముయొక్క, స్పర్శ = స్పర్శయందు, లోభాత్ ఇవ = ఆశవలన వలె, సహజ = స్వభావసిద్ధమైన, మిథోవైర = పరస్పర వైరము (గరుడునకు , సర్పములకు మధ్యగల వైరము)యొక్క, శంకా = అనుమానముచే, ఉత్తరంగాత్ = మిక్కిలి వృద్ధియైన అంతఃత్రాసాత్ = మనస్సులోని భయమువలన, హ్రాస+అనుబంధాత్+ఇవ = అనువర్తించుచు వచ్చు తగ్గుదలవలనవలె, రుద్రా = రుద్రాదేవి (గరుడుని భార్య) యొక్క, గాఢ+ఉపగూఢ = మిక్కిలిగాఢముగా ఆలింగనము చేసికొనుట వలన కల్గిన, ఉచ్ఛ్వాస = ఉచ్ఛ్వాసమువలన, నిబిడిత = గాఢముగా చేయబడిన, స్థానయోగాత్ +ఇవ = స్థలములలోనుండుటవలన వలె, భగవతి గరుడే = భగవానుడగు



గరుడుని యందు, గాఢతామ్ = గాఢముగా చేరియుండుటను, భజంతః = పొందునట్టి గూఢపాదః = సర్పములు , అస్మత్‌భద్రాయ = మనమంచి కొఱకు, స్యుః = అగునుగాక.

గరుడుని దేహమునందు అలంకారములుగా అమరియున్న సర్పములు అందు గాఢముగా చేరియుండెను. అందులకు మూడు కారణములను ఊహింపవచ్చును. అవి ఏమనగా - 1. గరుడుడు అమృతమును తీసికొనివచ్చుటచే అపుడు అతని దేహములోని అవయవములన్నింటియందు, అ అవయవముల భాగములందును అమృతరసము చిందియుండునని తలంచి, ఆ అమృతమును తమ జిహ్వలతో ఆస్వాదించి, అమృతత్వమును పొందవలయునను భావముతో అట్లు గాఢముగా చేరియుండవచ్చును.

2. లేక, గరుడునకు, సర్పములకు సహజముగానే శత్రుత్వము ఉన్నందున ఎపుడైనను ఒకనాడు తమను కూడ అతడు మింగి వేయునేమోనను భయాతిశయముతో అట్లుండును.

3. గరుడుడు తన భార్య అగు రుద్రాదేవిని గాఢముగా ఆలింగనము చేసికొనునపుడు అతని ఉచ్ఛ్వాస వాయువులోపలే అణగి యున్నందున అతని దేహము పెద్దదయ్యెను. అపుడు సర్పములు అతని దేహమునకు మరింత చేరువై, గాఢముగా అంటుకొనియున్నవి అనియు తలపవచ్చును. ఇట్లు గరుడుని దేహముతో విశ్లేషములేక, నిత్యము చేరియుండు భాగ్యమును పొందిన సర్పములు మనకు క్షేమమును అనుగ్రహించునుగాక. శ్లోకమున సర్పములు గరుడుని దేహమును గాఢముగా చేరియుండుటకు కారణములు ఉత్ప్రేక్షింపబడుటచే ఉత్ప్రేక్షాలంకారము కలదు.

**భగవతి గరుడే గాఢతాం భజంతః గూఢపాదః అస్మ ద్భద్రాయ స్యుః**

**గరుడుని శిరస్సునకు శంఖపాలుడు అలంకార మగుట**

**39.** **కోటీరే రత్నకోటిప్రతిఫలితతయా నైకధా భిన్నమూర్తిః**
**వల్మీకస్థాన్ స్వయూథ్యా నభిత ఇవ నిజై ర్వేష్టనైః క్లృప్తరక్షః ।**
**క్షేమం నః సౌతు హేమాచలవిధృతశరన్మేఘలేఖానుకారీ**
**రోచి ష్చూడాలచూడామణి రురగదిపో రేష చూడాభుజంగః**

కోటీరే = కిరీటమునందలి, రత్నకోటి = పలువిధములైన రత్నములయందు, ప్రతిఫలితతయా = ప్రతిఫలించుటచే, న+ఏకధా = అనేక రీతులలో, భిన్నమూర్తిః = అనేక రూపములను కల్గినది. వల్మీకస్థాన్= పుట్టలోనున్నది, స్వయూథ్యాన్ = తన వర్గమునకు చెందినవారిని, అభితః = చుట్టు, నిజైః = తనవి యగు, వేష్టనైః = వేష్టనములతో, క్లృప్తరక్షః ఇవ = చేయబడిన రక్షణనుకల్గినదానివలె ఉన్న, హేమ+ అచల= మేరుమేఘమును బంగారుపర్వతముచే, విధృత = ధరింపబడిన, శరత్ లేఖా = శరత్కాలమునందలి మేఘముల వరుసను, అనుకారీ = అనుసరించునది, రోచిః +చూడాల =

తేజస్సు యొక్క సమూహముతో కూడుకొన్నవగు, చూడామణిః= పడగలయందలి రత్నములను కల్గినది అగు, ఉరగరిపోః = గరుడుని, చూడాభుజంగః= తలకు ఆభరణమైయున్న సర్పమగు, ఏషః= ఈ శంఖపాలుడు, నః= మనకు, క్షేమమ్ = క్షేమమును, సౌతు= కల్గించునుగాక !

గరుడుని తలకు ఆభరణమై వెలుగు శంఖపాలుడను సర్పము రూపము గరుడుని కిరీటమునగల పలు రత్నములందు ప్రతిఫలించినది. ఒక్కొక్క రత్నమునందును ఈ సర్పము యొక్క ప్రతిబింబము ప్రతిఫలించుటచే కిరీటమునందు అంతట పలు సర్పములు ఉన్నట్లు కన్పించుచున్నది. ఆసన్నివేశమును చూచునపుడు ఈసర్పము పుట్టలోనున్న తన బంధువులగు పలుసర్పములను తనతో చుట్టుకొని రక్షించుచున్నదా ఏమి ? అని తోచుచున్నది. దాని పడగలోనున్న రత్నముల తేజము దట్టముగా ప్రసరించుచున్నది. బంగారురంగునుకల గరుడుని కిరీటమునందు తెల్లని ఈసర్పము యొక్క వెలుగులను చూడగా మేరుపు అను బంగారుపర్వతమునందు శరత్కాలమున తెల్లని మేఘమాలిక అమరియున్నట్లున్నది. ఇట్లు గరుడుని కిరీటమును అధిరోహించు భాగ్యమును పొందిన శంఖపాలుడు మనకు క్షేమమును అనుగ్రహించునుగాక !

శంఖపాలుడు తన బంధువులను తనతో చుట్టుకొని రక్షించుచున్నట్లున్నదనుటచే ఉత్ప్రేక్ష కలదు. **"మేఘాచలవిధృతశరన్మేఘలేఖానుకారీ "** అనుటచే ఉపమాలంకారమును కలవు.

**ఉరగరిపోః ఏష చూడాభుజంగః నః క్షేమం సౌతు**

**సర్పములు గరుడుని చెవులకు అలంకారమగుట**

40 **ద్రాఘీయఃకర్ణపాశద్యుతిపరిభవనవ్రీడయేవ స్వభోగం**
**సంక్షిప్యాశ్నన్ సమీరం దరవినతముఖో నిఃశ్వసన్ మందమందమ్ ।**
**ఆసీదద్గండభిత్తిప్రతిఫలనమిషాత్ క్వాపి గూఢం వివక్షుః**
**క్షిప్రం దోషాన్ క్షిపేన్నః ఖగపతికుహనాకుండలః కుండలీంద్రః ॥**

ద్రాఘీయః = మిక్కిలి పెద్దదిఅగు, కర్ణపాశ = గొప్పకర్ణములందలి, ద్యుతి =కాంతిచే (కల్గిన),పరిభవన= అవమానముచే ఏర్పడిన, వ్రీడయా ఇవ = లజ్జ చే వలె , స్వభోగమ్ = తన శరీరమును, సంక్షిప్య = కుచించుకొని, సమీరమ్ = గాలిని, అశ్నన్= భుజించుచు, దరవినతముఖః = ముఖమును కొంచెము వంచినదై, మందమందమ్ = మెల్లమెల్లగా, నిఃశ్వసన్ =నిశ్వాసమును చేయుచు, ఆసీదత్ = దగ్గరలోనున్న, గండభిత్తి= (గరుడుని) గోడవంటి గండప్రదేశమున, ప్రతిఫలనమిషాత్= ప్రతిఫలించు వ్యాజమున, క్వాపి= ఏదైన ఒకచోట, గూఢమ్ = రహస్యముగా, వివక్షుః = ప్రవేశింపగోరునదగు, ఖగపతి= గరుడుని యొక్క, కుహనాకుండలః= కుండలరూపములోని, కుండలీంద్రః = గొప్పసర్పము, నః = మన, దోషాన్= దోషములను, క్షిప్రమ్ = వెంటనే, క్షిపేత్ = పోగొట్టునుగాక !



గరుడుని కర్ణములకు కుండలములు అలంకరించుకొనుచోట పద్మము, మహాపద్మము అను రెండు గొప్ప సర్పములు కుండలములవలె అమరియున్నవి. అవి తమ శరీరమును మిక్కిలి చిన్నదిగా చేసికొని, ముఖమును, కొంచెము వంచి, మెల్లమెల్లగా ఊపిరిని విడుచుచు, వాయువును ఆహారముగా గొనుచున్నవి. దానిని చూడగా, తమ కంటే గరుడుని కర్ణములు మిక్కిలి పెద్దవి అగుటచే, మిక్కిలిగా ప్రకాశించుటచే వానికి లజ్జ కలుగగా, అట్టి స్థితి వానికి ఏర్పడెనా ? అని తోచుచున్నది. మఱియు భిత్తి వంటి గరుడుని గండస్థలములో వాని రూపముల ప్రతిఫలించుచున్నవి. వానిని చూడగా, ఆసర్పములు తమకు కల్గిన అవమానమువలనే తమ ముఖమును బయటకు చూపలేక వానిని ఎచటనైనను దాచుకొనవలెనని ప్రయత్నించుచున్నవా ? అన్నట్లున్నవి. ఇట్టి సర్పములు మన పాపములను వేగముగా పోగొట్టునుగాక !

చుట్టుకొనియున్న సర్పములకు, కర్ణములకు గల ఆకారములోని సామ్యమును బట్టి శ్లోకములో ఆరెండును పోల్చబడినవి. **'కర్ణపాశ'** శబ్దము శ్రేష్ఠవాచకము. **"పరిభవనవ్రీడయా ఇవ"** అనుటచే ఉత్ప్రేక్ష, **"గండభిత్తిప్రతిఫలనమిషా"** అనుచోట అపహ్నవాలంకారమును కలవు. ఈ శ్లోకభావము సంస్కృతవ్యాఖ్యలో ఇట్లు వివరింపబడినది. **"గరుత్మతో దక్షిణాదక్షిణకుండలభూతం పద్మమహాపద్మాఖ్యపన్నగయుగ మిదానీ మేవ భూతభవిష్యత్ వర్తమానపాపరాశి మపహృత్య నిఃశ్రేయసం సంపదం దదాత్విత్యర్థః"**

**ఖగపతికుహనాకుండలః కుండలీంద్రః నః దోషాన్ క్షిప్రం క్షిపేత్**

**గరుడునకు కర్కోటకుడు మాల అగుట.**

41. **వాలాగ్రగ్రంథిబంధగ్రథితపృథుశిరోరత్నసందర్శనీయో**
**ముక్తాశుభ్రోదరాభో హరిమణిశకలశ్రేణిదృశ్యేతరాంశః ।**
**విష్వక్‌దంభోళిధారావ్రణకిణవిషమోత్తంభనస్తబ్ధవృత్తిః**
**వ్యాళాహారస్య హృద్యో హరతు స మదఘం హారదర్వీకరేంద్రః ॥**

వాల + అగ్ర =తోకచివరలోనున్న, గ్రంథిబంధ = గ్రంథిబంధముచే, గ్రథిత = కూర్చబడిన పృథుశిరోరత్న = పెద్ద శిరోరత్నముచే, సందర్శనీయః = చూడతగినది, ముక్తా = ముత్యములవలె, శుభ్ర+ఉదర+అభః = తెల్లని, ఉదరమునందలి కాంతిని కల్గినది, హరిమణిశకలశ్రేణి = ఇంద్రనీలమణి ఖండముల వరుసవలె , దృశ్యా, = చూడతగిన, ఇతర + అంశః = మిగిలిన భాగమును కల్గినది, విష్వక్ = చుట్టునుగల, దంభోళిధారా = వజ్రాయుధము యొక్క మొనచేఏర్పడిన, వ్రణకిణ = గాయముల కాయలు, విషమ+ఉత్తంభన =ఎత్తుపల్లములుగా నుండుటచే, స్తబ్ధ = నిలుకడ అయిన (నిలచిన), వృత్తిః = వ్యాపారమును కల్గినది అగు, వ్యాళ +ఆహారస్య = నాగములను ఆహారముగా గల గరుడుని యొక్క, హృద్యః = అందమైన (హృదయమందున్న) సః = ఆ, హారదర్వీకర + ఇంద్రః=

హారమురూపములోనున్న గొప్పసర్పమగు కర్కోటకుడు, మత్ + అఘమ్ = నా పాపమును, హరతు = హరించునుగాక !

గరుడుని వక్షఃస్థలమున కర్కోటకుడను సర్పము ముత్యాలహారమువలె శోభిల్లుచున్నది. అది తన తోకయొక్క అగ్రభాగమును తలతో చేర్చి, ముడిగా చేయుటచే ఒక హారముగా కనుపించుచున్నది. దాని పెద్దపడగలోని రత్నము ఆ మాలకు నాయకమణిగా భాసించుచున్నది. ఆ సర్పముయొక్క ఉదరభాగమంతయు తెల్లని వర్ణమును కల్గినదగుటచే ఒక ముత్యాల హారముగా తోచుచున్నది. దానిపై భాగము నల్లని దగుటచే ముత్యాల సరములో ఇంద్రనీలమణి ఖండములు వరుసగా పొదిగినట్లున్నది. గరుడుడు దేవతలతో పోరాడినపుడు ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించుటచే గరుడుని దేహమున గాయములు ఏర్పడి, పిమ్మట అచట కాయలుగా మారినది. అవి ఎత్తు పల్లములుగా ఉండుటచే ఆచోట కర్కోటకము తాను తలచిన రీతిలో సంచరింప వీలులేక ఆటంకము కల్గుచుండుటచే, అటు ఇటు కదలలేకున్నది. అట్టి అందమైన ఆ సర్పము మన పాపమును పోగొట్టునుగాక !

**"హృద్యః"** అనుపదము శ్లిష్టము. హృదయప్రదేశమునందు ఉన్నది అని, అందమైనదని అర్థము. **"ముక్తాశుభ్రోదరాభః"** అనునపుడు ఉపమ కలదు. **"ముక్తాశుక్త్యంతరాభః"** అను వేరొక పాఠము సంస్కృత వ్యాఖ్యలో గైకొనబడినది. ముత్యపుచిప్పయొక్క కాంతివంటి కాంతిని కల్గినదను అర్థమును ఆపాఠమునకు చెప్పనగును. కావున నిదర్శనాలంకారము కలదు. అట్టే **"శ్రేణీదృశ్యేతరాంశః"** అనునపుడు ఇవాది పదప్రయోగము లేకుండుటచే లుప్తోపమయుకలదు. ఈశ్లోకభావమును వివరించుచు సంస్కృతవ్యాఖ్యాత ఇట్లనెను. **"అమృతాహరణ సమయే కులిశధారావిద్ధస్య గరుత్మతః కంఠసక్తస్య, స్వస్యాపి సంప్రాప్తక్షతిగ్రంథిపరివీతత్వాత్, శరీరవక్రతయా హారో భవత్ కార్కోటనాగః సమస్తపాపజాల మస్మదీయ మపహరత్విత్యర్థః"**.

**వ్యాళాహారస్య హృద్యః హారదర్వీకరేంద్రః మదఘం హరతు**

**గరుడునకు వాసుకి యజ్ఞోపవీతమగుట**

42. **వైకక్ష్యస్రగ్విశేషచ్ఛురణపరిణమచ్ఛస్త్రబంధానుబంధః**
**వక్షఃపీఠాధిరూఢో భుజగదమయితుః బ్రహ్మసూత్రాయమాణః ।**
**అశ్రాంతస్వైరనిద్రావిరచితవివిధోచ్ఛ్వాసనిఃశ్వాసవేగ-**
**క్షామోచ్చూనాకృతి ర్నః క్షపయతు దురితం కోఽపి కద్రూకుమారః ॥**

భుజగదమయితుః = సర్పములను అణచునట్టి గరుడునియొక్క, వక్షఃపీఠ = వక్షస్సు అను పీఠమును, అధిరూఢః = అధిరోహించినది, వైకక్ష్య = వక్రముగా (వ్యతిరేకముగా) వేయబడిన, స్రక్+విశేషః = గొప్పమాలయొక్క, చ్ఛురణ = సంబంధము వలన, పరిణమత్ = పరిణమించిన, శస్త్రబంధ - అనుబంధః = ఆయుధము యొక్క బంధమును అనుసరించుచున్నది, అశ్రాంత = విశ్రాంతి లేక, స్వైరనిద్రా = స్వేచ్ఛగా నిద్రపోవుటచే, విరచిత = ఏర్పడిన, వివిధ = పలువిధములైన, ఉచ్ఛ్వాస = ఉచ్ఛ్వాసమును, నిఃశ్వాస = నిశ్వాసము అను వానియొక్క, వేగ =వేగముచే, క్షామ = కొంచెముగా, ఉచ్చూర్ణ = పెద్దదిగానున్న, ఆకృతిః = ఆకారమునుకల్గియున్నది, బ్రహ్మసూత్రాయమాణః = యజ్ఞోపవీతమువలె అగుచున్నది అగు , కః + అపి =గొప్పదైన, కద్రూకుమారః = కద్రువు కుమారుడగు వాసుకి, నః = మన, దురితమ్ = పాపమును, క్షపయతు = నశింపచేయునుగాక !



గరుడుడు వాసుకి అను సర్పమును తనకు యజ్ఞోపవీతముగా ధరించియున్నాడు. ఆ సర్పము గరుడుని వక్షఃస్థలమును తనకు ఆసన పీఠముగా చేసికొని దానిని అధిరోహించి, అందు అమరియున్నది. యజ్ఞోపవీతము వక్షఃస్థలమున ఎడమ భుజమునుండి ఉదరమునకు కుడివైపు వరకు వక్రముగా కదా ఉండును. గరుడుని వక్షమున కుడివైపు మాల ప్రకాశించుచున్నది. ఇట్లు వక్షః ప్రదేశమునకు కుడివైపున మాల, ఎడమవైపున యజ్ఞోపవీతమును సేవించునపుడు ఆయుధములను క్రింద విడువక యుంచుకొనుటకై వీరులు ధరించు దారముల వలె కన్పించుచున్నవి. వీరులు తమ ఖడ్గము మొదలగు ఆయుధములను దాల్చుటకై కంఠమునుండి రెండు వైపుల రెండు దారములను కట్టుకొనుట అలవాటు. మఱియు ఆ వాసుకి గరుడుని వక్షఃస్థలమున ఎట్టి చింతయులేక నిరంతరము నిద్రించుచున్నది. అపుడు పలురీతులలో ఉచ్ఛ్వాస-నిశ్వాసములను చేయునపుడు (ఊపిరిని విడుచునపుడు) దాని ఒడలు పెద్దదిగను, చిన్నదిగను కనుపించుచున్నది. ఇట్టి వాసుకి అను సర్పరాజము మన పాపములను పోగొట్టును గాక !

శ్లోకమున **"పరిణమచ్ఛస్త్రబంధానుబంధః"** అనునపుడు **"అనుబంధః"** అనుటకు **"ఇవ"** అను అర్థమును చెప్పుటచే ఉపమాలంకారము ధ్వనించుచున్నది. **"వక్షఃపీఠ"** అనుచోట రూపకము కలదు. **"అయ మర్థః - ఉభయోః కక్షప్రదేశయో రపి కరవాలక్షురికాద్యాయుధబంధనార్థం సవ్యాపసవ్యం సూత్రద్వయం కంఠప్రదేశే దధతి వీరాః, తథాఽపసవ్యపార్శ్వస్థో గరుత్మతో యజ్ఞసూత్రభూతః సవ్యపార్శ్వాశ్రితమాల్యవిశేషసంవలితః శస్త్రబంధానుకారీ వాసుకి ర్నామ పన్నగపతిః అస్మత్ పాపమపనుదతు"**. అనుచు ఈ శ్లోకభావమును సంస్కృతవ్యాఖ్యాత వివరించెను.

**భుజగదమయితుః బ్రహ్మసూత్రాయమాణః కోఽపి**

**కద్రూకుమారః నః దురితం క్షపయతు**

**గరుడునకు సర్పములు వలయములగుట**

43. **శ్లిష్యద్ముద్రాసుకీర్తిస్తనతటఘుసృణాలేపసంక్రాంతసార-**
**స్ఫారామోదాభిలాషోన్నమితపృథుఫణాచక్రవాలాభిరామః**
**ప్రాయః ప్రేయఃపటీరద్రుమవిటపధియా శ్లిష్టపక్షీంద్రబాహుః**
**వ్యాహన్యా దస్మదీయం వృజినభర మసౌ బృందశో దందశూకః ॥**

శ్లిష్యత్ = ఆలింగనము చేసికొనియున్న, రుద్రాసుకీర్తి = రుద్ర, సుకీర్తి అను ఇద్దరు భార్యలయొక్క, స్తనతట = కుచతటమునందున్న, ఘసృణ+ఆలేప = కుంకుమపంకముచే, సంక్రాంత = సంక్రమించిన, సార = గొప్పదైన, స్ఫార = మిక్కిలియైన (గాఢమైన) ఆమోద = సుగంధమునందలి, అభిలాష = ఆశచే, ఉన్నమిత = పైకిఎత్తబడిన, పృథు = పెద్దదైన, ఫణాచక్రవాళ = పడగల సమూహముచే (వలయరూపములోనున్న పడగలచే), అభిరామః = అందమైనది, ప్రాయః = తఱచుగా, ప్రేయః = ప్రియమగు, పటీరద్రుమ = చందనవృక్షముయొక్క, విటపధియా = కొమ్మ అను బుద్ధితో, శ్లిష్ట పక్షి+ఇంద్రబాహుః = గరుడుని బాహువులను ఆలింగనముచేసికొన్నది, అగు, అసౌ = ఈ, దందశూకః = సర్పము, అస్మదీయమ్ = మనకుసంబంధించిన, వృజినభరమ్ = పాపభారమును, బృందశః = గుంపులుగుంపులుగా, వ్యాహన్యాత్ = సంహరించునుగాక !

గరుడుని బాహువులకు ఆదిశేషుడు, గుళికుడు అను రెండు సర్పములు రెండు వలయములుగా అలంకరించి యుండును. గరుడుని అతని భార్యలగు రుద్ర, సుకీర్తులు గాఢముగా ఆలింగనము చేసికొన్నపుడు వారి స్తన తటములలోనున్న కుంకుమపంకముయొక్క దివ్యమైన పరిమళము గరుడుని వక్షఃస్థలమునందు సంక్రమించును. దానిని ఆఘ్రాణించు ఆశతో అతని చేతులకు వలయములుగా అలంకరించియున్న రెండు సర్పములు తమ పెద్ద, గుండ్రని పడగలను ఉన్నతముగా చేసి పైకిఎత్తినవి ఆసన్నివేశము మిక్కిలి మనోహరమైనది. సర్పములకు చందన వృక్షమనిన ఎల్లప్పుడు ఇష్టము. గరుడుని బాహువులను చూచినపుడు చందన వృక్షశాఖలా ఇవి ! అని ఆ సర్పములకు తోచుటచే, అవి ఆ బాహువులను ఎప్పుడును విడువక ఆలింగనము చేసికొనుచున్నట్లున్నది. అట్టి సర్పములు మన పాప సంచయమును గుంపులుగుంపులుగా నశింపచేయునుగాక!

**"పటీరద్రుమవిటపధియా "** అను ప్రయోగముచే ఆదిశేషునకు, గుళికునకు గరుడుని భుజములందు చందనవృక్షశాఖల భ్రమను కల్గినదని తెలుపుటచే ఇచట భ్రాంతిమదలంకారముకలదు. సంస్కృతవ్యాఖ్యానములో ఈ శ్లోకతాత్పర్యము **"రహసి రుద్రాసుకీర్త్యో రాలింగనేన వక్షోజలేపిత కుంకుమపంకపరిమళపరివాసితం గరుడభుజయుగం శైత్యపరిమళసహితం శ్రీచందన తరువిటప మితి నిశ్చిత్య స్థితః సదా శైత్యపరిమళాభిలాషీ విషానలజ్వలద్దేహః గుళికః శేష శ్చ మమ పాపనివహం నరకనికరపనహేతుం పరిహరత్వితి భావః"** అని తెలుపబడినది.

**శ్లిష్టపక్షీంద్రబాహుః వ్యాహన్యా దస్మదీయం వృజినభర మసౌ బృందశో దందశూకః**

**గరుడునకు తక్షకుడు మొలనూలుగా అగుట**

44. **గ్రస్తా నంతర్నివిష్టాన్ ఫణిన ఇవ శుచా గాఢ మాశ్లిష్య దుఃఖ్యన్**
**క్షుణ్ణా నేకః స్వబంధూన్ క్షుధ మివ కుపితః పీడయన్ వేష్టనేన ।**
**వ్యాళ స్తా ర్క్ష్యోదరస్థో విపులగళగుహావాహిఫూత్కారవాత్యా**
**పౌనః పున్యేన హన్యాత్ పునరుదరగుహాగేహవాస్తవ్యతాం నః ॥**



గ్రస్తాన్ = గ్రసింపబడినవారు, అంతః+నివిష్టాన్ (ఉదరమునకు) లోపల ప్రవేశించినవారు, క్షుణ్ణాన్ = చూర్ణము చేయబడినవారును అగు, స్వబంధూన్ = తనబంధువులగు, ఫణినః = సర్పములను, శుచా = దుఃఖముతో, గాఢమ్ = బిగువుగా, ఆశ్లిష్య = కౌగలించుకొని, దుఃఖ్యన్ ఇవ = దుఃఖించుచున్న దానివలె, కుపితః = కోపించినదై, తార్క్ష్య = గరుడునియొక్క, ఉదరస్థః = ఉదరమున నున్నదై, ఏకః = ప్రత్యేకముగానే ఉన్న, వేష్టనేన = చుట్టియుండుటచే, క్షుధమ్ = ఆకలిని, పీడయన్ ఇవ = పోగొట్టుకొనుచున్నది వలె నున్న, వ్యాళః = తక్షకుడను సర్పము, విపుల= విశాలమైన, గళగుహా = గుహవంటి కంఠమునందు, వాహి = ప్రవహించు, ఫూత్కార = ఫూ అను శబ్దముతోవచ్చునట్టి వాత్యా = గొప్ప వాయువును, పౌనఃపున్యేన = మాటిమాటికి విడుచుటద్వారా, నః = మనకు, పునః= తిరిగి, ఉదరగుహా = జనని గర్భమను లోపలిభాగమను, గేహ = ఇంటియందు, వాస్తవ్యతామ్ = నివసించుటను, హన్యాత్ = నశింపచేయునుగాక !

గరుడుని ఉదరమును చుట్టుకొనియున్న తక్షకుడు అను సర్పము మొలనూలువలె ప్రకాశించుచున్నాడు. గరుడుడు పూర్వము పలు నాగములను మింగినపుడు ఈ తక్షకుని బంధువులందఱు నశించిరి. అపాములన్నియు గరుడుని ఉదరమున ఖండఖండములుగా, పొడిపొడిగా మారిరి. లోకమున కొందఱు మనుజులు మరణించిన తమబంధువుల మృతకళేబరముల మొదలగు వానిని కౌగలించుకొని, దుఃఖించుట సహజము, అనుభవసిద్ధమును, గరుడుని కడుపులో మరణించిన తన చుట్టముల శరీరములను తక్షకుడు గాఢముగా కౌగలించుకొని, బాధతో దుఃఖమును పొందునట్లు గరుడుని ఉదరమును గాఢముగా హత్తుకొనియున్న అతడు కనుపించెను. మఱియు గరుడుడు ఆకలితో సర్పములను మింగునేమో, అని భయపడి, అతనికి ఆకలిలేకుండుచేయుటకై అతని ఉదరమును గాఢముగా బిగించికొని యున్నదా ! అనునట్లు ఆ సన్నివేశము ఉన్నది. ఉదరము (కడుపు)ను గట్టిగా కట్టుకొని యున్నచో ఆకలి తెలియదు కదా ! ఇట్లు ఉత్ప్రేక్షించునట్లున్న తక్షకుడు గరుడుని ఉదరమును చుట్టుకొనియుండి, తన విశాలమైన గుహ వంటి గొంతునుండి ఫూత్కారములను చేయుచున్నాడు. ఇట్లు ఆ సర్పము మాటి మాటికి విడుచు ఫూత్కారములు మనలను తిరిగి మాతృగర్భగుహా వాసముచేయుటనుండి కాపాడునుగాక! (పునర్జన్మలేకుండ చేయునుగాక అని భావము)

**"శుచా ఫణిన ఆశ్లిష్య"** అనునపుడు సంభావన చేయబడుటచే ఉత్ప్రేక్ష, **"గళగుహా"** అనుచోట రూపకమును కలవు. **"గరుడజఠరగతం నిజబంధుజనం బాంధవాసక్త్యాదుఃఖిత ఇవాలింగ్య బంధుజననాశకృత్ గరుడవిషయే పున రపి సర్పనిగరణభీత్యా చ పరివేష్టనేన క్షున్నిరసనవ్యాజేన, గరుడం పీడయన్ తక్షకః ముహుర్ముహుః ఫూత్కారవాయువిమోచనేనైవ హేతునాఽస్మత్ పునర్గర్భవాస యోగ్యతా మపహరత్విత్యర్థః"** అనుచు ఈ శ్లోకభావమును సంస్కృతవ్యాఖ్యాత వివరించెను.

**వ్యాళ స్తార్క్ష్యోదరస్థో పౌనఃపున్యేన హన్యాత్ పునరుదరగుహాగేహవాస్తవ్యతాం నః**

### తక్షకుడు గరుడుని నడుమును చుట్టుకొనియుండుట

**45. గాఢాసక్తో గరుత్మత్కటితటనికటే రక్తచండాతకాంకే**
**ఫక్కత్కాంచీమహిమ్నా ఫణమణిమహసా లోహితాంగో భుజంగః**
**సత్తాసాంసిద్ధికం నః సపది బహువిధం కర్మబంధం నిరుంధ్యాత్**
**వింధ్యాద్ర్యాలీనసంధ్యాఘనఘటితతటిత్కాంతిచాతుర్యధుర్యః ॥**

రక్త = ఎఱ్ఱని రంగునుకల, చండాతక = చండాతకము అను వస్త్రమును, అంకే = గుర్తుగాకల (అలంకరించుకొనిన), గరుత్మత్ = గరుడుని, కటి తటనికటే = నడుమునకు సమీపమున, గాఢ+ ఆసక్తః = బిగువుగా చేరియున్నది. ఫక్కత్ = క్రిందకుపడుచున్న, కాంచీ = ఒడ్డాణము యొక్క, మహిమ్నా =మహిమలను కల్గినదగు, ఫణమణిమహసా = పడగలలోనున్న మణుల కాంతిచే, లోహిత+అంగః = ఎఱ్ఱనిరంగునుకల శరీరమును కల్గినది, వింధ్య +అద్రి= వింధ్య పర్వతమునందు, ఆలీన = చేరినవి అగు, సంధ్యా = సంధ్యకాలములోని, ఘన = మేఘములందు, ఘటిత = ఘటితమైన (చేరిన), తటిత్ కాంతి = విద్యుత్ కాంతి యొక్క, చాతుర్య, = ప్రాగల్భ్యమును, ధుర్యమ్ = ధరించునది (కలిగినది) అగు, భుజంగః = సర్పమగు, తక్షకుడు, సః = మనకు, సత్తాసాంసిద్ధికమ్ = ఎల్లప్పుడు ఉండునట్టి, బహువితతమ్ = పలువిధములుగా విస్తరించిన, కర్మబంధమ్ = కర్మసంబంధమును, సపది = వెంటనే, నిరుంధ్యాత్ = అడ్డగించునుగాక !

గరుడుడు చండాతకమను ఎఱ్ఱని వస్త్రమును నడుమున ధరించియున్నాడు. ఆనడుమునకు పక్కగా తక్షకుడు అను నాగము గుండ్రముగా, గాఢముగా చుట్టుకొనియున్నది. దాని పడగలలో నున్న రత్నముల కాంతి దాని శరీరమునందు ప్రసరించుటచే, ఆశరీరమంతయు ఎఱ్ఱగా అయ్యెను. అపుడు ఆసర్పము ఒడ్డాణముకంటే ఎక్కువ శోభను కల్గినదయ్యెను. ఇట్లు అతని నడుములో చండాతకమును అలంకరించుకొనిన చోటుకు సమీపమున తక్షకుడు ఉండుట వింధ్య పర్వతమునందు సంధ్యాసమయమున ఎఱ్ఱని కాంతినికల మేఘము చేరగా, అందు మెఱుపు ప్రకాశించుచున్నట్లు ఉన్నది. ఇట్టి సన్నివేశమున వెలుగు తక్షకుడు మనయందు స్థిరములైయున్న, పలువిధములైన కర్మబంధములను వేగముగా పోగొట్టును గాక !

**"చాతుర్యధుర్య"** అనునపుడు పదార్థవృత్తియగు నిదర్శనాలంకారము కలదు.ఎనిమిది సర్పముల జాతి, జన్మ వర్ణములు పాంచరాత్రమున ఇట్లు తెలుపబడినవి - **"అనంతశంఖపాలౌ ద్వౌ శుక్లాభౌ వహ్నిజౌ ద్విజౌ, వాసుకిపద్మౌ రక్తాభౌ నృపా వింద్రసముద్భవౌ,మహాపద్మతక్షౌ వైశ్యా పీతౌ వారి సముద్భవౌ, కార్కోటగుళికౌ రుద్రౌ కృష్ణౌ వాయుసముద్భవౌ"** ఈ శ్లోక తాత్పర్యము సంస్కృతవ్యాఖ్యలో ఈ క్రింది విధముగా తెలుపబడినది. **"గరుత్మత్ కటిసూత్రభూత తక్షకః సుకృతదుష్కృతరూపసుపర్ణా యశ్శృంఖలాం భిత్వా పరలోకవాసం దదాత్వీత్యర్థః".**

**లోహితాంగో భుజంగః సత్తాసాంసిద్ధికం నః**
**సపది బహువిధం కర్మబంధం నిరుంధ్యాత్**



### (5) అద్భుతవర్ణకః

### భగవానునకు గరుడుడు పలురీతుల సేవచేయుట

**46. వేగోత్తానం వితానం వ్యజన మనుగుణం వైజయంతీ జయంతీ**
**మిత్రం నిత్యాభ్యమిత్రం యుధి విజయరథో యుగ్యయోగానపేక్షః ।**
**దాసో నిష్పర్యుదాసో దనుతనయభిదో నిస్సహాయః సహాయః**
**దోధూయేతాస్మదీయం దురిత మధరితారాతిపక్షైః స్వపక్షైః ॥**

దనుతనయభిదః = అసురులను వధించు భగవానునకు, వేగ+ఉత్తానమ్ = వేగముచే ఉన్నతమైన, వితానమ్ = మేలు కట్టుగా, అనుగుణమ్ = (అతనికి) తగిన, వ్యజనమ్ = విసనకఱ్ఱగా, జయంతీ = జయమును కల్గించు, వైజయంతీ = ధ్వజముగా, నిత్య+అభ్యమిత్రమ్ = ఎల్లప్పుడు ఎదిరింపవచ్చు వారికి విరోధియైయున్న, మిత్రమ్ = మిత్రునిగా, యుధి= యుద్ధమున, యుగ్యయోగ = సాటిలేని గుఱ్ఱములను పూన్చుటను, అనపేక్షః = అపేక్షింపని, విజయరథః = జయమును ఇచ్చు రథముగా, నిష్పర్యుదాసః = ఉపేక్షింపని, దాసః = దాసుడుగా, నిస్సహాయః = వేరొక సహాయము అవసరమే లేని, సహాయః = సహాయకునిగా, అధరిత = జయింపబడిన, అరాతిపక్షైః =శత్రుపక్షములనుకల, స్వపక్షైః = తన ఱెక్కలతో, అస్మదీయమ్ = మన, దురితమ్ = పాపమును, దోధూయేత = ఎగురగొట్టునుగాక !

ఈ శ్లోకమునుండి వరుసగా అయిదు శ్లోకములు గరుడుని అద్భుత కృత్యములను వర్ణించుచున్నవి. శ్రీవైష్ణవ సంప్రదాయమున గరుడునకు **"పెరియతిరువడి"** అనిపేరు. అనగా గొప్పదాసుడని అర్థము. అట్టిపేరు వచ్చుటకు అతడు స్వామికి పలువిధముల కైంకర్యములను చేయుటయే కారణము. ఆ కైంకర్య విశేషములు కొన్ని ఈ శ్లోకమునందు ప్రస్తుతింపబడుచున్నవి.

గరుడుడు పలుపలు రూపములను దాల్చి భగవానునకు పలువిధములైన కైంకర్యములను చేయుచున్నాడు. భగవానుడు ఎచటికైనను పోవుటకు సిద్ధపడినపుడు అతనికి ఎండ వలన, వాన వలన ఎట్టి బాధ కలుగకుండువిధమున వితానముగా మారి, మిక్కిలి వేగముగా వెంటనడచును. భగవానుని దివ్య దేహమునకు తగిన విధమున గాలి వీచు గొప్ప వీవనగా మారును. అట్లే, భగవానుని విజయమును నలుదెసల తెలుపునట్టి విజయపతాకగా మారును. భగవానుని ఎదిరింపవచ్చు శత్రువులను తానే ఎల్లప్పుడు ఎదురై. వారిని అణచును. గుఱ్ఱములను పూన్చవలసిన అవసరములేని ఒక విలక్షణమైన రథమై, స్వామికి జయమును కల్గించును. కొందఱు దాసులను భగవానుడు వేర్వేరు కారణముల వలన దూరము చేసినను గరుడుని మాత్రము ఎల్లప్పుడు కాదనకుండువిధమున ఇతడు దాస్యమును చేయును. ఇతడు భగవానునకు అన్నివేళల అన్ని విధములైన సేవలను చేయుచున్నాడు.

ఇతనికి వేరొకరి సహాయము అవసరము లేదు. ఇట్టి గొప్పతనమును కల్గిన గరుడుడు శత్రువులను తఱిమికొట్టు తన ఱెక్కలతో మన పాపములను పాఱద్రోలుగాక !

ఈ శ్లోకము యామునుల స్తోత్రరత్నములోని - **"దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః"** అనుసూక్తిని ఆధారముగొని రచింపబడినది. ఇందు గరుడుడు పలురీతులలో వర్ణింపబడుటచే ఉల్లేఖాలంకారము కలదు.

**(వేగోత్తానం వితానమ్)** - ఇందులకు **"వినతైశిఱువన్ శిఱకెన్దుమ్ మేలాప్పిన్ కీళ్గ్ వరువాన్"** అను గోదాదేవి సూక్తిని స్మరింపనగును. మఱియు శ్రీవిష్ణుపురాణమున కృష్ణావతార సందర్భములోని - **"గరుడం చ దదర్శోచ్చై రంతర్ధానగతం ద్విజ, కృతచ్ఛాయం హరే ర్మూర్ధ్ని పక్షాభ్యాం పక్షిపుంగవమ్"** అనుచు శ్రీపరాశర భగవానులు పల్కుటయు స్మరణీయము.

**(అనుగుణం వ్యజనమ్)** - పరకాలసూరి ప్రణీతమైన తిరునెడున్దాణ్డకప్రబంధములోని **"అఙ్జిఱైప్పుళ్"** అనుసూక్తిని పెరియవాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానించుచు **"అళ్గకు శెణ్డేఱుమ్ పోతై ఆయాసత్తుక్కు ఆలవట్టమ్ పఱిమాఱినాప్పోలే ఇరణ్డు తిరుచ్చిఱకాలుమ్ ఆశ్వాసకరనాయిరుక్కిఱ పడియైచ్చొల్లుకిఱదు"** అనిపల్కుట అను సంధేయము.

**(వైజయంతీ శకుంతః)** - **"పుళ్లూర్ కొడియానే"** ఇత్యాది పలు దివ్యసూరి సూక్తులు భావ్యములు.

**(మిత్రం నిత్యాభ్యమిత్రమ్)** - **"సఖే ! రాఘవ ! ధర్మజ్ఞ"** అనుచు యుద్ధకాండమున గరుడుడు శ్రీరామునితో పల్కిన పల్కులు ఇచట అనుసంధేయములు. దేశికులు స్తోత్రభాష్యమున - **" గరుత్మత స్తు సఖిత్వం కదాచిదభినయప్రయుక్తమ్"** అని వివరించి, వెంటనే **"యద్వా, సమానచిత్త వృత్తిత్వం సఖిత్వ మితి దర్శితమ్" - ఇత్యాద్యుక్త చిత్తవృత్తిసామ్య మిహ వివక్షితమ్"** అని పల్కిరి. శ్రీపెరియవాచ్చాన్ పిళ్లైకూడ - స్తోత్రవ్యాఖ్యానమున - **"జగత్కారణవ్యాపారఙ్గళిల్ ఈశ్వరన్ తన్నోడే ఉశాకవేణుమ్బడియాన పెరుమై ఉడైయవన్ '** అని సాయించుటయు స్మరింపతగినది.

**(విజయరథః)** - **"ఓడుమ్ పుళ్లేఱి", "అఙ్జిఱైప్పుళ్ తనిప్పాకన్"** ఇత్యాది దివ్యసూరి వచనములు స్మరణీయములు.

**(నిష్పర్యుదాసో దాసః)** - **"పెరియతిరువడి"** అనునామము ఒక్కటియే గరుడుని అప్రతిమ దాసత్వమును తెలుపుటకు చాలును. భగవానుని దాసులలో ఇతడు ప్రముఖుడు కదా !

**(దనుతనయభిదో నిస్సహాయః సహాయః)** - **"పొన్ మలైయిన్ మీమిశై క్కార్ ముకిల్పోల"** వంటి దివ్యసూరుల సూక్తులు భావ్యములు. **"లోకే వితానస్య వేగిత్వం, వ్యజనస్య స్వయ మేవ మందమారుతప్రదాతృత్వం, ధ్వజస్య జయకారిత్వం, మిత్రస్య ప్రతిదిన మభిముఖశత్రుహంతృత్వం,**



**రథస్య వాహనరజ్వాద్యనపేక్షత్వం, దాసస్యావమానరహితత్వం, సహాయస్య సహాయాంతరానపేక్షత్వం చైతత్ సర్వం దుర్లభమ్. అత్ర గరుత్మతి తదేతత్ సర్వ మపి ఘటతే. తస్మా దయ మచ్యుతస్యాతి చోద్యమానపరిగ్రహః. యుధీతిపదేన తదేతత్ సర్వ మపి విషయజాల మాక్షిప్యతే"** అనుచు సంస్కృతవ్యాఖ్యాత ఈ శ్లోకభావమును విశదీకరించెను.

**దోధూయేతాస్మదీయం దురిత మధరితారాతిపక్షైః స్వపక్షైః**

**గరుడుని వేగము సహింపసాధ్యము కాదనుట**

**47.** **ఉక్షా దక్షాంతకస్య స్ఖలతి బలజితః కుంజరః ఖంజరీతిః**
**క్లాంతో ధాతుః శకుంతోఽనుగ ఇతి దయయా సామిరుద్ధస్యదోఽపి ।**
**గ్రాహగ్రస్తద్విపేంద్రక్షతిభయచకితాకుంఠవైకుంఠచింతా -**
**నాసీరోదారమూర్తిః నరకవిహతయే స్తా ద్విహంగేశ్వరో నః ॥**

దక్ష + అంతకస్య = శివుని, ఉక్షా = వృషభము, స్ఖలతి = తొట్రుపడుచున్నది, బలజితః = ఇంద్రుని యొక్క, కుంజరః = ఏనుగు అగు ఐరావతము, ఖంజరీతిః = కుంటిది అగుచున్నది, ధాతుః = బ్రహ్మయొక్క, అనుగః = వెంటవచ్చునట్టి, శకుంతః = పక్షి అగుహంస, క్లాంతః = శ్రమను పొందినది, ఇతి = అని, దయయా = దయతో, సామిరుద్ధ = సగముతగ్గిన, స్యదః + అపి = వేగమును కల్గినవాడైనను, గ్రాహగ్రస్త = మొసలిచే పట్టుకొనబడిన, ద్విప +ఇంద్ర = గజేంద్రునకు, క్షతిభయ = గాయము ఏర్పడునేమోనను భయమువలన, చకిత = మిక్కిలి కలత చెందిన, అకుంఠ =అడ్డులేని, వైకుంఠ = విష్ణువుయొక్క, చింతా = ఆలోచనకు, నాసీర = ముందుగానున్న, ఉదార = గంభీరమైన, మూర్తిః = రూపమును కల్గిన, విహంగ+ఈశ్వరః = పక్షిరాజు అగు గరుడుడు, నః = మనయొక్క, నరకవిహతయే = నరకము యొక్క నాశనముకొఱకు, స్తాత్ = అగునుగాక !

సరస్సులో మొసలినోటి యందు చిక్కుకొని, రక్షణకై భగవానుని ప్రార్థించిన గజేంద్రుని కాపాడుటకై బయలుదేరిన స్వామిని గరుడుడు తన భుజములపై మోసికొని, మిక్కిలి వేగముగా వచ్చెను. అపుడు గరుడుడు వచ్చు వేగమును తాళలేని శివుని వాహనమగు వృషభము యొక్కకాలు తడబడెను. ఇంద్రుని వాహనమగు ఐరావతము కుంటిది అయ్యెను. బ్రహ్మకు వాహనమై, ఎల్లప్పుడు అతనివెంట వచ్చు హంస మిక్కిలి శ్రమను పొందెను. దీనిని గమనించిన గరుడుడు తన మనస్సు కఱిగినవాడై, తన వేగమును కొంత తగ్గించుకొనెను. అయినను మొసలివలన గజేంద్రునకు ఆపదకల్గునేమో ! అను శంకతో భయపడిన భగవానుడు మిక్కిలి త్వరగా అచటికి పోవలయునని సంకల్పించెను. ఆస్వామి అడ్డులేని సంకల్పమునకు ముందుగానే గరుడుడు తన గంభీరమైన రూపమును అందులకు తగిన రీతిలో మలచుకొని, వేగముతో ఆ సంకల్పవేగమునకే పురోగామి అయ్యెను. అట్టి గరుడుడు మనలకు నరకము రాకుండునట్లు కాపాడుగాక !

**"ఖంజరీతిః"** అనునపుడు కుంటివాని రీతివంటి రీతిని కల్గినదను అర్థమును చెప్పుటచే

నిదర్శనాలంకారము, తన వేగమును తగ్గించుకొనినను గరుడుడు భగవానుని సంకల్పము కంటె ముందుగా నుండెననుటచే అతిశయోక్తియు కలవు.

ఉత్తరార్ధమునగల గరుడుని వేగము భగవత్సంకల్పముకంటె మించియున్నదను భావమును కవి భట్టరు శ్రీరంగరాజస్తవ ఉత్తరశతకములోని **"విశ్వధుర్యాం ధియ మసకృ దధో మంధరాం మన్యమానః"** అను సూక్తిని అనుసరించి గ్రహించిరని చెప్పనగును. ఈ రెండును గజేంద్రమోక్ష సందర్భములోనివే అగుట విశేషము. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రములోని **"శిశిరః"** అను నామము గరుడుని ఇట్టి వేగమును సూచించుచున్నదని భట్టరు వ్యాఖ్యానించిరి.

**నరకవిహతయే స్తా ద్విహంగేశ్వరో నః**

**గరుడుడు శ్రీరామావతారమున భగవానునకు సేవచేయుట**

**48.** **వేగోద్వేలః సువేలే కి మిద మితి మిథో మంత్రితో వానరేంద్రైః**
**మాయామానుష్యలీలా మభినయతి హరౌ లబ్ధసేవావిశేషః ।**
**వైదేహీకర్ణపూరస్తబకసురభిణా యః సమాశ్లేషి దోష్ణా**
**తృష్ణాపారిప్లవానాం స భవతు గరుడో దుఃఖవారిప్లవో నః ॥**

హరౌ = భగవానుడు, మాయా = తన సంకల్పవిశేషమగు మాయచే, మానుష్యలీలామ్ = మానవుని రూపమున లీలను, అభినయతి = అభినయించువాడుకాగా (శ్రీరామునిగా అవతరింపగా), వేగ+ఉద్వేలః = మిక్కిలి వేగమును కలవాడై, ఇదమ్ = ఇది, కిమ్ ఇతి = ఏమి అని, సువేలే = సువేల పర్వతమునందు, వానర+ఇంద్రైః = వానరశ్రేష్ఠులచే, మిథః = తమలోతాము, మంత్రితః = శంకింపబడినవాడు, లబ్ధసేవావిశేషః = రామకైంకర్యమును గొప్పగా చేయు అదృష్టమును పొందినవాడు అగు, యః = ఏ గరుడుడు, వైదేహీ = సీతాదేవియొక్క, కర్ణపూరస్తబక = కర్ణమునకు అలంకారమగు పూలగుత్తుల, సురభిణా = సుగంధమును పొందిన, దోష్ణా = బాహువులతో, సమాశ్లేషి = బిగువుగా కౌగిలింపబడెనో, సః = ఆ, గరుడః = గరుడుడు, తృష్ణా = అల్పమైన ఆశలవలన, పారిప్లవానామ్ = మనశ్చాంచల్యమును పొందిన, నః = మనకు, దుఃఖపారిప్లవః = దుఃఖసముద్రమునందలి ఓడగా, భవతు = అగును గాక !

పూర్వము రావణుడు మొదలగు అసురులచే బాధింపబడిన దేవతలు భగవానుని ప్రార్థింపగా, అందులకై అతడు తన సంకల్పముతో మానవరూపమున శ్రీరామచంద్రుడై అవతరించెను. మానవుని వలెనే సుఖదుఃఖములను అనుభవించునట్లు (నటించెను) భావనచేసెను. అపుడు సీతను అపహరించిన రావణుని వధించుటకై శ్రీరాముడు రాక్షసులతో సల్పిన పోరులో ఇంద్రజిత్తు శ్రీరామచంద్రుని, లక్ష్మణుని నాగపాశములతో బంధించెను. ఈ సంగతిని తెలిసికొనిన గరుడుడు నాగపాశబంధములనుండి వారిని విడిపించుటకై మిక్కిలి వేగముగా అచటికి వచ్చెను. అపుడు సువేల పర్వతముపై నున్న వానరవీరులు గరుడుని చూచి వారిలో వారు "ఇపుడు ఇంత



వేగముగా వచ్చునట్టి వస్తువు ఏమి" అని ఆశ్చర్యముతో సంభాషించుకొనుచుండిరి. గరుడుడు వచ్చిన ఆక్షణమే నాగబంధములు తొలగిపోయినవి. ఇట్లు గరుడుడు మహనీయమైన కైంకర్యమును తనకు చేయుటచే మిక్కిలి సంతోషించిన శ్రీరాముడు గరుడుని తన బాహువులతో కౌగలించుకొని, సంభావించెను ఆశ్రీరాముని బాహువులు సీతాదేవి తన కర్ణములకు ఆభరణములుగా అలంకరించుకొని పూలగుత్తుల పరిమళమును కల్గియున్న వైశిష్ట్యమును కల్గినవి. అట్టి తన బాహువుతో శ్రీరాముడు గరుడుని కౌగలించుకొనెను. ఇట్లు శ్రీరామచంద్రునిచే ఆలింగనము చేసికొనబడిన గరుడుడు అల్పమైన ఫలములందు, ఆశలతో మనశ్చాంచల్యమును పొందిన మనకు దుఃఖ సముద్రమును దాటించు ఓడగా కావలయును.

**"దుఃఖపారిప్లవ"** అనునపుడు దుఃఖమే జలమను అర్థము వచ్చుటచే రూపకము కలదు. శ్లోకమున గరుడునకు ఓడతో సామ్యము ధ్వనించుటచే ఉపమాలంకారధ్వని కలదు. సంస్కృతవ్యాఖ్యలో ఈ శ్లోక తాత్పర్యము ఈ క్రింది విధముగా తెలుపబడినది. **"రావణసంహారార్థం లంకాద్వీపే సువేలపర్వతే సుగ్రీవాదిభి స్సహ రఘుపతౌ రాక్షసవధం కుర్వతి, తదా శక్రజిద్విసృష్టసర్పాస్త్రేణ సర్వజనోఽప్యబంధి. తదా గరుత్మత్యతివేగతః సమాగత్య నిజదర్శనమాత్రేణైవ సర్పాస్త్రబంధనం బింధతి సతి, రఘుపతిః హృష్టహృదయః తం భుజయుగళేన సమాలిలింగే, సః గరుడః తృష్ణా రూపసముద్రా దుద్ధృత్య రక్షత్వితి భావః"**. గరుడుడు నాగపాశములనుండి రామలక్ష్మణులను కాపాడిన వృత్తాంతము శ్రీరామాయణము యుద్ధకాండములో 50వ సర్గలో **"తతో ముహూర్తా ద్గరుడం వైనతేయం మహాబలమ్, వానరాః దదృశుః, సర్వే జ్వలంత మివ పావకమ్, త మాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః"** ఇత్యాదిగా కల శ్లోకములు స్మరణీయములు. గరుడుడు శ్రీరాముని ఆలింగనముచేసినట్లు శ్రీరామాయణమున **"ఏవ ముక్త్వా తతో రామం సుపర్ణ స్సుమహాబలః, పరిష్వజ్య సుహృత్ స్నిగ్ధః"** అని, **"ప్రదక్షిణం తతః కృత్వా, పరిష్వజ్య చ వీర్యవాన్, జగామాకాశ మావిశ్య సుపర్ణః పవనో యథా"** అనియు గల అచటి శ్లోకములవలన స్పష్టమగు చున్నది. దీనినిబట్టి దేశికులు శ్రీరాముడే గరుడుని ఆలింగనము చేసికొనెనని ఇచట పల్కియుండవచ్చు.

**తృష్ణాపారిప్లవానాం స భవతు గరుడో దుఃఖవారిప్లవో నః**

**గరుడుడు శ్రీకృష్ణునకు కిరీటమును సమర్పించుట**

**49.** **దుగ్ధోదన్వత్ప్రభూతః స్వకమహిమపృథుః విష్ణునా కృష్ణనామ్నా**
**పింఛాకల్పానుకల్పః సముఘటి సుదృఢో యత్ప్రదిష్టః కిరీటః ।**
**వీరో వైరోచనాస్త్రవ్రణకిణగుణితోదగ్రనిర్ఘాతఘాతః**
**సంఘాతం సర్పఘాతీ స హరతు మహతా మస్మదత్యాహతీనామ్ ॥**

దుగ్ధ+ఉదన్వత్ = పాలసముద్రమువలె, ప్రభూతః = మిక్కిలిపెద్దది, స్వమహిమ = తన గొప్పతనముకంటె, పృథుః = మిక్కిలిపెద్దది, పింఛా+ఆకల్ప = నెమలిపింఛము అను అలంకారమునకు, అనుకల్పః = తగినది, ప్రదిష్టః = ఏగరుడునిచే సమర్పింపబడినది అగు, యత్ కిరీటః = కిరీటము,

కృష్ణనామ్నా = కృష్ణుడను పేరును కల, విష్ణునా = విష్ణువుచే, సుదృఢః = మిక్కిలి బిగుతుగా, సమఘటి = అమరునట్లు కుదిరెనో, వీరః = వీరుడై, వైరోచన = విరోచనునకు సంబంధించిన, అస్త్ర = అస్త్రములచే ఏర్పడిన, వ్రణ = గాయముల, కిణ = గాయములగుర్తులచే, గుణిత = ఎక్కువచేయబడిన, ఉదిగ్ర = గొప్ప, నిర్ఘాత = వజ్రాయుధము యొక్క, ఘాతః = దెబ్బలగుర్తులను కల్గినవాడు, సర్పఘాతీ = సర్పములను వధించువాడును అగు, సః = ఆగరుడుడు, మహతామ్ = గొప్పవగు, అస్మదత్యాహతీనామ్ = మన గొప్ప భయముల, సంఘాతమ్ = సమూహమును, హరతు = హరించునుగాక !

ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు, ఒకానొక సమయమున అతడు క్షీరసముద్రమునందు భగవానునకు కైంకర్యమును చేయుచుండెను. భగవానుడు యోగనిద్రలోనున్నప్పుడు, అచట ఎవరును లేక పోవుటచే, విరోచనుని మనస్సున భగవానుని కిరీటమును దొంగిలింపవలెనని ఒక దుష్టమైన ఆలోచన కల్గెను. తదనుగుణముగా అతడు భగవానుని కిరీటమును అపహరించి, పాతాళలోకమునకు వేగముగా బయలుదేరెను. పిమ్మట క్షీరాబ్దివద్దకు వచ్చిన మునులు మొదలగువారు యోగనిద్రనుండి మేల్కొనిన భగవానుని శిరస్సుపై కిరీటము లేకుండుటను గమనించి, బాధపడి, అచట అంతవరకు ఉన్న విరోచనుడే దానిని అపహరించి యుండునని నిశ్చయించుకొనిరి. అందఱును గరుడ భగవానుని దానిని తిరిగి తీసికొని రావలసినదిగా ప్రార్థించిరి. గరుడుడును వెంటనే పాతాళలోకమునకు చేరి, విరోచనునితో పోరాడి, గెలిచి కిరీటమును తీసికొనివచ్చుచుండెను. అతనిని విరోచనునితో జరిపిన యుద్ధములో విరోచనుడు ప్రయోగించిన అస్త్రములచే ఏర్పడిన వ్రణముల కాయలు మిక్కిలిగా ఏర్పడెను. వానితో పూర్వము ఇంద్రుని వజ్రాయుధ ప్రహారముల వలన కల్గిన గాయముల కాయలు కలిసి మరింత అధికమైనవి.

గరుడుడు ఆ కిరీటమును ఆకాశమార్గమున కొనివచ్చునపుడు భూలోకమునందు కృష్ణావతారము సమయము. భగవానుడు కృష్ణరూపమున కిరీటమును, నెమలిఫించమును ధరించి బృందావనమున గోపాలురతో, గోవులతో క్రీడించుచుండెను. శ్రీకృష్ణుణి దివ్య తేజమును చూచిన గరుడుడు అతడు పరమాత్మయేనని గుర్తించి, అతని శిరస్సుపై తాను కొనివచ్చు కిరీటమును అలంకరించెను. ఆ కిరీటము పాలసముద్రమువలె మిక్కిలి పెద్దది. దానితేజస్సు, నిర్మాణసన్నివేశము మొదలగు వానియందు కూడ చాలగొప్పది. ఇట్టి గొప్ప కిరీటము గోపాలబాలుడగు శ్రీకృష్ణునకు ఎట్లు సరిపోవును ? కాని ఆశ్చర్యముగా శ్రీకృష్ణుని శిరస్సునకు ఆ కిరీటము అతికినట్లు సరిపోయెను. గరుడుడు తన తలపై కిరీటమును పెట్టగానే శ్రీకృష్ణుడు తన సంకల్పప్రభావముచే తన చిన్న శిరస్సునకు అది చక్కగా సరిపోవునట్లుచేసెను. శ్రీకృష్ణునకు కల అన్ని ఆభరణములలో మిక్కిలి గొప్పగా ప్రకాశించునది అతని తలపై నున్న నెమలిఫించము. శ్రీకృష్ణుని తలపై గరుడుడు అలంకరించిన దివ్యకిరీటము నెమలిపింఛముతో సమానముగా వెలిగెను. దానిని దర్శించిఆనందించిన గరుడ భగవానుడు మనకుగల గొప్పవైన సంసారబంధములను హరించునుగాక !



ఈ శ్లోకమును ప్రస్తావింపబడిన వృత్తాంతము బ్రహ్మకైవర్తపురాణములోని యాదవగిరి మాహాత్మ్యమున వర్ణింపబడినది. అందలి శ్లోకములు ఇచట ఉట్టంకింపబడుచున్నవి. **"పురాప్రహ్లాద తనయో నామ్నా సోఽ భూత్ విరోచనః, పత్యుః క్షీరాంబుధేః మధ్యే చకారాచ్యుత సేవనమ్, కదాచిత్ యోగనిద్రాయాం నిర్జగ్ముః మునయః పరే, ప్రహ్లాదాన్వయయోగేన ప్రభూతాం భక్తి ముద్వహన్, అంతరంగత్వ మాస్థాయ సిషేవే స విరోచనః, అవకాశే కిరీటం చ విష్ణో రపజహార సః, పలాయిష్ట చ వేగేన పాతళోదరగహ్వరే, ప్రాబుధ్యత తతః పశ్చాత్ భగవాన్ రమయా సహ, ఆజగ్ముః సహసా సర్వే భగవత్సేవకాః జనాః, దదృశుః పుండరీకాక్షం కిరీటం నోపలేభిరే, భగవంతం చ పప్రచ్ఛుః భక్త్యా భీత్యా చ విహ్వలాః, భగవాన పి తాన్ ప్రాహ నిద్రాళుః కిన్ను వేద్మ్యహమ్, ఇతి తద్వచనం శ్రుత్వా సర్వే తే విష్ణుకింకరాః, ప్రాయో విరోచనేనైవ లుంతాకే నాత్ర భూయతే, అన్యే వయ మమీ సర్వే వసామో హ్యత్ర సేవకాః, సఖల్వసురవంశోఽ భూత్ సర్వదా వామ మీక్షతే, అధునా చ పలాయిష్ట తస్మాత్ చోరో విరోచనః, ఇతి సర్వే వినిశ్చిత్య వైనతేయం బభాషిరే, త్వం హి సర్వేషు చాస్మాసు వేగవాన్ బలవత్తరః, గత్వా విరోచనం జిత్వా కిరీటం సహసాఽ నయ, ఇతి తైః చోదితః శ్రీమాన్ వినతాతనయో యయౌ, త్రిభిః ముహూర్తైః భవనం పర్యటన్ పక్షిపుంగవః, పాతాలోదరకోణస్థం దదర్శ స విరోచనమ్, ద్వయో రాయోధనం తత్ర బభూవ సుమహత్తరమ్, తీక్ష్ణేన శంకులాకోటి వక్రేణ విహగేశ్వరః, తుండాగ్రేణ శిర స్తస్య తాడయామాస వేగతః, తతో విరోచనం జిత్వాసమరే విహగాధిపః, ఆదాయ చ కిరీటం తదాజగామ నభస్థలే, అగ్రతో దదృశే కించిత్ ధామ శ్యామల మద్భుతమ్, ఆబ్రహ్మలోకవితతం, గచ్ఛతా హి గరుత్మతా, విస్మయావిద్ధనయనః పరితోఽ యం వ్యలోకయత్, అథ బృందావనే కించిత్ కర్ణోపాంతస్థలద్భ్రుశమ్, వ్యత్యస్తన్యస్తచరణం విమలాననపంకజమ్, పింఛావతంససుభగం గుంజాహారవిభూషణమ్, లాంగలీకర్ణపూరం తం లలితస్మితశాలినమ్, ఉత్పలారణ్యకాంతీనా ముపదేశవిధాయిభిః, ఆలోకనై శ్చ గోపీనా మధికశ్యామవిగ్రహమ్, అశ్రాంత మపి సంతోషా దధరామృతపాయినః, రంధ్రే రంధ్రే చ వంశస్య వ్యావృతాంగుళిపల్వలమ్, అర్ధదష్టతృణాంకూరైః గోభిరాలోకితం ముదా, గోపాలకులసంభూతైః బాలై శ్చ పరివారితమ్, గాయంతం కుహనాగోపం దదర్శ వినతాసుతః, ద్విలక్షార్ధప్రమాణస్య యోజనానాం మహీయసామ్, క్షీరాబ్ధిశాయినో విష్ణోః కిరీటం తన్మహత్తరమ్, మూర్ధ్ని తస్యైవ బాలస్య ముదితో వినతాసుతః, నిచిక్షేప తత స్తస్య కిరీటం శిరసి స్థితమ్, సమప్రమాణ మభవత్ సహ పింఛవిభూషణైః, తతః ప్రణమ్య గరుడో భక్త్యా గోపాలబాలకమ్".**

సర్పఘాతీ సః మహతామ్ అస్మదత్యాహతీనాం సంఘాతం హరతు

గరుడుడు భగవానుకు యుద్ధమున సహాయము చేయుట

50. రుంధ్యాత్ సంవర్తసంధ్యాఘనపటలకనత్పక్షవిక్షేపహేలా-
వాతూలస్ఫాలతూలాంచలనిచయతులాధేయదైతేయలోకః ।

**ఆస్మాకైః కర్మపాకై రభిగతమహితానీక మప్రత్యనీకైః**
**దీవ్యన్ దివ్యాపదానైః దనుజవిజయినో వైజయంతీశకుంతః ॥**

సంవర్త = ప్రళయకాలమునందలి, సంధ్యా = సంధ్యాకాలములోగల, ఘనపటల, = మేఘసమూహము వలె, కనత్ = ప్రకాశించు,పక్ష = ఱెక్కలను, విక్షేపహేలా = విసరుట అను లీలవలనకల్గిన, వాతూల+ఆస్ఫాల = గొప్పగాలి వీచుటచే ఎగురుచున్న, తూల+అంచలనిచయ = చిన్నదూదిపింజల సమూహముతో, తులా + ఆధేయ = త్రాసుయందు ఉంచదగిన, దైతేయలోకః = అసురుల సమూహమున కల్గిన వాడు, అప్రత్యనీకైః = అసమానమైన (ఎదురులేని), దివ్య+అపదానైః = అద్భుత కృత్యములతో, దీవ్యన్ = ప్రకాశించువాడు అగు, దనుజవిజయినః = అసురులపై విజయమును పొందునట్టి భగవానుని యొక్క, వైజయంతీ శుకుంతః = ధ్వజమైయుండు పక్షి (గరుడుడు), ఆస్మాకైః = మన యొక్క, కర్మపాకైః = పుణ్య పాప రూప కర్మముల ఫలితములచే, అభిగతమ్ = వచ్చునట్టి, అహిత+ ఆనీకమ్ = కష్టముల సమూహమును, రుంధ్యాత్ = అడ్డగించునుగాక !

పూర్వము ఒకానొక సమయమున భగవానుడు మాల్యవంతుడు మొదలగు అసురులతో ఘోరయుద్ధమును చేసి విజయుడయ్యెను. ఆ యుద్ధమున భగవానునకు ధ్వజమైయున్న గరుడుడు అతనిని సహాయముగా నుండి, అసమానములైన అద్భుతకృత్యములను పెక్కింటిని అవలీలగా చేసెను.. ఎల్లప్పుడు సాయంసమయమున మేఘములకు బలిమి అధికము. ప్రళయకాలమున సాయం సమయములోని మేఘముల బలము మరింత ఎక్కువ. అట్టి మేఘముల వరుసలవలె గరుడుని ఱెక్కలు ప్రకాశించుచున్నవి. ఆ యుద్ధమున గరుడుడు తన పక్షములను లీలగా వీచెను. దానివలన పుట్టిన గొప్ప గాలియందు దూదిపింజల సమూహములవలె అసురుల సమూహములు చెదఱిపోయెను. గరుడుడు చేసిన ఈ సేవల వలననే అసురులపై భగవానునకు విజయము ప్రాప్తించినది. ఇట్టి గొప్పతనమును కల గరుడుడు మన పుణ్యాపాపముల రూపములోనున్న కర్మల ఫలితముగా వచ్చు కష్టముల సమూహమును పోగొట్టును గాక ! **“సంవర్తసంధ్యేతి”** సమాసమునకు సాయంకాల సంధ్యారాగమువలె ఎఱ్ఱని వర్ణములో ప్రకాశించు ఱెక్కలను కలవాడనియు చెప్పవచ్చును.

ఆకాశమున అసురుల సమూహములు దూది పింజలవలె చెదఱి పోవుట సాధ్యము కాకున్నను అట్లు వర్ణించుటచే అతిశయోక్తి, **“పటలకనత్పక్ష”** అను ప్రయోగమున లుప్తోపమయు కలవు.

**దనుజవిజయినః వైజయంతీ శకుంతః ఆస్మాకైః**
**కర్మపాకైః అభిగతమ్ అహితానీకం రుంధ్యాత్**

**గరుడుని మహిమాతిశయము**

**51.** **యత్పక్షస్థా త్రివేదీ త్రిగుణజలనిధిః లంఘ్యతే యద్గుణజ్ఞైః**
**వర్గ స్త్రైవర్గికాణాం గతి మిహ లభతే నాథవద్య త్సనాథః ।**



**త్రైకాల్యోపస్థితాత్ స త్రియుగనిధి రఘా దాయతాత్ త్రాయతాం నః**
**త్రాతానేకస్త్రిధామ్న స్త్రిదశరిపుచమూమోహనో వాహనేంద్రః ॥**

త్రివేదీ =మూడు వేదములు, యత్పక్షస్థా = ఎవని ఱెక్కలయందున్నచో, యత్గుణజ్ఞైః = ఎవనిగుణములను తెలిసినవారిచే, త్రిగుణజలనిధిః = సంసారసాగరము (కూడ), లంఘ్యతే = దాట బడుచున్నదో, ఇహ = ఈ లోకమున, త్రైవర్గికాణామ్ = మూడు పురుషార్థములను కోరువారియొక్క, వర్గః = సమూహము, యత్ స నాథః = ఎవరిచే నాథుని కల్గినదగుచున్నదై, నాథవత్ = భగవానునివలె, గతిమ్ = సద్గతిని (సంచారమును), లభతే = పొందుచున్నదో, త్రియుగనిధిః = ఆఱు గుణములకు నిధియై, త్రాత+అనేకః = పలువురను రక్షించినవాడై, త్రిదశరిపుచమూః = అసురుల సేనను, మోహనః = మోహించేయువాడై, త్రిధామ్నః = మూడు నిలయములను కల భగవానునకు, వాహనేంద్రః = గొప్ప వాహనమగు, సః = ఆ గరుడుడు, త్రైకాల్య = మూడు కాలములందును, ఉపస్థితాత్ = సంభవించు, ఆయతాత్ = విస్తృతమైన, అఘాత్ = పాపమునుండి, నః = మనలను, త్రాయతామ్ = రక్షించునుగాక !

గరుడభగవానుని దివ్యదేహము వేదమయము. అతని ఱెక్కలలో ఋక్-యజుస్-సామములను మూడు వేదములు అణగియున్నవి. అతనియొక్క జ్ఞానము, శక్తి, బలము మొదలగు గుణములను తెలిసినవారు సత్త్వ-రజస్, తమస్సులను మూడు గుణములకు నిలయమగు సంసారమండలమును క్రమముగా దాటి, మోక్షమును పొందుదురు. ధర్మ-అర్థ, కామములను మూడు పురుషార్థములను పొందగోరువారును గరుడుని సహాయముతో భగవానునివలె గతిని (ఫలమును, గమనమును) పొందుదురు. ఇట్టి గరుడభగవానుడు క్షీరాబ్ధి, సూర్యమండలము, యోగుల హృదయములను మూడు స్థలములలో నివసించు భగవానునకు గొప్ప వాహనము. జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అను ఆఱుగుణములకు నిలయము అగు గరుడభగవానుడు. పలువురను పలు సమయములలో రక్షించెను. బాల్యము, యౌవనము, కౌమారము అను మూడు దశలను మాత్రమే కల దేవతలకు శత్రువులగు అసురుల వర్గమును మోహింపచేసి, వారిస్థితి చెడునట్లు చేయువాడితడు. ఇట్టి గరుడభగవానుడు భూత, వర్తమాన, భవిష్యత్తులను మూడుకాలములలో మనకు ఏర్పడు గొప్ప పాపములనుండి మనలను రక్షించును గాక !

**“త్రిగుణజలనిధిః”** అనునపుడు రూపకము, **“త్రైవర్గికాణాం వర్గో నాథవత్ గతిం లభతే”** అనునపుడు ఉపమాంగములన్నియు ఉండుటచే పూర్ణోపమయు కలవు.

**త్రిధామ్నః వాహనేంద్రః త్రైకాల్యోపస్థితాత్ ఆయతాత్ అఘాత్ నః త్రాయతామ్**

**ఫలశ్రుతి**

**52.** **సైకాం పంచాశతం యా మతనుత వినతానందనం నందయిష్యన్**
**కృత్వా మౌలౌ తదాజ్ఞాం కవికథకఘటాకేసరీ వేంకటేశః ।**
**తా మేతాం శీలయంతః శమితవిషధరవ్యాధిదైవాధిపీడాః**
**కాంక్షాపౌరస్త్యలాభాః కృత మితరఫలైః తార్క్ష్యకల్పా భవంతి ॥**

కవికథకఘటాకేసరీ = కవులు, తార్కికులు అను గజసమూహమునకు సింహమువంటి, వేంకటేశః = వేంకటేశకవి (వేదాంత దేశికులు), వినతానందనమ్ = వినతకుమారుడగు గరుడుని, నందయిష్యన్ = సంతోషింపచేయుచు, తత్+ఆజ్ఞామ్ = ఆగరుడుని ఆజ్ఞను, మౌళౌ కృత్వా = శిరస్సున ధరించి, సైకామ్ = ఒక శ్లోకముతో కూడిన, యామ్ = ఏ, పంచాశతమ్ = ఏబది శ్లోకములను, అతనుత = విస్తరించెనో (రచించెనో), ఏతాం తామ్ = ఇట్టి ఆస్తుతిని, శీలయంతః = అనుసంధించువారు, శమిత = శమింపచేయబడిన, విషధర = పాముల, వ్యాధి = రోగముల, దైవ+ఆధిపీడాః =భూతప్రేత పిశాచముల, మానసికరుగ్మతల బాధలను కలవారై, కాంక్షా = కోరిన కోరికను, పౌరస్త్య = ముందుగానే, లాభాః = ఫలములను పొందువారై, తార్క్ష్యకల్పాః = గరుడునితో సమానులై, భవంతి = అగుదురు, ఇతర ఫలైః = మిగిలిన ఫలములతో, కృతమ్ = చాలును (పనిలేదు అనిభావము)

గరుడుడు తన విషయమున ఈ స్తోత్రమును రచింపుమని దేశికులను నియమించెను. కవులు, తార్కికులు అను గజములకు సింహమువంటి వారగు (వారిని అణచువారగు) వేదాంతదేశికులు గరుడభగవానుని ఆజ్ఞను శిరసావహించి ఏబదియొక్క శ్లోకములతో కూడిన ఈ స్తుతిని రచించిరి. దీనిని అనుసంధించువారికి పాములు మొదలగు విషజంతువులవలన, పిశాచములు మొదలగు వానివలన ఎట్టి బాధలు కలుగవు. మనస్తాపములు తీరును. వారు తమ మనస్సున ఏదైన కోరుకొనవలెనని అనుకొన్నచో అట్లు కోరుకొనుటకు ముందుగానే ఆఫలమును వారు పొందుదురు. గరుడునివలె గొప్పతనమును వారు పొందుదురు. మిగిలిన ఫలితములను గూర్చి చెప్పవలసిన పనిలేదు కదా !

**"కవికథకఘటాకేసరీ"** అను ప్రయోగమున రూపకము కలదు. **"తార్క్ష్యకల్పాః"** అనుటచే గరుడునివలె భగవానునకు నిత్యకైంకర్యమును చేయువారగుదురు, అంతకంటె ఏమి ఫలము కావలెను? అనియు తాత్పర్యము. గరుడుడు భగవానుని దాసులలో ప్రధానుడు, అతని కైంకర్యము ప్రధానమైనది కదా ! **"ఇతరఫలైః కృతమ్"** అను ప్రయోగము కూరనారాయణమునుల సుదర్శన శతకములోచివర గల **"కృత మిహ బహునా"** అను ప్రయోగమును తలపింపచేయును. సంస్కృతవ్యాఖ్యలో ఈ శ్లోకభావము ఈ క్రిందివిధముగా తెలుపబడినది.**"కవితార్కిక కేసరీ వేంకటనాథో గరుత్మదాజ్ఞాం శిరసి నిధాయ ప్రతిశ్లోకం గరుడనదీతటే అగ్రతోఽశ్వత్థవృక్ష మాశ్రితస్య తస్య గరుత్మతో మను మావర్తయన్ సన్, గరుడపంచాశత మతనుత. తత్పరిశీలనపరాః సర్వవ్యాధిదైవమనః పీడాభయ సమూహాత్ దూరీకృతాః, ఇహ లోకే వాంఛితాభీష్టవస్తులాభాః పరిత్యక్త ధర్మార్థకామఫలాః గరుత్మతా సహ వైకుంఠవాసోచితాః భవంతీత్యర్థః"**

**ఏతాం సైకాం పంచాశతం శీలయంతః కాంక్షా పౌరస్త్యలాభాః**
**కృత మితరఫలైః తార్క్ష్యకల్పా భవంతి**

**ఇత్థం గరుడపంచాశ ద్వ్యాఖ్యైషా శ్రద్ధయాఽర్పితా ।**
**అర్చనా భాష్యకారేణ భవేద్గరుడనందినీ ॥**



# గరుడదండకము

**శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ ।**
**వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥**

**నమః పన్నగనద్ధాయ వైకుంఠవశవర్తినే ।**
**శ్రుతిసింధుసుధోత్పాదమందరాయ గరుత్మతే ॥**

పన్నగములచే అలంకరింపబడినవాడు, భగవానుని అధీనములో నున్నవాడు అగు గరుడుడు వాసుకి అనెడి త్రాటిచే చుట్టబడిన, కూర్మరూపి అయిన భగవానుని ఆధారముగాగల మందరపర్వతమువలె నున్నాడు. మందరపర్వతము పాలసముద్రమునుండి అమృతము జనించుటలో కారణమైనట్లే, వేదములను క్షీరసముద్రమునుండి అమృతమువంటి అర్థవిశేషములు స్ఫురించుటకు గరుడుడు కారణము. అట్టి మహిమగల గరుడునకు నమస్కారము.

1. **గరుడ మఖిలవేదనీడాధిరూఢం, ద్విషత్పీడనోత్కంఠితాకుంఠవైకుంఠపీఠీకృతస్కంధ మీడే స్వనీడాగతిప్రీతరుద్రాసుకీర్తిస్తనాభోగగాఢోపగూఢం, స్ఫురత్కంటకవ్రాత-వేధవ్యథావేపమానద్విజిహ్వాధిపాకల్పవిష్పార్యమాణ స్ఫటావాటికారత్నరోచిశ్ఛటారాజి-నీరాజితం కాంతికల్లోలినీరాజితమ్.**

గరుడుడు వేదములు అనెడి గూటిలో నివసించువాడు, శత్రువులను చంపుటలో ఉత్కంఠను కల విష్ణువునకు పీఠముగా చేయబడిన స్కంధభాగమును కలవాడు. అతడు తమవద్దకు వచ్చుటచే మిక్కిలి ఆనందించిన భార్యలగు రుద్రాసుకీర్తులు తమ స్తనాభోగముతో గాఢముగా కౌగలించుకొనగా అపుడు కల్గిన సంతోషమువలన గరుడునకు రోమాంచము కలిగెను. ఆ గగుర్పాటువలన గరుడుని నగలవలె చుట్టియున్న సర్పరాజులకు మిక్కిలి బాధకల్గెను. అపుడు ఆ సర్పరాజులు తమ పడగలను విప్పగా అందలి రత్నములయొక్క కాంతుల వరుస గరుడునకు నిరాజనములను ఇచ్చినట్లుండెను. ఆ కాంతి ఒక నది వలె తోచెను. అట్టి వైభవమును కల గరుడుని స్తుతింతును.

2. **జయ గరుడ, సుపర్ణ, దర్వీకరాహార, దేవాధిపాహారహారిన్, దివౌకస్పతిక్షిప్త దంభోళిధారాకిణాకల్ప, కల్పాంతవాతూలకల్పోదయానల్పవీరాయితోద్యచ్చమత్కార-దైత్యారి గరుత్మన్, జైత్రధ్వజారోహనిర్ధారితోత్కర్ష, సంకర్షణాత్మన్, మరుత్పంచకాధీశ సత్యాదిమూర్తే న కశ్చిత్ సమ స్తే నమ స్తే పున స్తే నమః.**

గొప్ప ఱెక్కలను కలవాడా ! పాములను ఆహారముగా కలవాడా ! ఇంద్రునకు ఆహారమగు

సుధను హరించినవాడా ! ఇంద్రునిచే ప్రయోగింపబడిన వజ్రాయుధము యొక్క అంచు తగులుటచే కల్గిన కాయలను (కిరణములను) ఆభరణముగా కలవాడా ! ప్రళయకాలములో పుట్టు వాయువువంటి జన్మప్రకారమును కలవాడా ! సాటిలేని వీర్యముచే కల్గిన సామర్థ్యమును కలవాడా ! విష్ణువుయొక్క విజయమునకు గుర్తుఅగు ధ్వజమున నుండుటచే తెలిసికొనబడిన గొప్పతనమును కలవాడా ! సంకర్షణరూపా ! ప్రాణము మొదలగు అయిదు విధములైన వాయువులకు ఆదిదైవములగు సత్యము మొదలగు అయిదు విధములైన రూపములను కలవాడా ! గరుత్మంతుడను పేరుకలవాడా ! సర్వోత్కర్షతో వెలుగొందుము. నీకు సరి ఎవ్వరునులేరు. నీకు నమస్కారము. మరల నమస్కారము.

3. **నమ ఇద మజహత్సపర్యాయ, పర్యాయనిర్యాతపక్షానిలాస్ఫాలనోద్వేలపాథో-ధివీచీచపేటాహతగాధపాతాళభాంకార సంక్రుద్ధనాగేంద్ర పీడాసృణీభావభాస్వ-న్నఖశ్రేణయే, చండతుండాయ, నృత్యద్భుజంగభ్రువే, వజ్రిణే దంష్ట్రయా, తుభ్య మధ్యాత్మవిద్యా విధేయా విధేయా భవద్దాస్య మాపాదయేథా:. దయేథా శ్చ మే.**

ఎల్లప్పుడు పూజింపబడువాడవు, పర్యాయముగా విస్తరించు ఱెక్కలగాలి వేగముచే తీరమును దాటిన సముద్రములోని అలలు అను అరచేతులచే కొట్టబడినదగుటచే పాతాళమున "భాం" అను శబ్దము ఏర్పడగా, దానిని వినిన దిగ్గజములు కోపింపగా, అట్టి దిగ్గజములను కూడ బాధింపగల్గిన అంకుశములవంటి గోళ్లలను కల్గినవాడవు, మిక్కిలి కఠినమైన ముక్కు అగ్రభాగమును కలవాడవు, నృత్యము చేయు పామువంటి కనుబొమ్మలను కలవాడవు, కోఱలనెడి వజ్రాయుధమును కలవాడవు అగు గరుడనామధేయా ! నీకు నమస్కారము. నీ దాసుడనగు నాకు వేదాంతవిద్యను ప్రసాదింపుము. నన్ను నీ ధ్యానమును చేయునట్లు కరుణింపుము. నాపై దయ చూపుము.

4. **మను రనుగతపక్షివక్త్రస్ఫురత్తారక స్తావక శ్చిత్రభాను ప్రియాశేఖర స్త్రాయతాం న స్త్రివర్గాపవర్గప్రసూతి: పరవ్యోమధామన్ బలద్వేషి - దర్పజ్వలద్వాలఖిల్యప్రతిజ్ఞావతీర్ణ, స్థిరాం తత్త్వబుద్ధిం పరాం భక్తిధేనుం జగన్మూలకందే ముకుందే మహానందదోగ్ధ్రీం దధీథా ముధా కామహీనా మహీనా మహీనాంతక.**

అనువర్తించు ప కారముతో కూడిన క్షి అను అక్షరము కల్గినది, పూర్వము ఓంకారమును, చివర స్వాహాశబ్దమును కల్గినది, నాల్గు పురుషార్థములకు స్థానమైనది అగు నీ మంత్రము మమ్మును కాపాడును గాక ! వైకుంఠమును నెలవుగా కల ఓ గరుడదేవా ! ఇంద్రుని గర్వమువలన కోపించిన వాలఖిల్యుల ప్రతిజ్ఞవలన నీవు అవతరించితివి. సర్పశ్రేష్ఠములను అంతమొందించు స్వామీ ! స్థిరమైన పరావరతత్త్వజ్ఞానమును నాకు కల్గింపుము. లోకముల కంతటికిని మూలమగు శ్రీమన్నారాయణునిపట్ల గొప్పదైన, వ్యర్థప్రయోజనములేని, మహానందసంధాయిని అగు భక్తి అను కామధేనువును నేను పొందునట్లు అనుగ్రహింపుము.



**షట్త్రింశత్గణచరణో నరపరిపాటీనవీనగుంభగుణ: ।**
**విష్ణురథదండకోఽసౌ విఘటయతు విపక్షవాహినీవ్యూహమ్ ॥**

ముప్పదిఆఱు గణములను కల్గిన పాదములతో కూడినది, నగణరగణముల వరుసను కల్గినది, కావుననే నవ్యమైన రచనావిశేషణముతో శోభిల్లునట్టి ఈ గరుడదండకమును పఠించువారికి శత్రువుల సేనావ్యూహభంగములను ఫలముగా పొందుదురు.

**విచిత్రసిద్ధిద స్సోఽయం వేంకటేశవిపశ్చితా ।**
**గరుడధ్వజతోషాయ గీతో గరుడదండక: ॥**

ఇట్లు గరుడదండకమును ముగించిన పిమ్మట దేశికులు స్తోత్రకర్తనామము తెలియనిచో స్తోత్రమునకు శిష్టపరిగ్రహత్వము కలదో లేదో అను సందేహము పాఠకులకు కల్గునని తలచి, తమచే ఈ దండస్తుతి రచింపబడినదని తెల్పుచు, ఈ స్తోత్రమును పఠించిన పలు ఫలములు సిద్ధించుటతోపాటు, పరమప్రయోజనమగు భగవన్ముఖోల్లాసమును కల్గునని తెలుపుచున్నారు. పలు విచిత్రములైన ఫలములను అనుగ్రహించు ఈ గరుడదండకమును వేంకటేశులను పేరునుకల వేదాంతదేశికులనెడి విద్వాంసులు భగవానుని సంతోషముకొఱకు రచించిరి.

**కవితార్కిక సింహాయ కళ్యాణగుణశాలినే ।**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమ: ॥**

# అనుబంధము

## శ్రీగరుడాయ నమః

## శ్రీగరుడాష్టోత్తరశతనామస్తోత్రమ్

దేవ దేవ మహాదేవ సర్వజ్ఞ కరుణానిధే ।
శ్రోతు మిచ్ఛామి తార్క్ష్యస్య నామ్నా మష్టోత్తరం శతమ్ ॥

శృణు దేవ పరం శ్రేష్ఠం గరుడస్య మహాత్మనః ।
వైనతేయః ఖగపతిః కాశ్యపేయో మహాబలః ॥

తప్తకాంచనవర్ణాభః సుపర్ణో హరివాహనః ।
ఛందోమయో మహాతేజాః మహోత్సాహో మహాబలః ॥

బ్రహ్మణ్యో విష్ణుభక్త శ్చ కుందేందుధవళాననః ।
చక్రపాణిధర శ్రీమాన్ నాగారిర్నాగభూషణః ॥

విద్వన్మయో విశేషజ్ఞః విద్యానిధి రనామయః ।
భూతిదో భువనత్రాతా భయహా భక్తవత్సలః ॥

సప్తచ్ఛందోమయః పక్షీ సురాసురసుపూజితః ।
భుజంగభుక్ కచ్ఛపాశీ దైత్యహంతాఽరుణానుజః ॥

నిగమాత్మా నిరాధారో నిస్త్రైగుణ్యో నిరంజనః ।
నిర్వికల్పః పరంజ్యోతిః పరాత్ పరతరః పరః ॥

శుభాంగః శుభద శ్శూరః సూక్ష్మరూపీ బృహత్తమః ।
విషాశీ విజితాత్మా చ విజయో జయవర్ధనః ॥

అజాస్యో జగదీశ శ్చ జనార్దనమహాధ్వజః ।
ఘనసంతాపనచ్ఛేత్తా జరామరణవర్జితః ॥

కళ్యాణదః కళాతీతః కళాధరసమప్రభః ।
సోమపః సురసంఘేశః యజ్ఞాంగో యజ్ఞభూషణః ॥

వజ్రాంగో వరదో వంద్యో వాయువేగో వరప్రదః ।
మహాజవో విదారీ చ మన్మథ ప్రియబాంధవః ॥

యజుర్నామాఽనుష్టుభుజః మారకో సురభంజనః ।
కాలజ్ఞః కమలేష్ట శ్చ కలిదోషనివారణః ॥





స్తోమాత్మా చ త్రివృన్మూర్ధా భూమా గాయత్రిలోచనః ।
సామగానరత స్స్రగ్వీ స్వచ్ఛందగతి రగ్రణీః ॥

వినతానందన శ్రీమాన్ విజితారాతిసంకులః ।
పతద్వరిష్ఠ స్సర్వేశః పాపహా పాపమోచకః ॥

అమృతాంశోఽమృతవపుః ఆనందగతి రగ్రణీః ।
సుధాకుంభధర శ్రీమాన్ దుర్ధరో సురభంజనః ॥

అగ్రజి జ్జయగోప శ్చ జగదాహ్లాదకారకః ।
గరుడో భగవాన్ స్తోత్రః స్తోభః స్వర్ణవపు స్స్వరాట్ ॥

విద్యున్నిభో విశాలాంగో వినతాదాస్యమోచకః ।
ఇతీదం పరమం గుహ్యం గరుడస్య మహాత్మనః ॥

నామ్నా మష్టోత్తరం పుణ్యం పవిత్రం పాపనాశనమ్ ।
గీయమానం మయా గీతం విష్ణునా సముదీరితమ్ ॥

సర్వజ్ఞత్వం మనోజ్ఞత్వం కామరూపత్వ మేవ వా ।
అమరత్వమ్ ఋషిత్వం వా గంధర్వత్వ మథాఽపి వా ॥

అణిమాదిగుణం చైవ హ్యష్టభోగం తథా భవేత్ ।

ఇదం తు దివ్యం పరమం రహస్యం
సదా సుజప్యం పరమాత్మయోగిభిః ।
మనోహరం హర్షకరం సుఖప్రదం
ఫలప్రదం మోక్షఫలప్రదం చ ॥

సుపర్ణం వైనతేయం చ నాగారిం నాగభూషణమ్ ।
విషాంతకం జితామిత్రం అజితం విశ్వతోముఖమ్ ।

గరుత్మంతం ఖగపతిం తార్క్ష్యం కశ్యపనందనమ్ ॥
ఏతద్ద్వాదశనామాని గరుడస్య మహాత్మనః ।

ప్రభాతే సంస్మరే ద్యో వై స్నాతో వా యది మానవః ।
విషం నాశయతే తస్య న హింసన్తి చ పన్నగాః ॥

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే ఉమామహేశ్వరసంవాదే
గరుడనామ్నామష్టోత్తరశతం సంపూర్ణమ్

సర్వే జనా స్సుఖినో భవన్తు

## శ్రీగరుడాష్టోత్తరశతనామావళిః

ఓం వైనతేయాయ నమః
ఓం ఖగపతయే నమః
ఓం కాశ్యపేయాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం తప్తకాంచనవర్ణాభాయ నమః
ఓం సుపర్ణాయ నమః
ఓం హరివాహనాయ నమః
ఓం ఛందోమయాయ నమః
ఓం మహాతేజసే నమః
ఓం మహోత్సాహాయ నమః
ఓం మహాబలాయనమః
ఓం బ్రహ్మణ్యాయ నమః
ఓం విష్ణుభక్తాయ నమః
ఓం కుందేందుధవళాననాయ నమః
ఓం చక్రపాణిధరాయ నమః
ఓం శ్రీమతే నమః
ఓం నాగారయే నమః
ఓం నిరాధారాయనమః
ఓం నిస్త్రైగుణ్యాయ నమః
ఓం నిర్వికల్పాయ నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం పరాత్పరతరాయ నమః
ఓం పరస్మై నమః
ఓం శుభాంగాయ నమః

ఓం శుభదాయ నమః
ఓం శూరాయ నమః
ఓం సూక్ష్మరూపిణే నమః
ఓం బృహత్తనవే నమః
ఓం విషాశినే నమః
ఓం విజితాత్మనే నమః
ఓం విజయాయ నమః
ఓం జయవర్ధనాయ నమః
ఓం అజాస్యాయాయ నమః
ఓం జగదీశాయ నమః
ఓం జనార్దనాయ నమః
ఓం మహాధ్వజాయ నమః
ఓం ఘనసతాపనచ్ఛేత్రే నమః
ఓం జరామరణవర్జితాయ నమః
ఓం కళ్యాణదాయ నమః
ఓం కళాతీతాయ నమః
ఓం కళాధరసమప్రభాయ నమః
ఓం సోమపాయ నమః
ఓం సురసంఘేశాయ నమః
ఓం యజ్ఞాంగాయ నమః
ఓం యజ్ఞభూషణాయ నమః
ఓం వజ్రాంగాయ నమః
ఓం వరదాయ నమః
ఓం వంద్యాయ నమః



ఓం వాయువేగాయ నమః
ఓం వరప్రదాయనమః
ఓం మహాజవాయ నమః
ఓం విదారిణే నమః
ఓం మన్మథప్రియబాంధవాయ నమః
ఓం యజుర్నామ్నే నమః
ఓం అనుష్టుభజాయ నమః
ఓం మారకాయ నమః
ఓం అసురభంజనాయ నమః
ఓం కాలజ్ఞాయ నమః
ఓం కమలేష్టాయ నమః
ఓం కలిదోషనివారణాయ నమః
ఓం స్తోమాత్మనే నమః
ఓం త్రివృన్మూర్ధ్నే నమః
ఓం భూమ్నే నమః
ఓం గాయత్రిలోచనాయ నమః
ఓం సామగానరతాయ నమః
ఓం స్రగ్విణే నమః
ఓం స్వచ్ఛందగతయే నమః
ఓం అగ్రణ్యే నమః
ఓం వినతానందనాయ నమః
ఓం శ్రీమతే నమః
ఓం విజితారాతిసంకులాయ నమః
ఓం పతద్వరిష్ఠాయ నమః

ఓం సర్వేశాయ నమః
ఓం పాపఘ్నే నమః
ఓం పాపమోచకాయ నమః
ఓం అమృతాంశవే నమః
ఓం అమృతవపుషే నమః
ఓం ఆనందగతయే నమః
ఓం అగ్రణ్యే నమః
ఓం సుధాకుంభధరాయ నమః
ఓం శ్రీమతే నమః
ఓం దుర్ధరాయ నమః
ఓం అసురభంజనాయ నమః
ఓం అగ్రజితే నమః
ఓం జయగోపాయ నమః
ఓం జగదాహ్లాదకారకాయ నమః
ఓం గరుడాయ నమః
ఓం భగవతే నమః
ఓం స్తోత్రాయ నమః
ఓం స్తోభాయ నమః
ఓం స్వర్ణవపుషే నమః
ఓం స్వరాజే నమః
ఓం విద్యున్నిభాయ నమః
ఓం విశాలాంగాయ నమః
ఓం వినతాదాస్యమోచకాయ నమః
ఓం శ్రీవైనతేయాయపక్షిరాజాయనమః



తమిళనాడులో కుంభకోణ సమీపమున క్రీ.శ. 18వ శతాబ్దిచివరలో 19వ శతాబ్ది పూర్వార్ధములో జీవించిన శ్రీరాఘవాచార్యులవారిచే రచింపబడిన

**<u>వైకుంఠవిజయ చంపూః అను కావ్యములోని గరుడస్తుతి శ్లోకములు</u>**

**వినతానందనః సోఽయం వినతానందనః సదా ।**
**భవతాపహరో భక్త్యా భవతా పర మీడ్యతామ్ ॥**

యః ఖలు నిఖిలసురాసురకోటీకోటీరకోటిఖచితమణిగణకిరణనికర-నీరాజితనలినచరణః, విహారసమయసంభ్రాంతనిఖిలనిగమమయనిజసంహనన-సమవలోకనసమయసముద్భవదమిత భయభరబంభ్రమ్యమాణమహోరగ-నివహస్ఫుటిత ఫణామణిపటల నిరర్గల నిస్సృత మరీచివీచిమాలాకరంబితదశ-దిశావకాశః, బలదమనముఖనిఖిలసురగణ కదనకుతుకసముద్యత సమరముఖవిఖ్యాతమహాబలవరాక్రమమహార్ణవ కాలదండప్రతిమ మహాశస్త్రశౌండప్రచండ కోపాఖండధరణీధరమండలకంటకాయమానాశేషదానవప్రకాండ ద్రుమషండఖండనసోత్సుక సమారూఢవైకుంఠపీఠీకృత-నిజాంసకః, దేవదానవగంధర్వ యక్షరాక్షసకిన్నరమహోరగాది జగద్దుర్మోచదుష్కరతర-తపఃప్రభావలబ్ధదుర్విజ్ఞేయ తమహహామాయావైశారద్యవిలసదింద్రజిత్ ప్రహితకపటమానుషదాశరథినాగబంధ నిర్ధూననకుతూహలసమాగమసమయసంభ్రమ సముజ్జృంభమాణపక్షపుట విక్షేపసముద్భూతమహావాతవ్రాతనిర్ధూతమహోదధిగర్భ నిర్బాధనిర్యాత నిర్వేలప్రసర మహోర్మిసంఘసంఘట్టనసంస్ఫుటితప్రాసాద-గోపురప్రాకారనిరీక్షణసముద్భవదమిత భయభరబంభ్రమ్యమాణదశప్రముఖ-రక్షోగణపలాయనకర్మనిర్మథితహృదయతదంతఃపురనితంబినీకదంబకృత-పరిదేవనవినదశ్రవణముదితమైథిలీహృదయకమలః, కర్తా సమస్తశాస్త్రాణాం, స్మర్తా సకలధర్మాణాం, హర్తా నిఖిలవైరివరూధినీనాం, సంహర్తాఃసర్వక్షుద్ర జంతూనాం, భర్తా సాధుజనానాం, ఆదేష్టా అఖిలసురాణామ్, ఉపదేష్టా సర్వనైగమ విజ్ఞానానాం, నిర్దేష్టా సాధ్వసాధువిభాగానాం, భీషయితా పిశాచకులానాం, పేషయితా నిఖిల జగదజ్ఞానతమసామ్, శోషయితా సంశ్రితజనసంసారసాగరౌఘానామ్, దూషయితా పరమపురుషేతరపారమ్య వాదానామ్, ఘోషయితా భగవదప్రమేయప్రభావానాం,



భూషయితా భగవదేకాంతిజనానామ్, కర్ణ ఇవ సతతప్రాప్తదానవారిసంగః, యజ్ఞభూవిశేష ఇవ దేవమయః, సింహ ఇవ ప్రస్ఫులద్ద్విపధ్వంసనధురీణః, గిరిజావత్ రుద్రాంగ సంగహర్షితాత్మా, ధార్మికనృపతి రివ సుకీర్తిశాలీ, తారగణ ఇవ విష్ణుపదసంశ్లేషశాలీ, కాకుత్స్థ ఇవ వినతానందనః, దేవకీనందన ఇవ సత్యానురక్తమనాః , విహంగమకులానాం కకుద్మాన్ గరుత్మాన్ చకాస్తి.

1. యద్గంధాఘ్రాణమాత్రాత్ ఖలు గలదసవో నిర్జరా స్సర్షిసంఘాః
   యక్షా రక్షాంసి సిద్ధా అపి దనుతనయాశ్చారణా వారణా శ్చ ।
   లీలామాత్రేణ తాదృక్ విషధరనికరం భక్షయన్ పక్షిమల్లో
   రక్షన్ పక్షాభివిక్షేపణచలితగిరిః నమ్రవర్గం విభాతి ॥

2. పీయూషాహృత్య హర్షాకులవలదమనక్షిప్తకాలానలాతి -
   జ్వాలామాలాఢ్యవజ్రక్షతకిణవిలసన్మేరుసంకాశమూర్తిః ।
   భృత్యైః దైత్యేంద్రదర్పద్రఢిమవిఘటనః పక్షిరాజః స భూయాత్
   ఆమ్నాయాత్మా నపాయా నవధికబలవాన్ ధూతహేయానుషంగః ॥

3. దైత్యవ్రాతప్రభీతత్రిదశపరివృతాయాతసుత్రామముఖ్య
   స్ఫాయత్కోటీరకోటిస్ఫుటఘటితమణీరాజినీరాజితాంఘ్రిః ।
   భింద్యాత్ సంధ్యాభ్రరోచిఃప్రచయనిజమహాపక్షవిక్షేపజృంభత్ -
   ఝంఝూవాతాభిఘాతక్షుభితజలనిధిః మద్విపక్షాన్ స పక్షీ ॥

4. ఛింది త్వం మద్విపక్షాన్ కలయ శమమితం భింధి కీర్తిం విషేభ్యః
   సంధిత్సాం సాధుభి ర్మే జనయ ఖగపతే త్వం ధియా మేకసూతిః ।
   క్షుద్రాన్ విద్రావయస్వ ప్రణిహితమనసాం త్వత్పదాంభోజయుగ్మే
   భద్రాణి ద్రా గ్విధత్స్వ త్రుటితకటురటద్వైరికూటాభిమానః ॥

5. భిత్వా పక్షాభిఘాతైః జలనిధిసలిలం భ్రామయిత్వా ఝషౌఘాన్
   గత్వా పాతాళలోకం విషధరనికరాన్ భక్షయిత్వా సలీలమ్ ।
   స్థిత్వా పద్భ్యాం గృహీత్వాఽన్యదపి జలధిసంశ్లేషతః ప్రాగతోర్ధ్వం
   ప్లుత్వాఽఽకాశే నటిత్వా విలసతి ఖగరాట్ యస్య మాం పాతు నిత్యమ్ ॥

6. యద్వేగోద్భూతశబ్దం ప్రళయపవనవజ్జృంభమాణం సుదూరే
శ్రుత్వా లోకః కిమేత్వితి వివిదిషయా యావ దున్మీలితేచ్ఛుః ।
తావ చ్ఛ్రుత్వా తమంతే సపది ఖలు తతోఽత్యంతదూరే చ దేశే
సంభ్రాంతః స్వాంత ఆసీత్ స శకుని రిహ నః త్రాయతా మాయతాక్షః ॥

7. స్వాచ్ఛ్యంద్యాత్ ధావమానే విహరణకుతుకే మేరుతుల్యే చ యస్మిన్
వేగాకృష్టత్రికూటక్షితిరుహనికరే సాధ్వసా సాధ్వసార్తః ।
హంసోఽప్యంసాధిరూఢం విధుయ విధుమపి (ద్రాక్ ?)- విలీనోక్తిదీనః
నిర్ధ్యాయాహో వృషోఽపి త్రినయనమసకౌ పక్షిరాట్ రక్షతాన్నః ॥

8. లోకా నాకులయన్ మహాబ్ధిమథనోద్భూతం ప్రభూతం విషం
పాతుం త్రాతుమనాః జగత్ పశుపతిః యః స్కంధసంబంధినమ్ ।
ధ్యాత్వాఽనంతమనంతవైభవనిధిం శ్రీవల్లభం దుర్లభం
సామాన్యైః ధృతసాధ్వసః తదపిబత్ తార్క్ష్యాయ తస్మై నమః ॥

9. త్రయస్త్రింశత్కోటిత్రిదశనికరత్రాణనిపుణ -
స్త్రయీమూర్తిః తార్క్ష్యః త్రినయననుతో ముక్తిఫలదః ।
త్రివర్గస్థైః సేవ్యః త్రిగుణగుణభిత్ త్ర్యక్షరమయః
త్రికాలజ్ఞః త్రయ్యంచలరతసుతః పాతు సతతమ్ ॥

10. సర్పకులదర్పహరసర్పణసలజ్జాహర్పతికగీర్పతినుతార్పయ కటాక్షమ్ ।
పాప మభితాపకర మాపద మపి త్వం శ్రీపతిరథాపనుద భూప విహగానామ్।

11. కామమభిరామతనుభూమభిరుదస్యన్ కామమరిభీమ నిజనామగరిమా త్వమ్।
వామశితధామ శతయామయుతవిద్యా రామనతకామదసరామ జయ తార్క్ష్య॥

12. పక్షివర రక్షితనతాక్షి సరసీజం ప్రక్షిప సుశిక్షితి మిదక్షితిప మహ్యామ్ ।
పక్షధుతివిక్షిపితతక్షకముఖాసత్యక్షహానిదక్ష పరిరక్ష చ విపక్షాత్ ॥

13. ఆయుష్మతం గరుత్మంతం కకుద్మంతం చ పక్షిణామ్ ।
ఆయుష్మంతం ప్రకుర్వంతం నమస్యంతం సదా భజ ॥

